The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య - సంగీత పత్రిక

పేజీలు : 68+8

వెల : రూ.10

1-15 జనవరి 2002



లోపల పేజీల్లో జంధ్యాల హాస్యనాటిక

## సినిమా తీస్తాన్ జాగ్రత్త

సెంటర్‌స్ప్రెడ్‌లో

సీమసింహం

టక్కరిదొంగ

పాటల పుస్తకాలు

అదనపు 8 పేజీల్లో ఎ.ఆర్.రెహమాన్

బీట్ అండ్ మెలోడీ సాంగ్స్ ప్లస్ స్పెషల్ ఆర్టికల్



జనవరి 14 జంధ్యాల
జయంతిని పురస్కరించుకుని
హాస్యప్రియులందరి కోసం...

హాసం



# ఇవీ సంగతులు

## హాస్యం



## సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
**సీమసింహం, టక్కరిదొంగ**
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో



హాస్యనాటికల శీర్షిక ప్రారంభం
జంధ్యాల హాస్యనాటకం - పేజీ 10

8 పేజీల ప్రత్యేక కానుక: ఎ. ఆర్. రహమాన్ పాటలు, వ్యాసం


ముఖచిత్రం: బాలకృష్ణ ('సీమసింహం' చిత్రం నుండి) కవర్ డిజైన్ :ఈరంకి




హాసం పత్రికకు కితాబు

హాసం వచ్చిందంటే చివరి పేజీ చూసేదాకా కింద పెట్టను. తీరిక దొరికినప్పుడు లోపలేం రాశారో చూడాలి.

-గ్రూచో బాపు

తమ విలక్షణ హాస్యనటనతో 1930 ప్రాంతంలో హాలివుడ్‌ను ఒక ఊపు ఊపిన మార్క్స్ సోదరులలో పెద్దవాడు గ్రూచో (1890-1977). ఆయనంటే బాపుగారికి విపరీతమైన అభిమానం. బాపు పైపు కాల్చటం అలవాటు చేసుకోవటానికి గ్రూచోపై గల అభిమానమే కారణమంటారు కొందరు. ఆ సరదాతోనే బాపుగారు తన సంతకాన్ని 'గ్రూచో బాపు' అని పెట్టారనుకుందాం. సం॥

16-31 డిసెంబరు పత్రిక చూసి యీ వివరణలూ సవరణలూ పంపుతున్నాను. చిత్తగించగలరు.

తమిళచిత్రం 'పెణ్'కి తెలుగు వర్షన్ ఉంది - 'సంఘం'! 28-29 పుటల మధ్య కొంత మేటర్ జారిపోయిందనుకొంటాను. అది వచ్చే సంచికలో అచ్చు వేయించండి. 'రైల్‌గాడీ' పాట 'ఆశీర్వాద్' చిత్రంలో రాకముందే, కొన్ని సంవత్సరాల ముందు, హరీంద్రనాధ్ చట్టోపాధ్యాయ దాన్ని ప్రైవేటు రికార్డుగా యిచ్చారు. రచనా వరసా ఆయనవే. 'రాప్' ధోరణి గానానికి ఆ పాట దారి తీసిందనడం అసమంజసం. 'ఏదో మత్తు మందు చల్లి' ఎవరు రికార్డు చేసినా దాని వరస మాత్రం 'అగర్ తుమ్ న ఆతే' అన్న 'ఖజానా' చిత్రంలోని లతా పాట. సి.రామచంద్రది.

సినిమాలో 'హలా' ప్రయోగం పింగళి వారిదే. తన సాటిస్త్రీని యిలా సంభోందించాలని భరత శాస్త్రంలో ఉందని చదివిన వారు చెప్పగా విన్నాను.

అశోక్ కుమార్ దక్షతతో నిర్మించబడిన అన్ని చిత్రాలలో అన్నిటా తలమానికం 'మహల్'. కథ, కథనం, సంగీతం, సాహిత్యం, పాటల చిత్రీకరణ, తక్కిన టేకింగ్, అతిసాధారణమైన నటనను అసాధారణమనిపించిన దర్శకత్వం, దయ్యాలు కాదు మనిషే దయ్యమనిపించిందని చివర తేల్చడం నభూతో నభవిష్యత్.

-వి.ఎ.కె.రంగారావు, చెన్నై

16-31 డిసెంబరు 2001 సంచికలో 28, 29 పేజీల మధ్య మిస్సయిన కొంత భాగం ఇది:

అశోక్ కుమార్ బాంబే టాకీస్ ద్వారా ఎన్నో గొప్ప చిత్రాలు నిర్మించాడు. ఎందరోగొప్ప వ్యక్తులను సినిమా రంగానికి, బొంబాయి చిత్రసీమకు పరిచయం చేశాడు.

బాంబే టాకీస్‌లో అతని భాగస్వామి సవాక్ వచా. ఆయన అశోక్‌కుమార్ ఎడిటింగ్ నేర్పిన గురువు. పాత రోజుల్లా 'అశోక్' అని పిలిచే స్థాయి కాదు అప్పటి అశోక్‌కుమార్‌ది. మిస్టర్ గంగూలీ అనలేడు. సార్ అనలేడు. అందుకని ఎలా పిలవాలా అని ఆలోచిస్తే "దాదామొనీ" తట్టింది. అశోక్ చెల్లెలు అతన్ని ఆ పేరుతోనే పిలుస్తుంది. దాదా అంటే హిందీలో తాత అయినా బెంగాలీలో అన్న అని అర్థం. మొనీ అనేది గౌరవంతో, ప్రేమతో పెద్దవాళ్లకు చేర్చే ఓ పదం. చెల్లెలు పిలవడంతో, బావగారు శశధర్ కూడా అలాగే పిల్చేవాడు. సవాక్ కూడా ఆ పేరుతోనే పిలవసాగేడు. క్రమంగా చిత్రసీమ యావత్తూ అలాగే పిలవసాగింది. బాంబే టాకీస్ బ్యానర్‌లో అనేక విజయవంతమైన సినిమాలు తీసినా అక్కౌంటెంటు చేసిన మోసం వల్ల (అశోక్ తెల్ల కాగితాల మీద సంతకం పెట్టి ఇస్తే అతను దుర్వినియోగం చేసాడు) నష్టం వచ్చింది. విసిగిపోయిన అశోక్ 1953లో తన షేర్లు అమ్మేసి బయటపడ్డాడు.

అశోక్‌కుమార్‌కి కామెడీ అంటే చాలా ఇష్టం. తొలి రోజుల్లో హాస్యపాత్రలు వేస్తానని అంటే హిమాంశురాయ్ వద్దనేవాడు. చాలాకాలం పోయాక ధైర్యం వచ్చాక "చల్తీకా నామ్ గాడీ", "విక్టోరియా 203", "ఛోటీసి బాత్", "చోరీ మేరా కామ్", "షౌకీన్", "చల్తీ కా నామ్ జిందగీ" వంటి అనేక చిత్రాలలో కామెడీ వేషాలు వేసి ఒప్పించాడు. కెరియర్ చివరిలో సోదరుడు అనూప్‌కుమార్‌కి ఆర్థిక సాయం చేయడానికి బాసు చటర్జీ దర్శకత్వంలో నటించిన టీవీ సీరియల్ "భీమ్ భవానీ" (1989)లో కూడా అతనిది హాస్యపాత్రే!

ఫిల్మిస్తాన్‌లో ఉన్నప్పుడు "షికారి" (1947) చిత్రానికి సంగీతం సమకూర్చడానికి కలకత్తా నుండి సచిన్ దేవ్ బర్మన్‌ను బొంబాయి పిలిపించడం జరిగింది. ఆ సినిమా పూర్తయ్యాక మూడు సంవత్సరాలు అయినా బర్మన్‌కి బొంబాయిలో స్థానం చిక్కలేదు. ఇక వెనక్కి వెళ్లిపోదామనుకుంటుండగా అశోక్ కుమార్ కలిసి మేం 'మషాల్' తీద్దామనుకుంటున్నాం. దీనికి సంగీతం ఇచ్చి చూడు. ఇది సక్సెస్ కాకపోతే వెళ్లిపోదువుగాని" అని ఆపేశాడు. 'మషాల్' సంగీతం హిట్ కావడంతో హిందీ చిత్రరంగానికి బర్మన్ దక్కాడు. సం॥

---

హాసంలో ఇన్ఫర్మేషన్ ఉంది. ఎంటర్‌టైన్‌మెంట్ ఉంది, అన్నిటికీ మించిన మెంటల్ రిలాక్సేషన్ ఉంది. చిన్ననాడు చూసిన సినిమాలు, వాటిల్లోని మధురమైన పాటలు, ఆ పాటల ముందు వెనుక జరిగిన ఆసక్తికరమైన విషయాలు [illegible] ఫ్లాష్ బాక్‌లోకి వెళ్ళి, తాదాత్మ్యానికి లోనయ్యాను.

హాసంలో సంగీతానికి పెద్దపీట వేశారు. అలాగే హాస్యానికి కూడా మరింత స్థానం కల్పిస్తే బాగుంటుంది. టెన్షన్ పెరిగి దైనందిన సమస్యలతో చావలేక బతుకుతున్న నేటి మనిషికి ఆ టెన్షన్స్ లోంచి కొంతసేపైనా బయటపడి హాయిగా రిలాక్స్ అయ్యేందుకు 'హాసం' మనసుకు ఒక మంచి టానిక్‌లాగా పని చేస్తుందనడంలో ఎలాంటి సందేహం లేదు.

హాసం నూరుకాలాల పాటు హాయిగా వర్ధిల్లాలని మనసారా కోరుకుంటున్నాను.

-డాక్టర్ ఇండ్ల రామసుబ్బారెడ్డి, విజయవాడ

ఆశతో ఎదురు చూసిన 16-31 డిసెంబర్ సంచికతో బోనస్‌గా అన్నట్లు పింగళివారివి 12 అద్భుతమణులు, సావిత్రి గారి మీద చిత్రీకరించిన (సోలో) 12 మాణిక్యాలు అందించి పాఠకుల మనస్సులలో కోపమేదైనా వుంటే చెరిపేసింది. ఆ 24 పాటలు కూడా బుక్‌లెట్ లాగా యివ్వటం చాలా వీలుగా వుంది. 69వ పేజీలో మొదటి కాలమ్‌లో చూపిన పాట "ఓ భావి భారత భాగ్యవిధాతలారా...." అన్నది అప్పుచేసి పప్పుకూడులో అని వేశారు. కాని అది 'పెళ్ళి చేసి చూడు' సినిమాలోనిది. చిన్నదిగా వున్నా రెండవ కవరు పేజిలోనూ, ఆ వ్యాసం క్రిందనూ వున్న ఫోటోలు అపురూపంగా వున్నాయి. రమణగారి కిచెన్‌కిట్, రాజా గారి స్కిట్ అలరించాయి. చిత్తరంజన్‌గారు 'సుందరదాసు' శ్రీ ఎం.ఎస్. రామారావు గారి గురించి విపులంగా తెలియజేశారు. ఆయన వీధికి ఆ అమర గాయకుని పేరు పెద్తారని తెలిసి ఆనందం కల్గింది.

-జి.ప్రభాకర్‌రావు, హైదరాబాద్

(పై పొరబాటుతో బాటు 'వేషము మార్చెనూ' 'నీకోసమే నే జీవించునది' పాటలలో గాయని లీలకు బదులు సుశీల అని అచ్చయింది.

-సం॥)

## ఆరోప్రాణం

అమాంతం చదివించుకుంది
ఆసాంతం హాసం నెం.6
ఇంకేం ఇకనుంచీ
ఇంటర్నెట్‌లో కూడా....
ఎడిటర్లకు సినిమాల గురించి
ఎటు జెడ్ తెలుసు
ఫీచర్సు చూస్తే లిరికల్‌గా
ఫీవర్ వచ్చినంత పనవుతోంది
కామెడీ స్కిట్ నే
సామిరంగా అనిపిస్తుంది
రావికొండలరావులా
రాయగల వాళ్లింకా కావాలి
సినీ సాంగ్సుతో పాటు తాజా
సినీ సినేరియోలు కూడా చదవాలని ఉంది
ఆపాత పాట రాజా వారి
ఆస్థానంలోకి వెళ్లి వింటున్నట్లుంది.

-డా॥ మిరియాల రామకృష్ణ, కాకినాడ

సంపుటి :1 సంచిక: 7

1-15 జనవరి 2002

పేజీలు: 76

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 7

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

ప్రతీ జనవరి రెండవ ఆదివారాన్ని నవ్వుల దినంగా ప్రపంచ హాస్య ప్రియులు జరుపుకుంటారు. ఆ సందర్భంగా హాస్యాన్ని గురించి కొన్ని మాటలు - నవ్వేశక్తి, దానికి కారణం ఊహించగల శక్తి ఒక్క మానవుడికి మాత్రమే ప్రకృతి ప్రసాదించింది. సాధారణంగా మనమెందుకు నవ్వుతామని ఆలోచించి చూడండి. మనవి కాని వేషభాషలు లేదా ఆకారం కంటబడినా, చెవిన పడినా మనం నవ్వుతామని మన అలంకారికులు నిర్వచనం చేశారు. అంటే వికృతమైన నూతనత్వాన్ని మన కన్నులూ చెవులూ అంగీకరించకపోతే చేసేదేమి లేక నవ్వి ఊరుకుంటామన్నమాట!

ఇంకొందరు ఇంతకంటె మరో మెట్టు పైకి వెళ్లి శబ్దము, రూపము, వికృతి పొందినప్పడే కాకుండా జీవితమంతా స్థూలంగానూ, సూక్ష్మంగానూ అంటే క్లోజ్‌గా, బ్రాడ్‌గా పరిశీలిస్తే హాస్యాన్ని పుట్టించే ఎన్నో సంఘటనలు ప్రతినిత్యము ప్రతి విషయంలోనూ కనబడుతూనే ఉంటాయి అన్నారు. ఎటొచ్చీ మనం చూచి, ఆ వికృతి (డిస్టార్షన్)ని తెలుసుకుని, యదార్థాన్ని వూహించుకుని, ఆనందించగలిగే శక్తి మనకుంటే చాలునన్నారు. సాధారణంగా మానవుని డాబూ దర్పం, అహంకారం, అవివేకం, అజ్ఞానం, కామం, రాగం, ద్వేషం వగైరా మానవ సహజమైన దౌర్బల్యాలు హాస్యాన్ని పుట్టిస్తాయి. వాటిని నాధారం చేసుకుని అనేక గాథలూ, ప్రహసనాలూ, పాత, కొత్త సాహిత్యంలో ఎన్నో ఉన్నాయి.

సంఘసంస్కరణకు హాస్యాన్ని ఉపయోగిద్దామనుకొనే రచనలలో అతిశయోక్తి, క్రోధమూ, అసహ్యమూ ఎక్కువవుతుంటాయి. అవి సరైన పాళ్లలో ఉంటే చక్కటి వ్యంగ్యరచనలవుతాయి. తెలుగునాట 1950-70ల మధ్య హాస్యరచనల ఉధృతి చాలా ఉంది. 1970ల తర్వాత వామపక్ష ఉద్యమాల ప్రభావం వల్ల ఊపు తగ్గింది. మనలో లోపాలను ఎత్తిచూపడానికి హాస్యాన్ని ఆధారం చేసుకోవడం కంటె సిద్ధాంతాల ఆధారంగా వివరించడం ఎక్కువైంది. చింతా దీక్షితులు వంటి వారి కథలను, మునిమాణిక్యం కాంతం కథలను నేటి ఫెమినిస్టులు ఆస్వాదించలేని పరిస్థితి రావడానికి మనం ప్రతీది విశ్లేషించబూనడమే ననుకోవచ్చు.

తెలివైన వారు హాస్యరచనల కంటె సీరియస్ రచనలవైపు మొగ్గు చూపుతున్నారు. నవ్వించి విదూషకుడు అనిపించుకోవడం కంటె సీరియస్ థింకర్‌గా ముద్రపడడం మెరుగని భావించడం దీనికి కారణం. హాస్యాన్ని ఆదరిస్తారు తప్ప మెచ్చి కిరీటాలు పెట్టరు. సినిమాలలో, నాటకాలలో కూడా బెస్ట్ ఏక్టర్‌గా ఉపన్యాసాలు దంచేవాణ్నో, మెలోడ్రామా గుప్పించిన వాణ్నో ఎంచుకుంటారు గానీ కమెడియన్‌కి ఇవ్వరు కదా! అందుకే ప్రపంచ సాహిత్యంలో చూసినా హాస్యరచనలు చాలా తక్కువే ఉంటాయి.

హాస్యరచన ఆషామాషీ వ్యవహారం కాదు. చాలా సున్నితంగా, గీత దాటకుండా రాయగలగాలి. ఆస్వాదించే పాఠకుడి స్థాయి నెరిగి ఆ స్థాయిలో రాయగలగాలి. పాత్ర కంటె పాఠకుడి స్థాయి ఎక్కువగా ఉన్నప్పడే హాస్యం పండుతుంది కనుక ఇది తప్పనిసరి. ఇంతకష్టపడి హాస్యరచన చేసినా విమర్శకులు హాస్య రచనలను పట్టించుకోరు. అకాడెమీ అవార్డులకు రికమెండు చేయరు. హాస్య రచనలకు తగినంత గౌరవం లభించినప్పడే చేయి తిరిగిన రచయితలు హాస్యరచనలను చేయడం గురించి సీరియస్‌గా ఆలోచిస్తారు.

"హాస్యం" ఈ దిశలో చేస్తున్న కృషిని పాఠకులు గుర్తిస్తూనే ఉన్నారు. రచయితలు కూడా తమ కలాల్ని దులిపి రచనలు అందిస్తున్నారు. వచ్చే హాస్యదినోత్సవం నాటికి పరిస్థితి మెరుగు పడుతుందని ఆశిద్దాం.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# ఓవర్ క్యూరియాసిటీ

-డి.వి.నరసరాజు

**కొత్తకొత్త విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం ప్రగతికి సోపానమంటారు! నిజమే! కాని - కొందరు - అనవసర విషయాల గురించి - అన్వేషణ ప్రారంభించి చేతులు కాల్చుకుంటారు. అందుకు నిదర్శనం -**



నాటక కర్తగా
సినీ కథా, సంభాషణల
రచయితగా
దర్శకుడిగా
నటుడిగా
కాలమిస్ట్‌గా
శ్రీ డి.వి.నరసరాజును తెలియని
తెలుగు వారుండరు.

అలనాటి పెద్దమనుషులు, గుండమ్మకథ, లేతమనసులు, భక్తప్రహ్లాద నుంచి కారుదిద్దిన కాపురం వరకు గల సినిమాల విజయాలకు ఆయన కలం బలం ఎంతగా తోడ్పడిందో చెప్పటానికి చరిత్రను తిరిగి తోడనక్కర్లేదు.

అడిగినదే తడువుగా అతి తక్కువ వ్యవధిలో రాసి, రెండోసారి ఫోన్‌చేసే లోగానే 'ఐరోట్ ఎ స్మాల్ స్టోరీ ఫర్ యూ' అంటూ తనకు తానుగా కబురందించి కథను పంపించిన నరసరాజు గారి కమిట్‌మెంట్ ను గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.ఈ కథపై అభిప్రాయాలను పంపాలనుకునేవారు

శ్రీ డి.వి.నరసరాజు,
ఇంటి నెం. 622, రోడ్ నెం.12,
బంజారాహిల్స్,
హైదరాబాద్-34.

అడ్రస్‌కు పంపాలి. శ్రీ నరసరాజు గారి మెప్పు పొందిన లేఖను పంపిన వారికి హాసం పత్రికను 6 నెలలపాటు ఉచితంగా పంపడం జరుగుతుంది.

ఒక మిత్రుని అనుభవం!

మా మిత్రుడొకాయన - విమాన ప్రయాణం నిమిత్తం - విమానాశ్రయానికి - వెళ్లాడు.

సరిగ్గా - రిపోర్టింగ్ టైంకే వెళ్లాడు. బోర్డింగ్ కార్డు తీసుకున్నాడు. విమానం బయలుదేరడానికి యింకా గంట టైం వుంది. ఏం చేయాలి? చుట్టూ చూశాడు. తెలిసిన వాళ్లెవరూ కనబడలేదు! అటు యిటూ పచార్లు ప్రారంభించాడు. దూరంగా - ఒక వెయింగ్ మెషిన్ యంత్రం కనిపించింది.

బరువుచూసుకుందామని వెళ్లాడు. పర్స్‌లో నుంచి కాయిన్ తీశాడు. మెషిన్‌లో వేశాడు. రైల్వే టికెట్ లాంటి కార్డు ఒకటి బయటికి వచ్చింది. చూసుకున్నాడు. తన బరువు సరిగానే ఉంది. రెండో పక్క - ఏవో - సలహాలు - సందేహాలు వుంటాయ్ గదా - ఇంగ్లీషులో

"యూ ఆర్ గల్లిబుల్! బి కేర్‌ఫుల్ ఇన్ చూజింగ్ యువర్ ఫ్రెండ్స్" అని వుంది.

నిజమే! తాను నమ్మి - యిద్దరు ముగ్గురు స్నేహితులకి అప్పులిచ్చి నష్టపోయాడు!

మరొక ప్రయాణీకుడు వచ్చాడు. కాయిన్ వేశాడు కార్డు వచ్చింది - చూసుకున్నాడు.

మా మిత్రుడు అడిగాడు "మీకు ఏమని వచ్చిందండి?"

ఆయన కార్డు యిచ్చాడు. మా మిత్రుడు చదివాడు.

"యూ ఆర్ వెరీ కైండ్ హార్టెడ్! యూ కెన్‌నాట్ సీ అదర్స్ సఫరింగ్" అని వుంది.

"నిజమేనా?"

"నిజమే!"

"మీరు ఏం చేస్తుంటారు?"

"ఒక అనాథాశ్రమం నడుపుతున్నాను"

"ఇంకేం? జ్యోతిషం చెప్పినట్టే వుంది?"





మా మిత్రుడికి ఒక అనుమానం వచ్చింది:

'మా యిద్దరికి వచ్చినవే - మరికొందరికీ కూడా రిపీట్ అవుతాయా ?' చూద్దామను కున్నాడు.

దూరంగా కూర్చున్న ఒక ప్రయాణీకుణ్ని అడిగాడు. "మీరు వెయిట్ చూసుకోండి"

"నా దగ్గర కాయిన్స్ లేవు"

"నేనిస్తాను" అని మా మిత్రుడు ఆయనకి ఒక కాయిన్ యిచ్చాడు.

ఆయనకు వచ్చిన కార్డు మీద - వేరే 'సందేశం'వుంది!

ఈ మెషిన్‌లో కొన్ని వందల కార్డులుంటాయి గదా!

రిపీట్ కాకుండా యిన్ని వందల సందేశాలు ఎలా సాధ్యం!

మరొక ప్రయాణికుడికి కాయిన్ యిచ్చి వేయించాడు 'సందేశం' వేరుగా వుంది. యిలా కుతూహలం కొద్దీ పదిపదిహేనుమందికి తాను కాయిన్స్ యిచ్చి సందేశాలు పరీక్షించాడు.

తన వద్ద కాయిన్స్ అయిపోయినై. క్యాంటీన్‌కి వెళ్ళాడు. వూరికే కాయిన్స్ యివ్వ మంటే వాడు యివ్వడు! కప్ కాఫీ తాగాడు! చిల్లర కాయిన్స్‌గా తీసుకున్నాడు! అవిగూడ యితరుల కిచ్చి వెయింగ్ మెషిన్‌లో వేయించి 'సందేశాలు' చూశాడు!

ఆ కాయిన్స్ అయిపోతే బుక్‌షాపుకి వెళ్లి న్యూస్ పేపర్ కొన్నాడు. మళ్లీ కాయిన్స్ తీసుకున్నాడు.

యిలా దాదాపు 40 -50 మంది చేత కాయిన్ యిచ్చి మెషిన్‌లో వేయించాడు.

ఏ యిద్దరికీ - ఒకే సందేశం రిపీట్ కాలేదు! ఆశ్చర్యం!

తాను దిగబోయే విమానాశ్రయంలో కూడా యిటువంటి వెయింగ్ మెషిన్ వుంటుంది కదా!

అక్కడ కూడా ఒక పాతిక ముప్పయి మందిచేత వేయించి టెస్ట్ చేయాలను కున్నాడు.

వెంటనే - ఫ్లాష్‌లాగా మరో ఐడియా!

నేనే మళ్లీ కాయిన్ వేసి తీస్తే ఈ 'సందేశం' వస్తుందా! లేక దీనికి పూర్తిభిన్నంగా

"యూ ఆర్ వెరీ ఇంటెలిజెంట్! నో బడీ కెన్ చీట్ యూ" లాంటిది వస్తుందా!

'చూద్దాం! అని మరో కాయిన్ వేశాడు. కార్డు వచ్చింది! చదివాడు!

"ది ప్లెయిన్ బై విచ్ యూ వాంటెడ్ టు ట్రావెల్, హాజ్ ఆల్‌రెడీ లెఫ్ట్!"

"ఆఁ!"

ఆ లేదు! ఊ లేదు? అదిపోయి అరగంటవుతోందని చెప్పారు. ✦






అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

## క్లాసిక్ రీటోల్డ్

సాక్షి



కవిశేఖర
పానుగంటి
లక్ష్మీనరసింహారావు

ఒక రాత్రి జంఘాలశాస్త్రి సర్కస్ కంపెనీకి వెళ్ళి అక్కడ జరుగుతున్న విచిత్రాలను చూస్తున్నాడు. ఆ సర్కస్ యజమాని కండలు తిరిగిన యోధుడు, వస్తాదు. గుండెలపై పెద్దనాపరాతి బండలను పెట్టించుకొని సమ్మెటలతో కొట్టించుకుని, పెద్ద పెద్ద గొలుసులను తెంపేసి పళ్లతో పెద్ద బరువులను లేవనెత్తడం ఇలా ఇంకా ఎన్నో అద్భుతమైన పనులు చేశాడు. అన్నీ అయిన తరువాత ఒక వింత ఉపన్యాసాన్ని ఇచ్చాడతను.

# శౌర్యం శరణం గచ్ఛామి

"బుద్ధుడు ప్రేమ మతాన్ని బోధించి జీవహింస చేయరాదని చెప్పి భారత జాతిని పాడు చేశాడు. ఆ మతంలో చేరినవారు మాంసాహారం మానేశారు. అందువల్ల బలహీనులై, పౌరుషం లేక భయ స్వభావులై -భారతీయులు పాడైనారు. నేడు ఆ మతం దేశంలో లేకపోయినా దాని పూర్వాచారములు ఇంకా బాధిస్తున్నాయి. కాబట్టి వారు-వీరు అనే తేడా లేకుండా అందరూ మాంసం భుజించి, దేహ బల సంపన్నులై పౌరుషవంతులై భారత వీరులని పించుకోండి. భారతదేశాన్ని ఉద్ధరించవలసిన వారు మీరే!" అంటూ తన అభిప్రాయాన్ని తెలియజేసాడు.

అతని ఉపన్యాసానికి సభలోని వారు మహా ఆనందంతో కరతాళధ్వనులు చేశారు. జంఘాలశాస్త్రి ఆ సర్కస్ యజమాని అభిప్రాయంతో ఏకీభవించక 'తనను మాట లాడుటకు అవకాశం ఇవ్వవలసిందిగా' అడిగాడు.

అందుకు అతను "మాట్లాడడానికి ఏముంది? ఇదేమన్నా కమ్యూనిటీ హాల్‌గాని, పఠన మందిరంగాని గ్రంధాలయంగాని కాదు. ఇది ఒక వ్యాయామశాల" అని అన్నాడు. ఇది ఉపన్యాసాలు ఇచ్చే తావు కాదన్నాడు.

అందుకు జంఘాలశాస్త్రి "మరి నీవు ఎలా ఉపన్యాసం చేశావు?" అని ప్రశ్నించాడు. "ఇది నా సొంత సర్కస్ కంపెనీ నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను. నన్ను అడగడానికి నీవు ఎవరు?" అని వస్తాదు కసిరాడు.

అందుకు జవాబుగా - "మీ సొంతదైతే మీ పనులు ఏం చేసుకున్నా మాకే అభ్యంతరం లేదు. మీరు దేశాన్ని గూర్చి భారతీయులగూర్చి ఏవేవో చెప్పారు. కాబట్టి ఒక సగటు భారతీయుడిగా మీ ప్రసంగానికి ప్రత్యుత్తరం ఇవ్వాలనుకుంటున్నాను." అన్నాడు జంఘాల శాస్త్రి.

దాంతో విసుగెత్తిన యజమాని "ఏం చెప్తావో చెప్పవయ్యా! మీ మంచి కోరి ఏం చెప్పినా మీకు పనికి రానప్పుడు ఎవడు మటుకు ఏం చేస్తాడు?" అని అన్నాడు.

సోదరులారా? ఈ సంఘాధిపతి ఈ రాత్రి చేసిన చిత్ర చర్యలన్ని మనకు ఆనందాన్ని ఇచ్చాయి. అయితే అధిక బల ప్రదర్శన చూపరులకు అద్భుత వినోదకరం. నిర్జీవబల ప్రదర్శనమే ఆశ్చర్యమైనప్పుడు-సజీవ బల ప్రదర్శనం ఆశ్చర్యం కాకుండా పోతుందా? ప్రాణం లేని రైలు బండి ప్రయాణం ఒక వింత కాదా! టపాకాయలు ధాం ధాం అని పేలడం అద్భుతం కాదా! ఇలాంటివన్నీ నిర్జీవబల ప్రదర్శనలు. సజీవబల ప్రదర్శనం అంటే మన సర్కస్ యజమాని చేసిన ఫీట్లువంటివి. ఇక్కడ శక్తికి ప్రాణం వుంది. ప్రాణం వెనుక మనసు వుంది. దాని వెనుక ఆత్మవుంది. సంకల్పబలం, ఉత్సాహం ఇందులో ఉన్నాయి. ఇది విశేషమైన అలవాటు మీద జరుగుతుంది. దీన్ని కొత్తగా చూసేవారికి ఆశ్చర్యంగానే వుంటుంది.

ఇలాంటి బలాఢ్యులు ఇప్పుడు ప్రతి గ్రామంలోనూ ఉన్నారు. ఉయ్యాల గొలుసులు తెంపి పిల్లల్ని ఏడ్పించడం, గడ్డపారలు వంచి రైతులను ఏడ్పించడం, నాపరాళ్లు పగలకొట్టి రజకులను ఏడ్పించడం, డబ్బు దండగతో - నిద్ర దండగతోనూ - ఊళ్ళోవార్ని ఏడ్పించడం లాంటివి ఒక పనిగా పెట్టుకున్నారు ఇలాంటి వాళ్ళు. చదువులో సున్నా సర్కసుల్లో పిడుగు.

ఆడువారు కూడా ఇలాంటి పనులు సులభంగా చేస్తున్నారు. సెప్టెంబరు నాలుగు 1918వ సంవత్సరంలో యూరప్ ఖండమంతటా అద్వితీయ అబలా సంపన్నురాలైన 'గోబర్టు' అనే పేరుగల మహిళా శిరోమణి 'బర్తలోయ్యో'వ సంతలో దేహబల విద్యలు ప్రదర్శించింది. అయిదడుగుల పొడుగు, మూడు అడుగుల వెడల్పు బల్లమీద ఎంతమంది జనం కూర్చుంటారో దానిని ఆమె తేలికగా లేవనెత్తింది. పెద్ద పెద్ద బండ్లను పొట్టమీద ఉంచుకొని నాలుగు సమ్మెటలతో కొట్టించుకొని వాటిని తన తలవెంట్రుకలకు కట్టి నాలుగు వైపులకు తిప్పింది కూడాను.

అబలలే ఇలాంటి వింత పనులు చేస్తుంటే - మగతనమని - పౌరుషమని - ప్రజ్ఞఅని - వెర్రి వెర్రిగా మాట్లాడుకుంటూ - ఇంకా మీసాలు మెలిత్రిప్పుకొంటూ- మెడకు మెడల్స్ తగిలించుకుని - ఏ మొహం పెట్టుకొని మీరు తిరుగుచున్నారు?. ఇక ఆలస్యం చేయక గునపాలు గొడ్డళ్ళు కూలివారికి ఇవ్వండి నాపరాతిబండలను చాకిరేవులో పారేయండి. మీ సర్కస్ గుర్రాలు జెటకాబండ్లకు పనికిరాకపోతే గానుగ వాళ్ళకి ఇవ్వండి. ఇలాంటి మీ సామగ్రితో దేశానికిప్పుడు పనిలేదు.

ఇలా అన్నానని నిరుత్సాహపడవద్దు! దేహబలం సంపాదించ కూడదని నేను చెప్పటం లేదు. దేహ దారుఢ్యం కావల్సిందే. దీనిని సంపాదించటానికై ఉపయోగించు కాలం కష్టం-ధనం వట్టి దండగ అని చెప్పుతున్నాను. మీకు ఇంత బలం ఉన్నందుకు ఏం చేస్తున్నారు? సైన్యములో చేరి దేశ సేవ చేయవచ్చుకదా? పోనీ! ప్రతి గ్రామంలో దొంగలు జొరబడి ఊరు

దోచుకుంటున్నారు. వారి బాధలనుంచి తప్పించి ప్రజా సేవనైనా చేయవచ్చుకదా?

మీ బలం పరులకు ఏవిధంగా ఉపయోగ పడుతుంది? పరుల మాట అక్కర లేదు. మీ సంసారానికైనా ఉపయోగపడు తుందా? రోజు కొక మేక, నాలుగు కోళ్ళు, బిందెడుపాలు, రెండు లీటర్ల నెయ్యి మీకే సరిపోవడం లేదు. ఇక సంసారానికి ఏం పెట్టగలరు? అదిపనిగా చెడతింటున్న మీ వలన దేశానికి ప్రయోజనం ఏముంది? ఆ మాత్రం పనికి ఇంత శరీరం కావాలా? మూడు రెట్లు బలం గల గొలుసును గేదె కూడా తెంపివేస్తుందికదా! ఇందులో విశేషం ఏముంది?

అతి దేహసాధన సంపన్నులు అయిన మీకు స్త్రీవాంఛ చాలా తక్కువ అనటం నిజం కాక పోదు. ఇంత బలిష్ఠులైన మీరు బ్రహ్మచారులుగా ఎలా ఉండగలరని జనం అను కోవడం ఆశ్చ ర్యం, కానీ అసలు సంగతి కండలు పెంచ డం వలన మీకు స్త్రీల మీదకు బుద్ధి పోదు. మగాడి శరీరంలో క్రొవ్వు వలన- పిత్తాది రసం వలన స్త్రీవాంఛ విజృంభిస్తుంది. మీరు వాటిని పెరగనీయక ఎప్పటికప్పుడు కసరత్తులు చేసి పరశురామ ప్రీతి చేస్తారు. రింగులు తిరిగిన కండల పస ఎక్కడ బిగువు సడలిపోతుందోనన్న భయంవలన మీరు స్త్రీ సాంగత్యాన్ని సందేహిస్తారు. వంశాన్ని వృద్ధి చేయటానికి పుట్టారా? లేక ఇనుప గొలుసులు తెంపడానికి పుట్టారా?

మీ యజమాని బౌద్ధ మతాన్ని తప్పుపట్టాడు. బుద్ధుడు దేశద్రోహి అని, జాతీయబల వినాశకుడని, భూతదయ ఉండకూడదని, జీవహింస చేయాలంటూ అతని ప్రేమ సందేశాన్ని తప్పుపట్టాడు. ప్రజలంతా మాంసాహారులై వుండాలని, అలా లేకపోవడం వలన భారతీయులు దుర్బలులై, పౌరుషహీనులై, భయ స్వభావులై పాడైనారని ఈ సర్కస్ పెద్దమనిషి సెలవిచ్చాడు.

సూర్యునికి కాంతి లేదనే వారితో తగువు ఎందుకు? సముద్రంలో నీరు లేదనే వారితో వాదం ఎందుకు? జీవహింసకు మాంసాహారానికి ఏమిటి సంబంధం? మాంసాహారులందరూ జీవహింస చేస్తున్నారనా? సన్యాసుల విషయమై మాంసాహారం నిషేధం అని బుద్ధుడు చెప్పాడు గాని సంసారులను గూర్చి ఒక్క మాటైనా చెప్పాడా?

మాంసం తినడం వలన బలం రావచ్చును. అంతేగాని పౌరుషం రావటం ఎక్కడైనా ఉందా? అలా వస్తే ఇక కావలసింది ఏముంది? చేతిలో డబ్బులున్న వారందరూ వీరులే అయి పోతారుగా!? మాంసం తింటే శౌర్యమా?!.. ఎంత మాట! మాంసాహారం దేహ సంబంధ మైనది. శౌర్యం మనస్సంబంధమైనది కదా!

నక్కబావ మెక్కని తిండి ఉందా? సింహాన్ని తొల గించి ఫారెస్టు కింగ్ గా నక్కకు



పట్టాభిషేకం ఎందుకు చేయ రాదు? నక్క బక్కపల్చ జంతువు కాబట్టి శౌర్యం ఉండ దని, బలమైన జంతువులకే శౌర్యం ఉంటుందని అనుకోవడం తెలివితక్కువ తనం. శౌర్యానికి బలం-బలహీనం అనే భేదం లేదు.

బలం ఉన్న చోట పౌరుషం ఎప్పుడూ ఉండదు. అలాగే పౌరుషం ఉన్నచోట బలం పరిస్థితి కూడా అంతే. పొట్టేలుకున్న రోషం ఏనుగుకు వుందా? త్రాచుపాముకున్న రోషం కొండ చిలువకు వుందా? ఎర్రతేలు కుట్టినట్టుగా బొంత కప్పవంటి పుట్టతేలు కుట్టుతుందా? పెద్ద శరీరానికి పిరికితనం ఎక్కువ అనడం అతిశయోక్తి కాదు.

నెపోలియన్, నెల్సన్, కృష్ణదేవరాయలు వంటి వీరాధి వీరులు కొందరు అంతంతమాత్రం శరీరం గలవారే! పొట్టిగా వుండే అరేబియా గుర్రం యుద్ధంలో ఫిరంగి గుండ్ల వర్షానికి భయపడక మరింత పౌరుషంతో ముందుకు పోతుంది. ఏడడుగుల ఎత్తు అందం బలం గల ఆస్ట్రేలియా గుర్రం బరువు మోస్తూ కొరడా దెబ్బలు తింటూ ముందుకు పోదామా లేక మానుకుందామా? అని తటపటాయిస్తుంది.

లావు శరీరంలో శౌర్యం చాలా ఎక్కువ అనుకునే వెర్రివారు లేకపోలేదు. అందరికంటే ఈ వెర్రి రష్యా చక్రవర్తి "ఫ్రెడరిక్ ది గ్రేటు"కు ఎక్కువ. తన సైన్యంలో ఆరు అడుగులు గల వారినే సిపాయిలుగా చేర్చుకొనేవాడు. అలాంటి విగ్రహ పుష్టి పిశాచ స్వరూపులను నమ్ముకుని అతడు యుద్ధంలో పరా జయం పాలైనాడు. పొడుగు కాళ్ళ పెద్దమ్మకు వెనక ఇంటికి పరుగుతీయడంలో వున్న పట్టు ముందుకు పోవడంలో ఉండదు.

బలవంతునికి తిండి తినడంలో ఉన్న ఓపిక దెబ్బతీయడంలో ఉండదు. దేహ సంపన్నులారా! అంతః శౌర్యం ప్రధానం కాని అంగ బలంతో పనేముంది? ఈ కాలం యుద్ధాలందు వెర్రి దేహ బలంతో పని ఏముంది? కోటి మందిని ఉష్ చేయ గల సామగ్రి గోళి కాయంత బాంబులో వుంది. ఇక మీరు బలమో బలమో అని దేవులాడడం ఎందుకు? ఈ రోజుల్లో శౌర్యానికే పనికాని చచ్చుబలంతో పని ఏముంది? మీరందరు దేశాన్ని రక్షించగల మహా వీరులుఅవుతారని గర్వపడ వాల్సిన పనిలేదు.

యుద్ధం చేసి నరకాసురుని వంటి రాక్షసున్ని చంపిన సత్యభామ తన భర్త ప్రాణాన్నే కాపాడింది. మండోదరి తన బుద్ధి బలంతో చతురంగం ఆటను కల్పించి తన భర్తకు రణరంగ రహస్యాలన్నీ ఆ ఆట ద్వారా సవివరంగా నేర్పింది. 1782వ సంవత్సరంలో జిబ్రాల్టరు ముట్టడిలో శత్రు సైన్యం ఒక బాంబు వేసింది. అంతలో ఒక ఫ్రాన్సు దేశపు స్త్రీ తన చంకనున్న ఇద్దరు పిల్లలతో గభాలున ఎగిరి బాంబు మీద పడి దాని వొత్తి ఆర్పి ఎంతో మంది ప్రాణాలను కాపాడింది.

ఆడువారైతేనేమి? శౌర్యం గలవారు వీరు.!

"శౌర్యానికి లింగభేదం లేదు నాయనా! నీవు శౌర్యవంతుడవు కావని నేను అనడం లేదు. నీవంటి వారిని ఎవరినీ నేను నిందించటం లేదు. బలానికి శౌర్యానికి సంబంధం లేదు అనడానికి ఇంత దూరం చెప్పవలసి వచ్చింది. నీవు చేస్తున్న ఈ పనివలన లోకానికి లాభం లేదని చెప్పడం మూలంగా నీవు నన్ను క్షమించగలవని ఆశిస్తున్నాను". అని ముగించాడు జంఘాలశాస్త్రి.

-ప్రకాష్ రాయపనేని

# జనవరి 14



సుప్రసిద్ధ సినీ రచయిత, దర్శకుడు, హాస్యబ్రహ్మ జంధ్యాల పుట్టిన రోజు. ఆయన జయంతిని పురస్కరించుకుని హాస్య నాటికలను కూడా ప్రచురించాలని నిశ్చయించాం. హాస్యప్రియులకు, నటీనటులకు మా ఈ ప్రయత్నం ఆనందాన్ని కలిగిస్తుందని మా నమ్మకం. 'హాసం' సంపాదకుడు రాజా కోరిక మేరకు 1986లో జంధ్యాల రాసిన నాటిక యిది.



# సినిమా తీస్తాన్ జాగ్రత్త!!

**కవిశ్రీ హడావిడిగా గదంతా సర్దుతున్నాడు.**
**బైటినుంచి స్నేహితుడు రామం వచ్చాడు చేతిలో ఓ ప్యాకెట్‌తో.**

రామం : రేయ్ కవీ - ఏమిట్రా ఈ హడావిడి? ఎంచక్కా గవర్నమెంట్ పాలసీలా అస్థవ్యస్థంగా ఉండే గదిని అందంగా సర్ది చెడగొడ్తున్నా వేమిట్రా

కవి : వచ్చావా మిత్రమా....
నా చిన్న సైజు రుబ్బురోలు పాత్రమా!
నువ్వు కాస్త వెయ్యి ఓ చెయ్యి
రూమ్ సర్దుడులో సాయం చెయ్యి-

రామం : ఎందుకురా ఇలా సర్దడం? - ఎవడైనా వి.ఐ.పి. తగలడుతున్నాడా మన కొంపకి?

కవి : కవిగా నేనెక్కబోతున్నానో మెట్టు.
ఇప్పుడే అదృష్టం నా తలుపు తట్టు
నేను చెప్పబోయేది నిజం ఒట్టు
రాయబోతున్నాను నేనో బాక్సాఫీసు హిట్టు.

రామం : ఇంద తినెయ్ పెసరట్టు-

కవి : అదక్కడ పెట్టు
ఇప్పుడే ఓ నిర్మాత వచ్చి తలుపుకొట్టు
నేను చేస్తాను కాస్తంత బెట్టు
వినిపిస్తాను కథలో ఓ బిట్టు -

రామం : అది వినగానే అతనిలో కంపరం పుట్టు
వెంటనే బెల్టు తీసి నిన్ను వాయకొట్టు -

కవి : ఛీ - అపశకునం పక్షీ నిరక్షర కుక్షీ!

రామం : ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెగిరిందని సినిమా రచయితసరే - ఆరేళ్ళనించీ ప్రయత్నించినా మామూలు కథా రచయిత కూడా కాలేకపోయావ్ కదా - నువ్వు పట్టుదలకొద్దీ రాసి పంపిన కథలు గోడకు కొట్టిన బంతుల్లాగ రయ్‌రయ్‌మని తిరిగొస్తున్నాయి. వాటిని మోసుకువచ్చి నీకు చేర్చిన పోస్ట్‌మెన్ జబ్బ వాచి బాధపడ్తున్నాడు.

(పోస్ట్‌మెన్ వచ్చాడు. ఓ పెద్ద కట్ట కింద పడేసి జేబులోంచి రివాల్వర్ తీసి 'నన్ను కాల్చి చంపెయ్యండి సార్' అన్నాడు. సడన్‌గా కాలిస్తే కింద పడితే దెబ్బ తగుల్తుందేమోనన్నట్టు సేఫ్‌సైడ్‌గా ఉంటుందని నేల మీద పడుకుండిపోయాడు.)

రామం : ఇదిగో పోస్ట్‌మేనూ, బాగుండదయ్యా. మా మీదకి కేసొస్తుంది. లే లేచి పని చూసుకో.

(పోస్ట్‌మేన్ లేచి ఏడవటం మొదలెట్టాడు.)

పోస్ట్ : చిన్నప్పుడు నేను స్కూలుకి కూడా ఇన్ని పుస్తకాలు మోసుకెళ్ళ లేదు సార్. రోజూ ఇంతింత గాడిద బరువు మోసుకురావటం...

రామం : ష్ ఏడవకు. ప్లీజ్... ఎవరయినా చూస్తే నువ్వు మా ఇంట్లో హైదరాబాద్ టి.వి. చూసి జడుసుకుని ఏడుస్తున్నావను కుంటారు. కష్టాలు పడ్డవారెప్పుడూ చెడ్డవారు కారు నాయనా - వెళ్ళిరా.

(పోస్ట్‌మేన్ వెళ్ళాడు.)

రామం : ఇంతకీ ఎవర్రా ఆ వచ్చే నిర్మాత?

కవి : అతను పరిశ్రమకి కొత్త
కానీ నచ్చదాయనకి చెత్త

రామం : చెత్త నచ్చని వాడు మరి నీ కథ తీసుకుంటాడా?

కవి : అవహేళన చేస్తే నా ఇంట్లో
కుక్కుతా ఆవకాయ్ నీ కంట్లో
రానున్న నిర్మాత కోసం రాశానో కథ
అది కథ కాదు

రామం : స్టోరీనా?

కవి : ఊ---
అది కథ కాదు కన్నెపిల్లల వ్యథ

రామం : రాబోయే ప్రఖ్యాతి చెందబోయే నిర్మాత పేరేమిటి?
కవి : ఆయన పేరు పైడితల్లి
ఆయన మనసో నాగమల్లి!
లేదని విన్నాను ఆయన చేతికి ఎముక
రామం : ఏం చెయ్యి విరగొట్టుకున్నాడా?
కవి : నోర్ముయ్
లేదని విన్నాను ఆయన చేతికి ఎముక
ఇచ్చేస్తాడట డబ్బు చూడకుండా ముందూ వెనక!
కాదాయన కుంభకర్ణుడు
అవునాయన దానకర్ణుడు....
(పెద్దగా అరుస్తూ పైడితల్లి, వెనగ్గా రిక్షావాడు వచ్చారు.)
పైడి : నువ్వరిసి గీపెట్టినా నేన్నీకు పైసా ఎక్కువ ఇయ్యనయ్యా పో ఈడ్నించి
రిక్షా : ఇదేంటిబాబో.... బస్టాండు కాణ్ణించి ఈడిదాకా వచ్చి పావలా సేతిలో ఎట్టావ్ -గాంధీ కొండంతుండావ్.
పైడి : ఇదిగో.... నా ఒంటి గురించి వాగబాక - నా ఒల్లు నా ఇట్టం. నీకేంటయ్యా కట్టం?
రిక్షా : కట్టం నాదిగాక నీదా? అంత ఒంటిని బండిలో ఏసి ఈడ్చు కొచ్చినానా లేదా - అరె .... అణ్ణించి ఈడికి మడిసెక్కితే రూపాయి ఇత్తారు గదయ్యా.
పైడి : మడిసెక్కితే అంటే - నేను మడిసిని కానని నీ ఉద్దేశం? ఎర్రికూత కూత్తే కుదేత్తా జాగర్త ఏటనుకుంటున్నావో.... చిన్న పైసా ఎక్కువియ్యను - ఎవడితో సెప్పుకుంటావో సెప్పుకో... పో ఈడ్నించి.
రిక్షా : ఛఛ - పొద్దుటే లేసి ఎవడి మొహం చూశానో, మా 'లావు' బేరం దొరికింది.
(గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.)
కవి : మహారాజశ్రీ పైడితల్లి గారికి స్వాగతం హృదయపూర్తిగా సమర్పిస్తున్నాను సుస్వాగతం నేనే కవిని... కవిశ్రీని.
పైడి : అట్టాగ.... నువ్వే కవివా? మొకం చూసి ఇల్లల్లో డి.డి.టి. జల్లే వోడనుకున్నా.
కవి : చిత్తం - నా ఫేసలాంటిది, నా ఫేసలాంటిది!
పైడి : ఏదో గొప్ప కత సెప్తానన్నావంట?
కవి : చిత్తం....
కథ : కాదది జీవితం
విధిరాసిన కాగితం
కథ కాదది జీవితం
విధి రాసిన కాగితం
పైడి : ఇదిగో.... నాకు తెలవకడుగుతాగాని - అట్టా మెలికలు తిప్పి మాట్టాడతావేంటయ్యా అదేమన్నా జబ్బా?
కవి : చిత్తం జబ్బు కాదు - కవులు, రచయితలు అలా మాట్లాడాలి అది రూలు.
పైడి : నాకేంటో కంపరంగా ఉంది, కడుపులో తిప్పుతాంది, అలా వంకర బాస ఆపి తిన్నగా మాట్లాడు.
కవి : ఆజ్ఞ. ప్రస్తుతం మన దేశాన్ని పట్టి పీడిస్తున్న వరకట్న పిశాచం మీద దెబ్బతీసే గొప్ప అత్యుత్తమమైన కథ రాశాను.
పైడి : ఇనిపించుకో - ఇనిపెడతా.
కవి : చిత్తం - తమరీలోపు ఈ పెసరట్టు తింటూ వినండి....
(పొట్లం అందించాడు.)
పైడి : తినిపించుకో - తినిపెడతా....
కవి : రామం, నువ్వెళ్లి నేను చెప్పినవి తీసుకురా



(రామం వెళ్లాడు) (పైడితల్లి తింటున్నాడు.)
కవి : అది రెండు కాళ్ళు జంతువులు సంచరించే జనారణ్యం- మానవత్వపు కాకులు దూరలేని కారడవి! చీమూ, నెత్తురూ ఉన్న చీమలు దూరలేని చిట్టడవి!
పైడి : (ఉన్నట్టుండి అరిచాడు.) అడివి కేటుగాడు
కవి : ఏమిటది?
పైడి : మన సినిమా పేరు - ఎట్టాగుంది?
కవి : అడివి కేటుగాడా? అదేం పేరండీ తిట్టులాగా?
పైడి : సినిమా పేరు తిట్టులాగా ఉంటేనే హిట్టవుద్ది. నీకు తెల్దులే!
కవి : చిత్తం! అడవి అని జనారణ్యం అని పొయిటిక్‌గా అన్నాను. ఇది అడవి కథ కాదు నిర్మాత గారూ.
పైడి : మరిందాకా కారడివి, సిట్టడివి అన్నావు.
కవి : పొరపాటున అన్నాను క్షమించండి.
పైడి : ఇంకెప్పుడు ఇట్టా పొరపాట్లు సెయ్యమాక. గొప్ప టైటిల్ పోయింది కదయ్యా.
కవి : అది ఓ అతి సామాన్యుడైన మధ్యతరగతి గృహస్తు ఇల్లు.
పైడి : (అరుస్తూ ) మద్దె తరగతి ఎదవనాయాల
కవి : ఇదీ సినిమా పేరేనా?
(తలూపాడు పైడితల్లి)
కవి : తమ దయ. ఇక కథ చిత్తగించండి.
(ఓ వయసు మళ్ళిన తండ్రి పరంధామయ్య దగ్గుకుంటూ వచ్చాడు. వెనకాలే కూతురు జానకి వచ్చింది.)
జాన : బాగా దగ్గుతున్నావు, మందేసుకున్నావా నాన్నా?
పరం : హు మందు.... సామాన్యుడి కంటికి మందు పాదరసంలాంటి దమ్మా. కొట్లో కనిపిస్తుంది. చేతికందదు.
జాన : డైలాగులు చెప్పకు నాన్నా!
పరం : హు జీవితమే ఒక డైలాగమ్మా. భగవంతుడికి భక్తుడికి డైలాగు.
జాన : నేను ఆఫీసుకు వెళ్ళొస్తాను నాన్నా.
పరం : హు ఆఫీసు. జీవితమే ఒక ఆఫీసమ్మా. పునరపి జననం, పునరపి మరణం - పునరపి ఆఫీసుకెళ్లటం, పునరపి ఆఫీసునుంచి రావటం.
జాన : నువ్వా పని చెయ్యలేవు. నేను ఆఫీసుకెళ్ళి పని చెయ్యకపోతే ఇల్లెలా గడుస్తుంది నాన్నా?
పరం : హు ఇల్లు - జీవితమే ఓ ఇల్లమ్మా....
పైడి : ఏంటయ్యా... ఆడికి కూడా జబ్బేనా? ఆడూ అట్లా వంకర బాస మాట్టాడతాందేంది?
కవి : అది - అలా మాట్లాడితే డైలాగు బాగుందంటారండీ జనం. అందుకని. కొన్ని తగ్గిస్తాన్లేండి. వినండి ముందింకా

| పాత్రలు | - | పాత్రధారులు |
|---|---|---|
| కవిశ్రీ | - | సినిమా రచయిత |
| రామం | - | కవిశ్రీ మిత్రుడు |
| పైడి తల్లి | - | నిర్మాత |
| పరంధామయ్య | - | హీరోయిన్ తండ్రి |
| జానకి | - | హీరోయిన్ |
| జగ్గా | - | విలన్ |
| జానీ | - | హీరో |

ఇంకా పోస్ట్‌మాన్, రిక్షావాడు

బాగుంటుంది.

జాన : వెళ్ళొస్తాను నాన్నా....

పరం : సాయంత్రం పెందరాళే వచ్చేయ్యమ్మా.... నిన్ను చూసుకోడానికి పెళ్ళివారొస్తున్నారు.

జాన : ఇది నాకు ఎనభై ఆరో పెళ్ళి చూపులు నాన్నా... ప్రతిసారీ బలి పశువులా అలంకరించుకుని కూర్చోడం నాకిష్టం లేదు. ఇంక నన్నెవరికి చూపించొద్దు నాన్నా.

పరం : హుం పెళ్ళిచూపులు - జీవితమే ఒక పెళ్ళిచూపులమ్మా - జీవిత కాలంలో మనకి ఎదురయ్యే వారందరూ మనకి నచ్చరు. ఎదురైన వారందరికి మనం నచ్చం - అయినా సర్దుకుపోవాలి - ఆడపిల్లల జీవితాలని కాల్చి మసిచేస్తున్న వరకట్న పిశాచం విలయతాండవం చేస్తున్న దేశంలో పుట్టడం నీ ఖర్మమ్మా - నీ ఖర్మ!

సరే సాయంత్రం నిన్ను చూసుకోడానికి మన జగ్గాని రమ్మన్నాను.

(జగ్గా వచ్చాడు.)

జగ్గా : వచ్చేశానంకుల్!

పరం : నువ్వప్పుడే రాకూడదు నాయనా - నీ ఎంట్రెన్స్ కాస్సేపాగి.

జగ్గా : నిర్మాతగారికి నన్ను త్వరగా చూపించాలని కవిగారు ముందే పంపారంకుల్, హాయ్ జానకీ.... మేరీ ప్యారీ బుల్ బుల్... పిస్తాబహార్ చించినా జిగుస్తినీ!

పైడి : అదేం బాసయ్యా?

కవి : చిత్తం, అతను విలను - విలన్లు అలాంటి అర్థంలేని మాటలు కొన్ని వాడాలి మాస్‌కోసం! వినండి.

జాన : నోర్మూయ్ దౌర్భాగ్యుడా... నాకేసి చూశావంటే గుడ్లు పీకేస్తాను నాన్నా - నేను వీణ్ణి చేసుకోను.

పరం : చేసుకోవా, ఏం?

జాన : వీడు విలన్, జగ్గా అనే పేరే చెప్తోంది గదా వీడు విలనని - నేను జానీని చేస్కుంటాను నాన్నా -

జానీ : పిల్చావా డార్లింగ్.

జాన : నాన్న - ఇతనే జానీ -

పరం : ఇతనా... నువ్వితన్ని చేసుకోడానికి వీల్లేదు.

జాన : ఎందుకని?

పరం : ఇతని మతం వేరు -

జాన : పెళ్ళి మా అభిమతమైనప్పుడు మతం అని నువ్వు వాతం రోగిలా పంతం పడితే నిన్ను తంతా నాన్నా-

పైడి : తండ్రినే తంతానంటాందేంటయ్యా కవీ?

కవి : చిత్తం - ప్రాసకోసం ఆ మాట వాడాను. కావాలంటే తీసేద్దాం - వినండి.

జాన : ఇతను పైసా కట్నం తీసుకోనని ప్రతిజ్ఞ చేశాడు నాన్నా - ఇంకా ఎందుకీ కులమతాల అడ్డుగోడలు? చివరిసారి చెప్తున్నా నాన్నా - నేను పెళ్ళంటూ చేసుకుంటే జానీనే చేసుకుంటా-

పరం : కాదు, నువ్వు జగ్గాని చేసుకోవాలి-

జాన : కాదు, నేను జానీనే చేసుకుంటా-

పరం : జగ్గాని -

జాన : జానీని

పరం : జగ్గానే!

జాన : జానీనే

కవి : పాత్రలూ, వెళ్ళిపోండి....

(పాత్రలన్నీ వెనక్కెళ్ళిపోయాయి.)

కవి : అయ్యా - జానకి సంప్రదాయానికి లోబడి జగ్గాని చేసుకుంటుందా, సమాజానికి ఎదురు తిరిగి జానీని చేసుకుంటుందా అనే సమస్యతో ఇంటర్‌వెల్ ఇస్తాం - ఆ తర్వాత....

పైడి : ఇదిగో....ఇంకాపు... నీ కథ కంపు కొడతాంది గాని ఇంకాపు.... ఇట్టాటి లత్తుకోరు కథ సినిమా తీత్తే నా సేతికి సిప్ప మిగులుద్దయ్యా - ఓ ఊరు ఊరంతా పస్తుండి నాకు ముస్టెయ్యాల్సొస్తుంది-

కవి : చిత్తం... కానీ ఈ కథలో సంప్రదాయానికి సంబంధించిన






సంఘర్షణ. ఉంది. - సమకాలీన సమస్య మీద విసురుంది.

పైడి : విసురుంటే నువ్వింట్లో విసురుకుంటూ కూకోవయ్యా.... ఈ కతని నమ్మి నేను ఇచ్చు రూపాయలు ఇసురుకోలేను - సినేమా కతలో ఈ ఇసుర్లు ఇప్లవాలు ఎవరిక్కావాలయ్యా.... నాలుగు ఫైట్లు, మూడు జోతిలచ్మి డాన్సులు, రెండు రేపులు కూసంత ఎకిలి ఆస్యం, కాసంత సరుకూ ఉంటే సాలు ఇట్టయిపోతది!

కవి : కథలలో వెరైటీ కోసం ప్రయత్నించే మనిషిని నేను -

పైడి : అదే - నాకు ఆ వెరైటీయే కావాల - ఇందాక నువ్వు సెప్పిన కథలో తండ్రి అట్టా దగ్గుతూ ఎదవ మొకమేసుకుని రాకూడదయ్యా - ఎట్టారావాలో, సిలేమా కతెట్టాగుండాలో నేను సెప్తాను ఇనుకో-(పరంధామయ్య జర్కిన్ వేసుకుని ఉన్నాడు - ఎగురుకుంటూ, ఈలేసుకుంటూ వస్తున్నాడు. జానకి ఎదురైంది.)

పరం : హాయ్ డియర్!

(పరంధామయ్య కూతుర్ని ఎగాదిగా చూస్తూ ఈలేస్తూ చుట్టూ తిరుగుతున్నాడు.)

కవి : అయ్యో అతగాడు ఆ పిల్లకి తండ్రి. అలా రౌడీ చూపులు చూస్తాడేమిటి?

పైడి : అదే ఎరైటీ.... సూడు....

జాన : అలా చూస్తున్నావేమిటి డాడీ?

పరం : నీకు పెళ్ళీడొచ్చిందని ఇప్పుడే తెలుసుకున్నానమ్మా.

జాన : ఊరుకో నాన్నా, అప్పుడే నాకు పెళ్ళేమిటి? పక్కింటి పంకజం గారికి నలభై ఏళ్ళు, ఇద్దరు బిడ్డల తల్లి, ఆవిడే ఇంకా పెళ్ళి చేసుకోలేదు.

పరం : నిజమే అనుకో. నేను మాత్రం నువ్వు పుట్టాకేగదా మీ అమ్మని చేసుకుంది. అయినా ఏ వయస్సు ముచ్చట్లు ఆ వయసులో జరగా లమ్మా, నువ్వె వరినైనా ఆల్‌రెడీ ప్రేమించి ఆవ కాయలా నిల వుంచావా? చెప్పమ్మా.... లేకపోతే నన్నే తోటకూరలాంటి ఫ్రెష్ సంబంధం చూడమంటావా?

జాన : నేను.... నేను ప్రేమించాను డాడీ.

పరం : వెరీగుడ్, ఈ కాలపు ఆడపిల్లలు ఎవరినైనా ప్రేమించకపోతే వింతగాని ప్రేమిస్తే ఆశ్చర్యమేముందమ్మా? ఎవరిని నువ్వు ప్రేమించింది?

జాన : డార్లింగ్ (పిలిచింది)

(జగ్గూ వచ్చాడు.)

జాన : ఇతన్నే డాడీ - జగ్గూ అని.



పరం : జగ్గూనా... వాడు విలనమ్మా, జగ్గూ అనే పేరే చెప్తోంది గదా వాడు విలనని.

జాన : ఈ రోజుల్లో పేర్లిలాగే వుండాలి డాడీ. వెంకటప్పయ్య, మంగపతి, అంకినీడు .... ఇవన్నీ పాతవాసనలొచ్చే పేర్లు.

పరం : కానీ నిన్ను ఎప్పటికయినా జానకిరాముడికే ఇచ్చి చెయ్యాలని ఆశపడ్డానమ్మా నేను.

(జానీ వచ్చాడు.)

జానీ : వచ్చేశాను మామగారూ.

జాన : జానకి రాముడు ముసలి పేరు డాడీ. నేను ఇతన్ని చేసుకోను.

పరం : నా మాట వినమ్మా. ఆ పేరు నచ్చకపోతే పెళ్లయ్యాక జానీ అనో, టామీ అనో, టైగర్ అనో నీ ఇష్టం వచ్చిన పేర్లతో పిల్చుకో.

జాన : ఐ యామ్ సారీ డాడీ. నేను పెళ్ళంటూ చేసుకుంటూ జగ్గూనే చేసుకుంటాను.

పరం : లేదు. నువ్వు జానకి రాముడినే చేసుకోవాలి.

జాన : కాదు, జగ్గూనే

పరం : లేదు జానకీరాముడినే!

పైడి : ఇక్కడ ఇంటర్ బెల్లయ్యా.

(పాత్రలు వెళ్ళిపోయాయి.)

పైడి : ఎలాగుంది కథ?

కవి : బెజవాడ నుండి హైదరాబాద్ వెళ్ళడానికి వైజాగ్ రైలెక్కినట్టుంది.

(మురిసిపోయాడు పైడితల్లి)






పైడి : ఏంటీ? - అంతబాగుందా!

కవి : అంటే... హీరోయిన్ విలన్ని చేసుకోవడం అంత మంచి పని కాదు.

పైడి : అదే మన సినిమాలో వ్రైటీ అని చెప్పానా? ఇంటర్‌బెల్లులో అంతా బైటికెల్లిరాగానే ఈరో తాగేత్తాడు.

కవి : (అదిరి పడుతూ) ఏం తాగుతాడండయ్యా?

పైడి : ఇసం, ఇంకేంటి?

కవి : అంతేగదా....

పైడి : ఈరో ఇసం తాగేసరికి ఇనాయకుడు పెత్తెచ్చమవుతాడు.

కవి : వినాయకుడా? అయినా ఇది సోషల్ సినిమా కదండీ - ఇందులో నాయకులు తప్ప వినాయకులుండరు.

పైడి : ఎందుకుండరయ్యా - మనం ఉండాలంటే ఉంటారు. అట్టే మాట్టాడితే ఇనాయకుడు కాదయ్యా సరాసరి ఇష్ణుమూర్తే దిగొచ్చాడంటాం- ఏం? సూడు, నువ్వొట్టి ఎర్రి బాగులోడివయ్యా సినేమాలో ఒకర్నో ఇద్దర్నో దేవుల్లని సూపిత్తే మన ఆడంగులు దన్నాలెట్టేసి మరీ డబ్బులిచ్చేత్తారు! కనకవర్షం కురుసుద్దనుకో.

కవి : చిత్తం - కాని సాంఘిక కథలో దేవుళ్ళు....

పైడి : ఇంకేం మాట్టాడక! మన కతలో దేవులుండాలన్న నిర్ణయం తీసేసుకున్నా, అప్పుడు ఇష్ణుమూర్తి పెత్తెచ్చమైపోయి - 'ఇదిగో అబ్బాయీ - నువ్వుత్తి పున్నేనికి సావబాక - నీకు మంచి రోజులు ముందుంటాయని' సెప్తాడు - అది ఇన్న హీరో ఈలేసుకుంటూ సిన్నకారేసుకుని....

కవి : మన హీరోకి కారెక్కడిదండీ?

పైడి : నేను కొనిబెడతా కదయ్యా. ఆ గోల నీకెందుకు? ఈరో లారీ మీద ఎడతాంటే...

కవి : ...ఇందాక కారన్నారు.

పైడి : అది ఈరో సైజును బట్టి లేవయ్యా... ఒక్కోడికి కారు సాలు. ఇంకోడికి లారీ కావాల! అంసేత... ఎడ్ల బండేసుకునే ఎళతా వుంటే. అశోక సెక్రవర్తి, శిబి సెక్రవర్తీ గోలీలాడుతూ కనిపిత్తారు.

కవి : అశోకుడు, శిబినా?

పైడి : మరే! అప్పుడు అశోకుడు మన ఈరోకి ఎల్ప్ సేత్తాడన్న మాట - అదేమో ఈర పాండ్య కట్టబెమ్మన్నకి నచ్చదు.

కవి : అయ్యా తమకి దణ్ణం పెడతాను - చరిత్ర మార్చకండి అశోకుడు, కట్టబొమ్మన్న సమకాలికులు కారు.

పైడి : అయ్యేం నాకు తెలీవయ్యా - కట్టబెమ్మన్న ఉంటే మన బొమ్మ వందరోజులాడతది! కత ఇను, ఇప్పుడే బాగుంటుంది... అప్పుడు కట్టబెమ్మన్న, టిప్పుసుల్తాను కలిసి గాంధీగారి దగ్గర మొరబెట్టుకుంటారన్న మాట.

కవి : (వినలేక మహాబాధపడుతున్నాడు. పైడితల్లి తెగ వినిపించేస్తున్నాడు.)

పైడి : దాంతో సుభం! కథ కంచికెల్లుద్ది.

(నీరసంగా లేచాడు కవి.)

కవి : అయ్యా నేను సామాన్యుణ్ణి, చరిత్రని, పురాణాల్ని తారుమారు చేసే ధైర్యసాహసాలు లేని అర్భకుణ్ణి. సీతమ్మ వినాయకుడి భార్య అని రాసే దమ్ములేని అయోగ్యుణ్ణి. తమకీ, తమ జ్ఞానానికి శతకోటి నమస్కారాలు. నేను మీ సినిమాలకి పనికి రాను మహాప్రభో... దయచేసి, మీరిక్కడినుంచి దయచేస్తే నాకు మనశ్శాంతి. దయ చెయ్యండి.

పైడి : వ్రైటీగా ఆలోసించలేనోళ్ళు మీరెట్టా పైకొత్తారయ్యా.... మీ ఇసయం నేనసలు ఇప్పుడే మా రేలంగోడితోను, మా ఎస్.వి.రంగారావ్ బాబాయ్‌తోనూ మాట్లాడి తేల్చేత్తానుండు....

(కవి అనుమానంగా చూశాడు.)

కవి : రేలంగితోను, రంగారావ్‌తోనూ మాట్లాడతారా... ఇంతకీ మీరిక్కడికి ఎక్కణ్ణించి వచ్చారు సార్?

(అరటి పళ్ళతోనూ, స్వీట్స్ పొట్లాలతోనూ వచ్చాడు రామం.)

రామం : ఆ మాట నేను చెప్తా...నా ... వీడి కోసం ఇవన్నీ కొనుక్కుని వస్తుంటే మన వీధి చివర తెల్సింది వీడి విషయం - వైజాగ్ పిచ్చాసుపత్రికి తీసుకెళుతుంటే మధ్యలో తప్పించుకుని పారిపోయి వచ్చాడట. వీడికోసం వీళ్ళవాళ్ళు వెదుకుతున్నారట.

(అదిరిపడ్డాడు కవి)

పైడి : అల్లకి నేనిక్కడున్నానని తెలిసిపోయిందా.

(పరిగెత్తి పారిపోయాడు)

కవి : వీడు పిచ్చివెధవా?

రామం : వీడి సంగతి సరే... అసలైన నిర్మాత పైడితల్లి గారు వీధి చివర రిక్షావాడితో కుస్తీపడ్తున్నారు. - ఇహనో ఇప్పుడో రొప్పుకుంటూ ఇక్కడికి వచ్చిపడతారు.

కవి : ఆ ... ఇంకోడొస్తున్నాడా?

(పోస్ట్‌మేన్ కట్ట తెచ్చి పడేసి కవి కేసి కోపంగా చూశాడు. జేబులోంచి రివాల్వర్ తీశాడు.)

కవి : ఆగు నాయనా - అదిటివ్వు.... అది నాకు అత్యవసరం...

(తీసుకుని కాల్చుకుని కిందపడిపోయాడు కవి.)

-శుభమ్-



# 1-15, డిసెంబరు 2001 సంచికలో శ్రీ మరుధూరి రాజా రాసిన 'కామెడీ రైటర్ ట్రాజెడీ' కథకు వచ్చిన స్పందన



తేది 1-15 డిసెంబరు 2001 'హాసం' పత్రికలోని మీ కథ 'కామెడీ రైటర్ ట్రాజెడీ' నేటి సమాజంలోని కుళ్ళుని కళ్ళకు కట్టినట్టు చూపించారు. ఎందుకంటే అది మీ కథ గనుక! ఎంతటి మంచి వారైనా కొన్ని సంఘటనల చేదు అనుభవంతో వెంటనే స్పందించడానికి వెనుకడుగు వేస్తుంటారనడానికి నిదర్శనం మీకు జరిగిన కాకరకాయ అనుభవమే! రిక్షా వాడికి చేసిన మేలు మరచిపోగా వాడి పరివారం మిమ్మల్ని, మీ సహచరుడ్ని సూటి పోటి మాటలతో గాయపరచడం నిజంగా క్షమించరాని నేరం. ఆ రిక్షావాడి కోసం మీ మానప్రాణాల్ని పణంగా పెట్టి సమాజానికీ, కలప ఓనర్ కీ, పోలీసులకి వెరవకుండా పేదవాడనే జాలితో, మానవత్వంతో ఇంతా చేస్తే వాడి మనుషులిచ్చే మాటల బహుమతి మూటలు మీరే కాదు సున్నిత మనస్కులెవరైనా మోయలేనిదే. అందుకు తాజా ఉదాహరణ నేను సార్! గత ఆరేడేళ్ళుగా నాకు పిన్ని వరస దగ్గర బంధువౌకామె కాళ్ళూ చేతులు చచ్చుపడి మంచాన పడివుంది. నిత్యకృత్యాలన్నీ తన ముగ్గురు కూతుళ్ళు దగ్గరుండి బలవంతాన ఎత్తి జరిపిస్తుంటారు. ఉండబట్టలేక వైజాగ్ ఓ ప్రముఖ హాస్పిటల్‌లో చూపిస్తే తగ్గిపోతుందని సలహా ఇచ్చాను. ఇచ్చిందే తడవు నన్ను తోడు తీసుకొని ఆ హాస్పటల్‌కి తీసికెళ్ళారు. నరాల డాక్టర్ అన్నీ పరీక్షించి నాలుగైదు రోజుల్లోనే నడిచేటట్టు చేసారు. పూర్తిగా కోలుకున్నాక ఇంటికి ఆమెను తెచ్చేసారు. ఓ రోజు నేను పలకరింపు కోసం వెళ్తే డబ్బులు బాగా ఖర్చయి పోయాయని... డబ్బుల్లో తేడా వచ్చిందని...' ఇలా అంటే ఎలా వుంటుందో మీ అనుభవమే మీకు చెబుతుంది. ఇదేంటి సార్! మీ కథ గురించి రాస్తూ నా కథలోకి వెళ్ళిపోయాను. క్షమించ మనవి. ఏనీ హౌ మీ కథలోని చివరి వాక్యాలు 'చెరగని నా... దీవించు... శాసించు'ను పదిల పరుచుకుంటే చాలు!

మీ అభిమాని
-కోనేరు ఆదినారాయణ రావు,
తర్లాగడివూరు, శ్రీకాకుళం.

1-15 సంచికలో మరుధూరి రాజాగారు రాసిన కథ చదివాను. శ్రీనగర్ కాలనీలో జరిగిన యాక్సిడెంటు గురించి చెపుతూ పాతికేళ్ళ వెనుకకు ఒంగోలులోని శర్మ కాలేజీ రోజులకు తీసుకెళ్ళి దాదాపు చాలా సినిమాలలో కనపడే ఫ్లాష్‌బ్యాక్ ఈ కథలోనూ ప్రవేశపెట్టి ఫక్తు సినిమా కవిననిపించుకున్నారు. ట్రాజెడీ అంటూనే ప్రారంభించినా కొన్ని కామెడీ టచ్‌లు అంటే తళుకులు కొన్ని కనపడ్డాయి. ఓ ప్రక్కన రిక్షాయాక్సిడెంటు, హాస్పిటల్ తీసుకెళ్ళాలన్న చర్చలూ గౌస్ 'బావా సినిమాకు టైం అయిపోతుంది' అనడం, డాక్టరు కావాలని నర్సుని అడిగితే "ఈ రోజు సండేకదా జస్ట్ రిలీఫ్ కోసం ఇంటికెళ్ళారు..." అనడంలో డాక్టరు జేబుల వంక చూశాడు అనడంలో ఆ కామెడీ మెరుపు కనిపించాయి. ఇక ట్రాజెడీ పరంగా చూస్తే శ్రీనగర్ కాలనీ యాక్సిడెంట్ గురించి వ్రాసిన బోల్డు(ఇంగ్లీషు బోల్డు) అక్షరాలలోనే కనిపిస్తుంది ట్రాజెడీ అంతా!

'...స్కూటర్ మీది మనిషి గాలిలోకి ఎగిరి నేలకు గుద్దుకోవటం...' ఆ పద ప్రయోగమే కథకు విషాద వాసనలందించింది. నిజాయితీ మీద, శీలం మీద హాస్పటల్‌లో, పోలీసు స్టేషన్లో, చివరికి రిక్షావాడి గుడిసెలో గాయం కావడం ఇవన్నీ ట్రాజెడీ లక్షణాలున్నా కామెడీ పదాల ప్రయోగమే. పోతే ఈ కథలో నన్నెక్కువగా ఆకట్టుకున్నది క్రిష్టఫర్ ఇచ్చిన డిగ్నిఫైడ్ వార్నింగ్. ఆ 'ఫ్యూ వర్డ్స్' రియల్లీ సుపర్బ్ అండ్ ఎక్సెలెంట్. వేమన పద్యాన్ని చాణక్యుడి గొంతుతో వినిపించాడు అన్నది మళ్ళీ కామెడీ టచ్. "ఏం లాభం లేకుండా ఎందుకు సాయం చేస్తారు" అని ఒక మహాకవి అన్న మాటలు విని "మా కళ్ళలో ఎవరికి కనిపించని కన్నీటి చుక్కలు" అని మీరు చెప్పటం రచయితగా మీ ఈ రచనలో పరాకాష్టగా నేను అనుకొంటున్నాను. కాని ఒక్కసారైయినా స్కూటర్ మీది వ్యక్తి ఏమయ్యాడో చూచి ఉంటే బాగుండేదేమో! అంతా చీకటిగా వుందన్నారు కదా! ఎప్పుడూ పాత అనుభవాల లాంటివే కలుగుతాయంటే ఎలా...!

-జి. ప్రభాకర్ రావు, హైదరాబాద్-28.

డియర్ మరుధూరి రాజా! "కామెడీ రైటర్ ట్రాజెడీ" కథ 'హాసం'లో మానవత్వానికి అద్దం పట్టింది. రిక్షావాడికి నష్టపరిహారం ఇవ్వడంలో అతనికి అనుమానం రావడం అసమంజసం. కథ ఆద్యంతం ఎంతో ఆసక్తితో సాగింది. ముఖ్యంగా ఈ కథలో మీరు సహాయగుణానికి పెద్దపీట వేశారు. అదే విధంగా మానవతకు కూడా.

-ఎం.డి.ముస్తఖీమ్, మహబూబ్‌నగర్.

కామెడీ రైటర్ ట్రాజెడీ... కథ పేరు దగ్గర నుంచి అసలు దృష్టాంత మంతా కథలా లేదు... ఓ వాస్తవ ప్రపంచాన్ని మా ముందుంచి నట్టనిపించింది.

"మంచి వాడనిపించుకోవడానికి ఎంతో
పోగొట్టుకోవాలి...
జాలి గల వాడనిపించు కోవడానికి
హృదయాన్నే వదులుకోవాలి"

ఓహో... ఎంత ఖచ్చితంగా చెప్పారండీ...

కాని ఎంత మానసిక సంఘర్షణను ఎదుర్కోవాల్సి వచ్చినా... మంచి చేయడం ఆపకూడదు...! ఎంతమంది మన హృదయాన్ని తూట్లు పొడిచినా ధర్మాన్ని కాపాడి తీరాలి!!

మానవత్వంతో కూడిన చిరునవ్వు ఎపుడూ మధురాతి మధురాను భూతిల్ని పొలికిస్తుంది. చూసే వాళ్ళ దృష్టిలో మార్పు అంతే!!

-నేమాన సుభాష్ చంద్రబోస్,
ఇలిసిపురం జంక్షన్, శ్రీకాకుళం.

తనకొచ్చిన ఉత్తరాలలో పైన ప్రచురించిన ఈ నాలుగు బావున్నాయనీ, అందులో 'శ్రీ కోనేరు ఆదినారాయణ రావు, తర్లాగడివూరు, శ్రీకాకుళం' రాసిన ఉత్తరం బహుమతికి అర్హమైనదని తెలిపారు మరుధూరి రాజా.

ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలలపాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాం. తక్కిన ముగ్గురికీ 'హాసం' 1-15 జనవరి,2002 సంచికను సముచితంగా పంపు తున్నాము.

నూతన సంవత్సర శుభాకాంక్షలతో
-ఎడిటర్

# సినిమాలలో హాస్యగీతాలు

-వి.ఎ.కె.రంగారావు

**జనవరి13, హాస్య దినోత్సవ సందర్భంగా 1968లో 'విజయచిత్ర'లో వెలువడిన వ్యాసం పునర్ముద్రణ**

మొన్న మొన్నటిదాకా ప్రతి తెలుగు చిత్రంలో కనీసం ఒక్క హాస్యగీతమైనా లెక్కకు వుండేది. ఈ నియమం యిటీవల సడలుతూ వున్నా అడపాదడపా అటువంటివి తటస్థపడుతూ, సందర్భానుసారం ప్రేక్షకులను రంజిస్తూనో, భంజిస్తూనో వున్నాయి.

ఈ నాటి హాస్యగీతాలలో సర్వసాధారణంగా వినిపిస్తున్న కంఠాలు పిఠాపురం, మాధవపెద్ది, స్వర్ణలత, ఎల్.ఆర్.ఈశ్వరి, కె.జమునారాణి. అరుదుగా ఘంటసాల, పి.బి.శ్రీనివాస్, పి.సుశీల, ఎస్.జానకి కూడా యిటువంటి పాటలు పాడుతుంటారు. అరువు కంఠాలతో కాకుండా యెవరికివారే పాడుకునే రోజుల్లో పేరు పొందిన ఆస్సెగాళ్ళూ ఆస్సె పాటగాళ్ళూ ఒకళ్లే. శివరావు, రేలంగి, నల్ల రామ్మూర్తి, సీతారాం, కనకం పాడిన హాస్యగీతాలలో కొన్ని యింకా మరుపురానివి వున్నాయి. ఇంకా ముందు తరంలో కూడా కొందరున్నారు. కాని వారితో నేటి పఠితలలో పదవశాతం వారికి తెర పరిచయం కూడా వుండదని వారిని వదిలి వేయటం జరిగింది. (లంక సత్యం, డా. సిహెచ్.బి.వెంకటాచలం యిత్యాదులు).



తెలుగు చిత్రాలలో హాస్యగీతాలు చాలమట్టుకు చమత్కార పరిమళంతోనే రాజిల్లినా, అప్పుడప్పుడు అశ్లీల దుర్గంధం కూడా వెదజల్లాయని చెప్పక తప్పదు. దీనికి ఒక కారణం కొందరు ఆంధ్రశ్రోతలూ, ఆంధ్ర రచయితలూ దర్శక నిర్మాతలూ ఆశ్లీలాన్ని స్ఫురింపజేయటం హాస్యమనుకోవటమే - యేడవలేక బోర్లపడినట్లు. మరొక కారణం గ్రామఫోన్ రికార్డులలో కామిక్ గీతాలకు పేరు పొందిన దొడ్డమ్మ, డా॥ సిహెచ్.బి.వెంకటాచలం, వల్లూరి జగన్నాథం, బందా కనకలింగేశ్వరరావు వీరందరి పాటలలోనూ సూచీప్రాయంగానో చెంపదెబ్బ వాటంగానో ద్వంద్వార్థ సంజనిత హాస్యరేఖ వుండటం. కాని 'ఎర్రా ఎర్రనిదాన, ఓయమ్మే యెత్తు పిర్రాలదాన, నీ పిర్రమీద పిడుగుబడా నిన్నేలుకోనిత్తునా' అని టి.వి.ఎస్. శర్మ (నేటి కళా దర్శకుడు) ప్రతిజ్ఞ చేసినప్పుడూ, 'పన్నెండేళ్ళ కుర్రాడే పైట కొల్లగొన్నాడే' అని బందా కనక లింగేశ్వరరావు మొరపెట్టినప్పుడూ, బత్తాయి పళ్ళ గురించి వల్లూరి జగన్నాథం, తడిసిన దేహాల గురించి దొడ్డమ్మ 'నాకాలము నాడేలము నాడేలాగుంటేనేమో ఒలె పిన్నమ్మా' అని డా॥ సిహెచ్.బి.వెంకటాచలం గునిసినప్పుడూ, అంతర్లీనంగా వున్న ద్వంద్వార్థం వెగటు కలిగించేది కాదు. అంతంత మాత్రంగానే యీనాటి సినిమాల కోసం ప్రత్యేకంగా వ్రాయించిన పాటలు వింటూంటే వాంతి వస్తోందంటే యెందుచేతనంటారు! నిజానికి సరియైన కారణమేదో నాకు స్ఫురించటం లేదు. ఒకటి అయితే అయివుండొచ్చు - నాటి పాటలలో వున్న ఒక విధమైన అమాయకత యీనాటి పాటలలో లేకపోవటం!

హాస్యరసోత్పత్తి గావించేది యే పాటయినా హాస్యగీతమేనని స్థూలంగా చెప్పుకోగలిగినా సూక్ష్మంగా చూస్తే వీటిలో కొన్ని తరగతులు కనబడక మానవు. సౌకర్యానికోసం వాటినీ విధంగా విభజిద్దాము.

1. పాట సాధారణము; హాస్యగాడు పాడేది.
2. పాట సాధారణమే. సాధారణ పాత్ర పాడేదే. సన్నివేశాన్ని బట్టి హాస్యరసాన్ని సంతరించుకొనేది.
3. పాట, పాత్రా, రెండూ సాధారణమే అయినా చిత్ర ప్రయోగం ద్వారా హాస్యగీతాల జాబితాలోకి చేరేవి.
4. పాటే హాస్యధోరణిలో వుండేది.
5. అపహాస్యగీతాలు, చివరివి విభాగం గురించి యిక్కడే ఒక మాట. ఒక వ్యక్తినో, వ్యవస్థనో అపహసిస్తూ వ్రాయబడిన పాటలు కావివి. ఏదో కారణం చేత అపహాస్యం పాలైనవి.

**1.** **గొప్పగొప్పోళ్ళ లోగిళ్నిండా లడాయ్‌బడాయ్**
**కొద్దికొద్దోళ్ళ పుటకే హాయ్**
**రొక్కమెక్కువయేతలికి సీకూసింతా**
**జంట రెక్కలాడేవోళ్ళే సిలకా గోరింకా"**

**(మల్లాది రామకృష్ణశాస్త్రి: అశ్వద్ధామ: చిన్నకోడలు)**

**మెరుగుచెడని సరి కొత్తది**
**ఇంకెయ్యాల అడిగిన ఉత్తది**
**ఇదిర అదును కదలిరా**
**భలే దొరలకు దొరకని సొగసు**
**అనువగ దొరకును రంగయ్య**

**(సముద్రాల సీనియర్: ఘంటసాల, షావుకారు)**

నేపథ్య గాయకులు పాడి నటీనటులభినయించిన మొదటి పాట, కనకం పాడి, అడిన రెండవ పాట యీ కోవకు చెందిన వాటికి చక్కని ఉదాహరణలు. రచనలో నిజానికి హాస్యం లేదు. ఒక దానిలో జగమనుకొనే సత్యమూ, రెండవ దానిలో ఊరింపూ వున్నాయి. కాని వాటిని హాస్య వేషధారులు తెరపై పాడటం వలనా, పాట పాడటంలో కూడా కొంత హాస్యరస స్ఫోరకమైన మెళకువలు జొప్పించటం వలనా అవి హాస్యగీతాలనిపించుకోదగినివి.

**2.** ఉత్తమ తరగతి హాస్యానికి చెందినవీ, ఆ భావానికి హాయి పందిళ్ళనదగ్గవీ చాలాభాగం యీ విభాగంలోనే వున్నాయి. వీటిల్లో మరొక సుగుణం వరసలోనూ రచనలోనూ హాస్యం వుండనే వుండదు. కనుక వెకిలితనానికి తావే లేకపోవడం.

"సత్తూ చిత్తుల భేదము తెలియక
చిత్తే సత్తనుకున్నావు నా
యెత్తు నెరుగకున్నావు
ఓ మనసా నేనెవరో నీకు తెలుసా"

**(పింగళి: ఘంటసాల: పెళ్ళిచేసిచూడు)**

వింటానికి కేవలం యిదొక తత్వం. రచనలో హాస్యం వెతికి చూచినా కనబడదు. కాని సినిమాలో జి.వరలక్ష్మి నర్సుగా భర్త దగ్గర హొయలు కురిపిస్తూ 'లీలగా' మామగారి దగ్గర అణుకువ అభినయిస్తూ వుంటే చెరుకు రసం వంటి హాస్యరసం ప్రవహిస్తుంది. ఇటువంటిదే యిది కూడా!

"మేడలోను కోడి పుంజు కాల కత్తి కట్టరా
నీడలోను చిన్నదాని నెత్తిపైన మొట్టరా
పంచవన్నె చిలుకెగిరి పర్వతాలు పట్టరా
కంచి వరద! తెలివికి మంచి పదును బెట్టరా
గండుపిల్లి మేను మరచి బండనిదుర పోయెరా
కొండ ఎలుక లిచట రెండు
కొలువు చేయుచుండెరా"

**(సముద్రాల సీనియర్: విశ్వనాథన్ - రామ్మూర్తి: తెనాలి రామకృష్ణ)**

ఈ పాటను పాడిన పాత్రలు రాజలక్ష్మీ రక్షణోద్యుక్తులైన తిమ్మరసు, రామకృష్ణుడు. ఈ సన్నివేశంలో రెండవ పాత్రలోనూ హాస్యరసం లేదు. కాని నెత్తిపై మొట్టవలసిన నీడలోని చిన్నదీ పర్వతాలు పట్టించవలసిన పంచవన్నెల చిలుకా రాయలవారినే రసవ్యాపారంలో ముంచి వేసిన కృష్ణసాని అనీ, కాలకత్తి కట్టవలసిన మేడమీది కోడి పుంజు రాయలవారే అనీ స్ఫురించినప్పుడు హాసం ఛాయామాత్రంగా ఉద్భవిస్తుంది. ఇక రాజుల నేలిన రామకృష్ణుడూ, రాజ్యాల నేలించిన తిమ్మరసూ తమను తాము బండనిదురపోతున్న గండుపిల్లి యెదుట కొలువు దీరిన కొండ యెలుకలుగా వ్యవహరించారని తెలియగానే నవ్వు ఫకాలున పొంగుతుంది. దీనికి కొంత తోడ్పడినది పిలకలల్లలాడగ తెరపై నాగేశ్వరరావు నాగయ్య చిందులు త్రొక్కిన తీరు.

**3.** ఈ చిత్రమైన వరవడి వరసలోనూ వుండవచ్చు. రచనలోనూ వుండవచ్చు. మామూలు పాటల జాబితాలోంచి ఆ పాటలను తప్పించి హాస్య గీతాలలో చేర్చేది యీ చిత్రమైన గుణమే.

'లంబో తలుక్కు బెలుక్కు చూడవయా
వణక్క గొణక్క మిణక్క సణక్క చూడవయా'

**(రావూరి: జి.రామనాథన్ : వరుడు కావాలి)**

అన్న భానుమతి పాటలో అర్థం పర్థం లేదు. కాని ఆ మాటలు, ఆ వరస ఒక విధమైన హాస్యాన్నే జనింపజేస్తాయి. ఇటువంటివే "చంద్రలేఖ"లో "హైయో పకడియా!" "మాయలమారి"లో గూడెంపాటలు మా "టింగు రంగా"లో నల్ల రామ్మూర్తి, సీతారాం పాడిన 'నారయః' (టి.వి.రాజు) అన్నదీ.

**4.** నాటికి తొంభైపాళ్ళు హాస్యగీతాలు యీ తరగతివే అయివుంటాయి. వీటిలోనే సున్నితమైన హాస్యమూ, సమ్మెట పెట్టులాంటి ద్వంద్వార్థమూ రెండూ కనబడగలవు.



'కన్యాశుల్కం' సినిమా లోని 'చిటారు కొమ్మను...'పాటలో యన్.టి.రామారావు, మాస్టర్ కుందు

చిటారు కొమ్మను మిఠాయిపొట్లం
చేతికందదేం గురుడా
వాటం చూసీ వడుపు జేసీ
వంచర కొమ్మను నరుడా
పక్కన మెలిగే చక్కని చుక్కకు
చక్కిలిగింతా లేదేం గురుడా
కంచుమోతగా కనకం మ్రోగదు
నిదానించరా నరుడా

**(మల్లాది రామకృష్ణశాస్త్రి: ఘంటసాల : కన్యాశుల్కం)**

పై గురుశిష్య సంవాదంలో రచనాచమత్కృతీ వున్నది, రమ్యతా వున్నది, ద్వంద్వార్థమూ వున్నది. ఆ రెండర్థాలలోనూ పెడర్థం లేదు. సున్నితమైన హాస్యమే వున్నది. ఒక కొమ్మ గిరీశమెక్కిన మామిడి చెట్టుది. మరొకటి బుల్లెమ్మ. ఇన్ని సుగుణాలూ ఒక్క హాస్య గీతంలో సమకూరటం చాలా అరుదు.

ఇక కంపుగొట్టిన హాస్యగీతాలూ వున్నవి. ఇవి వ్రాసినవారికీ వ్రాయించుకున్న వారికీ సరియైన అభిరుచి లేకనో లేక హాస్యమంటే వారి పరిభాషలో బూతు అనే అర్థం వుండటల వలనో యీ దుర్వాసన పుట్టింది. దీనికి కొంత బాధ్యత వహించవలసినది సినిమాలలో హాస్యగీతాలు పాడుతూ పేరు సంపాదించుకొని అపభ్రంశాన్నీ ఆవుపేడనీ కలిపి హాస్యమనే పేరుతో ప్రైవేటు గ్రామ ఫోను రికార్డులు యిచ్చిన కొందరు నేపథ్య గాయకులు. వీరిలాగానే ఈ ప్రైవేటు పాటల రచయితలకు మతీ శ్రుతీ లేదనిపిస్తుంది, ఆ రికార్డులు వింటూంటే కాని ఈ రచయితలు మాత్రం నాటికి తొంభైతొమ్మిది పాళ్ళు సినిమాలకు వ్రాసే వాళ్ళు కారు. అలా వ్రాయటానికి వలసిన ప్రతిభా వ్యుత్పత్తులు లేక బూతే శరణ్యమని భోరుమన్నవారు. వీటి విరివి అమ్మకం సినిమా రచయితలనూ, నిర్మాతలనూ కొంతవరకు ప్రలోభ పెట్టి అటువంటి పోకడలను యిక్కడా ప్రోత్సహించినదని చెప్పవచ్చు.

ఈ కంపు లేకుండా వందలాది హాస్య గీతాలను వ్రాసి ఆబాలగోపాలాన్ని ఆనందపరిచిన ఒకే ఒక రసరాజు కొసరాజు. వీరి

రచనలకివీ ఉదాహరణలని చెప్పడం కన్న గత పదేళ్ళలో అశేష ప్రజాదరణపొందిన హాస్య గీతాలను యేకరువు పెట్టడం సులభం. అయినా కొన్నిటిని చెప్పుకోవాలి తప్పదు.

**నాజూకైన గాడిద నా వరాల గాడిదా**
**నమ్మినోళ్ళ మోసపుచ్చదు నాలుక్కాళ్ళ గాడిద**
**(ఘంటసాల: మర్మయోగి)**

**'నీటైన పడుచున్నదోయి నా రాజా**
**నీకే నా లబ్జున్నదోయి**
**మగవారి మాయలోని చిక్కనన్నదీ అది**
**మాటంటే యెన్నటికి పడనన్నదోయ్**
**ఒకటంటే పది బాగా వడ్డిస్తానన్నదోయ్**
**చెవి పట్టుకొని సాగదీస్తాలెమ్మన్నదోయ్'**
**(ఎస్.రాజేశ్వరరావు: రాణీ రత్నప్రభ)**

తక్కిన రచయితలూ అవకాశాన్ని బట్టి హుషారైన హాస్య గీతాలు వ్రాస్తూనే వున్నారు. 'ఇరణ్యా కసిపుడరా, నిన్నూ యిరసక తింటనురా' అని జి.కృష్ణమూర్తి 'గురువును మించిన శిష్యుడి' లోనూ 'మరదలా చిట్టి మరదలా' అని డా॥ సి.నారాయణరెడ్డి 'గోపాలుడు భూపాలుడు'లోనూ పిల్లా పిల్లారా, పెళ్ళి చేసుకో అన్నాడు. కుర్రోడు బతిమాలుతూ' అని "అల్లావుద్దీన్"లోనూ "ఇండియాకు రాజధాని ఢిల్లీ, నా హృదయానికి ప్రేమరాణి లిల్లీ" అని "అక్కచెల్లెళ్లు" లోను ఆరుద్రా చక్కని హాస్యగీతాలే వినిపించారు.

ఆరుద్ర వ్రాసిన సుమారు వంద హాస్యగీతాల లోనూ మకుటాయమానం 'నువ్వంటేనే నాకు మోజు, అలా వ్రాసిస్తానే దస్తావేజు' అన్న పాట (అశ్వత్థామ: మా యింటి మహాలక్ష్మి) ఆ పాట పాడే పాత్ర వకీలు దగ్గర గుమస్తా. ఆ పారిభాషిక పదాలే యీ ప్రేమ గీతంలో చొప్పించి హాస్యరసం చిప్పిలజేశారు.

**నీ మనసు నా హృదయం ఎక్స్‌పార్టీలై**
**తీసుకున్నాయి డిక్రీని నా పై**
**మీనులాంటి నీ కన్నులు అమీనై**
**జామీను లేని నా మదిని జప్తు చేసినై**
**చేసుకుందాం నువ్వు నేను సెటిల్‌మెంట్**
**రాసుకుందాం మేరేజికి అగ్రిమెంట్**
**సౌఖ్యానికి దాఖలు చేద్దాం పిటీషన్**
**భయమెందుకులే రాదు లిటిగేషన్**

**5.** అపహాస్యగీతాలు యివీ అని కనుక్కోవటానికి కొంత విషయ పరిజ్ఞానం ఒకింత నిశిత బుద్ధి అవసరం. లేకపోతే.

**ద్వారకా వీడీ నీరధిలోనా దాగిన ధీరా రా**
**(సముద్రాల సీనియర్: వీరాభిమన్యు)**

అన్న పాటలో అందమే కనబడుతుంది. ద్వారక నీరధి (సముద్రం)లో వుందనే మాట స్ఫురించదు. అలానే అనురాగానికి కనులేలేవని ఆర్యులు అన్నారు. (ఆరుద్ర: సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి) అన్న పాటలో 'లవ్ ఈస్ బ్లయిండ్' అన్న ఆంగ్లోక్తి తెలిస్తే గాని 'అనురాగానికి కనులే లేవని అన్నది అప్రాచ్యులు' అనిపించదు. అందులోని అపహాస్యం గోచరించదు. ఇలాంటివి వెతికితే మరికొన్ని. ఇవి వ్రాసిన రచయితల తాహతును గమనిస్తే ఒక వేళ నిర్మాతల మేధసరచయితలూ తెలివిగా అపహసించారా? అని కూడా తోచక మానదు. ఇదీ హాస్యమే మరి! అంతా వాడి లీల!!

(శ్రీ రంగారావు ఫోటో కర్టసీ: లాలిత్ కుమార్)






## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. జావళి (సీమసింహం... రెండు జెళ్ళ)
   ఎ) శృంగారగీతం బి) సమూహము
   సి) పర్వతము డి) వరుస
2. కొరకంచు (టక్కరిదొంగ... అలేజా)
   ఎ) సగం, సగం మాట్లాడడం
   బి) ఒక రకమైన లోహం
   సి) కాలి ఆరిన కట్టె
   డి) గయ్యాళి
3. నిరీక్షణ (ప్రేమికుడు... ఓ చెలియా)
   ఎ) అలక బి) పరీక్ష
   సి) ప్రేమ డి) ఎదురుచూచుట
4. మనసిజ (మెరుపు కలలు... మచిలీపట్నం)
   ఎ) మన్మథుడు బి) మనసు లేని వాడు
   సి) బంధువు డి) ప్రేమికుడు
5. పరదా (బొంబాయి... ఉరికే చిలకా)
   ఎ) ఇతరులకు సంబంధించినది
   బి) హాస్యము
   సి) అపోహ డి) తెర
6. ధరణి (మెరుపు కలలు... ఓ వానా పడితే)
   ఎ) కవ్వము బి) ఖరీదు
   సి) భూమి డి) చెట్టు
7. పున్నాగము (తెనాలి... ఎదను దోచి)
   ఎ) నాగమణి బి) తెల్లకలువ
   సి) పాము డి) కుట్ర
8. తలిరుటాకులు (సఖి... అలై పొంగెరా)
   ఎ) తెల్లని ఆకులు బి) రాలిన ఆకులు
   సి) చిగురుటాకులు డి) అరిటాకులు
9. కలవరము (ప్రేమికుడు... ఓ చెలియా)
   ఎ) ఆందోళన బి) నిద్ర
   సి) పీడ కల డి) కోరిన కల
10. మనుగడ (దొంగ దొంగ... కొత్త బంగారులోకం)
   ఎ) ఉపయోగపడునది
   బి) మనుష్యులు
   సి) కర్ర డి) జీవనము

### జవాబులు

1) a 2) c 3) d
4) a 5) d 6) c
7) b 8) c 9) a
10) d




విడుదల : ఆదిత్యా మ్యూజిక్
వెల : 38/-రూ.







బాలకృష్ణ, సిమ్రాన్, రీమాసేన్ కాంబినేషన్‌లో భగవాన్, దానయ్య నిర్మాతలుగా జి.రామ్‌ప్రసాద్ దర్శకత్వంలో జె. పుల్లారావు సమర్పించిన 'సీమ సింహం' ఆడియో ఆదిత్యా మ్యూజిక్ సంస్థ ద్వారా విడుదలయింది, మణిశర్మ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

భువన చంద్ర రాయగా శంకర్ మహదేవన్, చిత్ర పాడిన 'రెండు జెళ్ళ పాప రేణిగుంట చేప' పాట ఫుల్ మాస్ సాంగ్. యూత్‌ని దృష్టిలో పెట్టుకుని కట్టిన పాట కనుక సంగీతం, సాహిత్యం, గానం అన్నీ ఆ తూకంలోనే జతపడ్డాయి. సిరివెన్నెల సీతారామశాస్త్రి రాయగా బాలు, కవితా సుబ్రహ్మణ్యం పాడిన 'కోకా రైకా హుషారుగా డీకొన్నవయ్యో' పాటది కూడా అదే స్థాయి. కుర్రకారుని ఆకట్టుకునే ఈ పాటకి బేస్‌గా జానపద బాణీని తీసుకోవటం మణిశర్మ తెలివి తేటలకు ఓ చిన్ని ఉదాహరణ. రికార్డింగ్‌లో ఏం టెక్నిక్ వాడారో ఏమోగాని బాలు కంఠం చాలా షార్ప్‌గా వినిపించింది ఈ పాటలో. ఇటీవల 'డాడీ' సినిమాలో 'మందారం బుగ్గల్లోన మచ్చెట్టొచ్చిందే' పాటను రాసిన శ్రీనివాస్‌కు రచనాపరంగా జత పడిన మరో హిట్ సాంగ్-'పోరి హుషారుగుందిరో హైటేమో ఆరుందిరో!' మధ్యమావతి రాగాన్ని ఆధార రాగంగా చేసుకుని స్వరపరిచిన ఈ ట్యూన్ యువత చేత కేరింతలు కొట్టించడం ఖాయం. దర్శక నిర్మాత కె.బి.తిలక్ 1956లో 'ముద్దు బిడ్డ' అనే సినిమా తీశారు. ఆ సినిమాలో సంగీత దర్శకుడు పెండ్యాల 'పదరా సరదాగా పోదాం పదరా బావా చిందేసుకుంటు - పదరా సరదాగా పోదాం పదరా' అనే పాటను జిక్కి బృందంతో పాడించారు. మణిశర్మ ఆ పాట విన్నారని గాని, ఇన్‌స్పిరేషన్‌గా తీసుకున్నాడని చెప్పలేం. కాని పల్లవి వరకు తీసుకుంటే ఆ ఛాయలు బాగా కనిపిస్తాయి. అలాగే 'సీతారాముల కళ్యాణము చూతము రారండి' పాటలో 'చూతము రారండి' అనే వాక్యాల దగ్గర ట్యూన్ 'హైటేమో ఆరుందిరో' దగ్గర ప్రతిఫలిస్తూ ఉంటుంది. అందుకు కారణం మధ్యమావతి రాగమే తప్ప మరొకటి కాదు. ఇక రచనా పరంగా శ్రీనివాస్ సినీ పరిశ్రమలో బలంగా పాతుకుపోయే అవకాశాలు కనిపిస్తున్నాయి. మనో, రాధిక విజృంభించి పాడిన ఈ పాట వాడ వాడలా మారుమోగి తీరుతుంది. 'అవ్వా బువ్వా కావాలంటే ఎట్టాగమ్మో' కూడా మరో ఫుల్ బీట్ సాంగ్. ఉదిత్ నారాయణ్, స్వర్ణలత పాటకు పూర్తిన్యాయం చేశారు. ఈ పాటను శ్రీనివాస్ రాసినట్టుగా ఇన్‌లే కార్డుపై పేర్కొనడం జరిగింది. కానీ తానే ఆ పాటను రాశానని సిరివెన్నెల సీతారామశాస్త్రి 'హాసం'కు ప్రత్యేకంగా తెలిపారు. హరిహరన్, సుజాత పాడిన 'చందమామా చందమామా అంత దూరం ఎందుకమ్మా' పాట ఒక విధంగా సీతారామశాస్త్రి పాట ఇంకో విధంగా మణిశర్మ పాట. మనవాళ్ళు కొంతకాలంగా ముట్టుకోని 'గౌరీ మనోహరి' లాంటి ఫక్తు క్లాసికల్ టచ్ ఉన్న రాగాన్ని తీసుకుని దాన్ని ఈ కాలానికి తగ్గ బీట్ ఓరియెంటెడ్ సాంగ్‌కి మలచుకోవటం మణిశర్మ పని తనానికి మచ్చు తునక అయితే తన మార్కుతో తీర్చి దిద్దటంలో సీతారామశాస్త్రి సాహితీ సంపద మరో మెచ్చుతునక. శంకర్ మహదేవన్ పాడిన 'మంచితనం ఇంటిపేరు మొండితనం ఒంటిపేరు' పాట వినగానే - ఇది బాలకృష్ణ కోసమే తయారు చేసిన పాట అని చెప్పొచ్చు. ఆ యాంగిల్ లో రచయితగా చంద్రబోస్ నూటికి నూరుపాళ్ళు సక్సెస్ అయ్యాడు. ఇది హీరో ఇంట్రడక్షన్ సాంగ్ కాబట్టి అందుకు కావలసిన హంగులన్నీ స్వరపరంగా కూర్చటంలో మణిశర్మ కూడా అదే లెవెల్లో నిలబడ్డాడు. ●

దర్శకుడు జయంత్ నిర్మాతగా మారి మహేష్‌బాబు హీరోగా నిర్మించిన 'టక్కరిదొంగ' ఆడియో క్యాసెట్ ఇటీవల కొత్తగా వచ్చిన సుమధుర్ ఆడియో సంస్థ ద్వారా విడుదలయింది. మణిశర్మ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

శంకర్ మహదేవన్ పాడిన ' నలుగురికి నచ్చినది నాకసలే ఇక నచ్చదురో 'పాట నలుగురికీ నచ్చేపాటగా రూపొందటానికి, మణిశర్మ చేసిన కృషి సంథింగ్ స్పెషల్‌గా రూపొందటానికి చంద్రబోస్ పడ్డ తపనా పాట త్రూ అవుట్ కనిపిస్తూనే ఉంటుంది. పల్లవిలోని ' నలుగురికి నచ్చినది నాకసలే ఇక నచ్చదురో ' అనే లైను వింటుంటే లోగడ 'యువకుడు' సినిమా కోసం మణిశర్మ కూర్చినదే 'జగడ జగడ జగడానందం రగడరగడ రసగోవిందం' పాటలో 'పాత చెప్పులు పాత గొప్పలు చెల్లవులే ఈనాడు' అనే లైను గుర్తుకొస్తుంది. టిప్పు, కల్పన పాడిన ' హే మామా మామా మామా హేహే మామా వచ్చాడే వాస్కోడిగామా' పాటని హిట్ సాంగ్ ఆఫ్ ది ఫిల్మ్‌గా పేర్కొనాలి. రానున్న రోజులలో ప్రతిచోటా అదిరిపోబోయే పాట యిది. మణిశర్మ ఎక్కడికివెళ్ళినా కొన్నాళ్ళ వరకూ ఈ పాటతో ఐడెంటిఫై చెయ్యటం జరుగుతుంది. అదలా ఉండగా పల్లవి వింటుంటే ' చెలి' సినిమాలో 'ఓ మామా మామా' పాటగాని, 'ఆనందం' సినిమాలో' మోనాలీసా మై సిస్టరే' పాటగాని గుర్తుకు వచ్చే అవకాశం ఉంది. 'జీనా మర్‌నా ఏమైనా నీదే ఈమైనా / సోకే నీకే నజ్‌రానా నాదిందిన్నా' వంటి వాక్యాల దగ్గర వెన్నెలకంటి మంచి కాయినింగ్ ఇచ్చారు. బాలు, ప్రసన్న పాడిన 'చుక్కల్లో చంద్రుడీ చిన్నోడు' పాట మరో హిట్ సాంగ్. మణిశర్మ ట్యూన్ పరంగా ఎంత ఆడుకున్నాడో ఆర్కెస్ట్రయిజేషన్ పరంగా అంతకంటే ఎక్కువగా చెలరేగిపోయాడు. ఓ వైపు బీట్స్, మరో వైపు వయొలిన్, ఇంకోవైపు అకార్డియన్ వంటి వాద్యాలకు పూర్తి గుర్తింపు లభించేలా కూర్చి మణిశర్మ బ్యూటిఫుల్ ఇంటర్లూడ్స్ అమర్చారు. కాకపోతే మధ్యలో 'అందమైన ప్రేమరాణి చెయ్యి తగిలితే '(ప్రేమికుడు) పాట ఆర్కెస్ట్రయిజేషన్ కూడా గుర్తొచ్చే అవకాశం ఉంది. ట్యూన్‌కు తగ్గ సాహిత్యాన్ని సమకూర్చటంలో కులశేఖర్ అందించిన శబ్ద సౌందర్యాన్ని ఆస్వాదించాలంటే పాట సాహిత్యాన్ని ఎదురుగా పెట్టుకుని కంపేర్ చేసుకుంటూ వినాల్సిందే. కె.కె, కల్పన పాడిన 'అలేబా అలేబా...ఏదంబ్బారారబ్బా' పాట కూడా కొంతకాలం పాటు యూత్ నోళ్ళలో నానుతుంది. ఈ పాటలో కూడా 'కన్నెపిల్లా గుర్రం ఒకటే లే మనసా' అనే చరణం మొదలవటానికి ముందు వచ్చే ఇంటర్లూడ్‌లో మణిశర్మ మళ్ళీ ఆర్కెస్ట్రయిజేషన్‌లో స్పెషాలిటీ చూపించాడు. ఇదిలా ఉండగా మాల్‌కోస్ రాగాన్ని ఆధారంగా మలుచుకుంటూ ఈ పాటను స్వర పరచటం ఓ విశేషం. ఇక సాహిత్య పరంగా భువనచంద్రకిలాంటి పాటలు కొట్టిన పిండి. 'పలికిస్తా రావే నీ తబలానీ' లాంటి చిలిపి ప్రయోగాలు ఆయన మార్కుని మరింత పట్టిస్తాయి. 'బాగుందమ్మా బాగుంది అమ్మాయి నీ ముద్దు' పాటలో పాడిన ఎస్.పి.చరణ్, ఉష కంఠాలు ఫ్రెష్‌గా వినిపించాయి. ట్యూన్ పరంగా చూస్తే మిగిలిన నాలుగు పాటల విజృంభణతో కొంచెం తట్టుకోవటం కష్టమే. రచయితగా కులశేఖర్ ఇలాంటి పాటలు కూడా చాలా సులువుగా రాయగలను అని చెప్పటానికి ప్రయత్నిస్తున్నట్టు కనబడుతుంది. ●



# అతి తెలివి తేటల స్పెషల్



"మనం చీమని ఆదర్శంగా తీసుకోవాలి. చీమ నుంచి మనం చాలా నేర్చుకో వాలి. చీమచూశారా... పగల్లేదు... రాత్రి లేదు.. ఎప్పుడు చూసినా ఎంతో కష్టపడి పని చేస్తూ తిరుగుతూనే వుంటుంది... అలా ఉంటే ఏమవుతుందో తెల్సా?" .

"ఏముంది.. ఎవడో ఒకడు దాన్ని తొక్కుకుంటూ వెళ్ళిపోతాడు.....".







హోటల్ బిల్లు చెల్లించి దాదాపు బయటికి వచ్చేస్తూ అక్కడున్న పనివాడిని పిలిచి "11వ ఫ్లోర్‌లో బైట రూమ్ దగ్గర సూట్ కేసు మరచిపోయినట్టున్నాను. కొంచెం వెళ్ళి చూస్తావా? తొందరగా రావాలి... ట్రెయిన్‌కి పది నిమిషాలు టైమే వుంది" అంటూ గాభరాగా అడిగాడు కష్టమర్.

ఆరు నిమిషాల తర్వాత ఆ హోటల్ పనివాడు రొప్పుతూ వచ్చి ... "మీ సూట్‌కేసు అక్కడే వుంది సార్.." అని చెప్పేసి వెళ్ళిపోయాడు.



"ఈల వేస్తూ పని చెయ్యవద్దని చెప్పానా లేదా?"

"చెప్పేరు కానీ నేను పనేమీ చెయ్యటం లేదు సార్. ఈల మాత్రమే వేస్తున్నాను."



"సానుభూతికీ... రసానుభూతికీ తేడా ఏమిటో చెప్పవా?"

"ఏదో ప్రాసకోసం అడుగుతున్నావుగానీ, సానుభూతి, రసానుభూతి ఇవన్నీ ఇప్పుడు ఎందుకు చెప్పు?

"అదంతా నాకు తెలీదు. తెలివైన వాణ్ణంటావ్‌గా ఆ మాత్రం చెప్పలేవా?"

"ఆపదలో వున్న స్త్రీని రక్షిస్తే దాన్ని సానుభూతి అంటారు. రక్షించాం కదా అని అదే పనిగా అస్తమానం ఆవిడింటికెళ్ళి చూసి రావటాన్ని రసానుభూతి అంటారు.... అర్థం అయిందా!?"



"టైమెంతా?"

పన్నెండు ...."

"ఏంటి... పన్నెండేనా.... ఇంకా ఎక్కువ అయ్యిందని అనుకుంటున్నానే..."

"అంతకన్నా ఎక్కువ అవదు సార్...."

"ఎందుకేంటి?"

"పన్నెండు తర్వాత వచ్చేది ఒకటే కద సార్...."



"ఆక్సిజన్ లేకుంటే మనిషి జీవితమే లేదు.... ఇలాంటి ముఖ్యమైన వాయువుని 1773లో కనిపెట్టారు..."

"అంతకు ముందు జనాలు ఎలా బతికేవారు టీచర్?"



# అతి తెలివి తేటల స్పెషల్



ఓ వ్యక్తి కోపంగా బార్లో కొచ్చి "ఇక్కడ యాద్గిరి అనే కుర్రాడున్నాడా?" అని గట్టిగా అడిగేడు.
ఎవరూ బదులు చెప్పక పోయే సరికి రెండోసారి కోపంగా మళ్ళీ అడిగేడు. మూడోసారి కూడా అదే టోన్‌లో అడిగేసరికి ఓ చిన్నకుర్రాడు ముందుకొచ్చి "నేనే యాద్గిర్ని" అన్నాడు.
అంతే.... శుభ్రంగా వాణ్ణి చితకబాది బయటకు వెళ్ళిపోయాడు ఆ వ్యక్తి. వాడు వెళ్ళిపోగానే ఆ కుర్రాడు నెమ్మదిగా పైకి లేచి...."
"చూశారా... వాడిని ఎలా ఫూల్‌ని చేశానో ... వెర్రి బడుద్దాయి పాపం... నేనే యాద్గిరనుకున్నాడు..." అన్నాడు చూస్తున్న మిగతా వాళ్ళతో.




"మీ చుట్టాలింట్లో పెళ్ళి విందుకు పిలిచారన్నావ్... మరి నువ్వు వెళ్ళలేదే?"
"నేను వెళ్ళడానికి వీల్లేదురా..."
"అదేంటి....!?"
"అదికాదురా... శుభలేఖ మీద విందు ఏడునుంచి పది వరకు అని రాసి వుందిరా.... మరి నాకు పది దాటాయిగా...."



తన కుక్కకి స్వెట్టర్ అల్లుదామని ముచ్చటపడి వూలు కొనటానికి షాపుకి వెళ్ళింది ఒకావిడ.
"కుక్కని తీసుకువస్తే బావుండేదమ్మా.... ఖచ్చితంగా ఎంత వూలు అవసరమో చెప్పేవాడిని" అన్నాడు షాపతను.
"అదికాదులెండి..... అల్లుతున్నట్లు దానికి తెలియకూడదు..... దాన్ని ఒక్కసారిగా ఆశ్చర్యంలో ముంచెత్తుదామని...."



"నేను అతన్ని గాఢంగా ప్రేమిస్తున్నాను. అతను కూడా నన్ను తెగ ప్రేమిస్తున్నాడు..."
"మరింకేం... యిద్దరూ పెళ్ళి చేసుకోవచ్చుగా...."
"చేసుకోవచ్చు కాని మా ఆయనకు ఏం చెప్పాలా అనే ఆలోచిస్తున్నాను..."



"ఎందుకమ్మా అలా భయపడుతున్నావ్"
"చెపితే మీరు కూడా భయపడతారు టీచర్?"
"ఫర్వాలేదు చెప్పు."
"నాక్కనక మంచి మార్కులు రాకపోతే దెబ్బలు ఖాయం అని మా డాడీ అన్నారు టీచర్.
ఆ దెబ్బలు మీకో నాకో ఖచ్చితంగా చెప్పలేదు టీచర్"



"బొత్తిగా బుర్రలేదు మీకు. ఎందుకొచ్చారీ ఇంటర్వ్యూకి?"
"కనీసం వికలాంగుల కోటాలోనైనా ఉద్యోగం ఇప్పించండి సార్ .... ఎలాగూ బుర్రలేదన్నారుగా!?".



"చూడు నాన్నా.... చిన్న తమ్ముడికి నువ్వు పెద్ద ముక్క యివ్వాలి. చివరికి కోడి కూడా తన కన్నా చిన్నవైన పిల్లలకు ఎక్కువగా యిచ్చి తను మాత్రం అడపాదడపా చిన్న చిన్న పురుగుల్నే ఆహారంగా తీసుకుంటుంది..." .
"పురుగులయితే నేనూ అలాగే యిచ్చి వుండే వాడినమ్మా....".

# మనసంతా నువ్వే



తెలుగు సినిమా సంభాషణల్లో ఓ కొత్త ట్రెండ్‌ని తీసుకువచ్చారు త్రివిక్రమ్ శ్రీనివాస్. స్వయంవరం, నువ్వేకావాలి, నిన్నేప్రేమిస్తా చిరునవ్వుతో, నువు నాకు నచ్చావ్ చిత్రాల సక్సెస్‌లో మెయిన్ షేర్ త్రివిక్రమ్‌దే అని చెప్పాలి. త్వరలో త్రివిక్రమ్ దర్శకుడు కాబోతున్నారు. తరుణ్ హీరోగా ఒక చిత్రం మహేష్‌బాబు హీరోగా మరో చిత్రం డైరెక్ట్ చేయబోతున్నారు.

పబ్లిసిటీకి చాలా దూరంగా వుండే త్రివిక్రమ్‌ని 'మనసంతా నువ్వే'లో తన మనసుకి నచ్చిన పాట ఏదో తెలుపమని అడగ్గా ఇలా చెప్పుకొచ్చారు.

'చెప్పవే ప్రేమ చెలిమి చిరునామా. ఏ వైపు చూసినా ఏమి చేసినా ఎక్కడున్నా మనసంతా నువ్వే' అనే టైటిల్‌సాంగ్ నాకు బాగా నచ్చింది. చాలా మెలోడియస్‌గా, స్వీట్‌గా వుంది. పిక్చరైజేషన్ కూడా బాగుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే పాట చూడ చక్కగా, వినసొంపుగా వుంది'' అని అన్నారు క్లుప్తంగా మొత్తం పాటని తన మాటల్లో స్కాన్ చేసి వర్ణిస్తూ.

# నువ్వు లేక నేను లేను



తక్కువ సమయంలోనే ఈ ఆడియో మ్యూజిక్ ఛార్ట్స్‌లో సెకండ్ ప్లేస్ ఆక్రమించింది 'నువ్వు లేక నేను లేను' ఆడియో. ఈ ఆడియో సక్సెస్‌కి పట్నాయక్ క్రేజీతోపాటు, సురేష్ ప్రొడక్షన్స్ బేనర్ వేల్యూ కూడా ఉపయోగపడింది.

ఈ ఆడియోలో మీకు నచ్చిన సాంగ్ ఏదని అడిగితే పట్నాయక్ ఇలా చెప్పుకొచ్చారు. "ఈ ఆడియోలో ఫలానా సాంగ్ నచ్చిందని చెప్పడం కష్టం. అన్నీ నాకు నచ్చాయి. ప్రయోగాత్మకంగా 'ఛీ ఛీ' పాట, మెలోడీపరంగా 'నువ్వంటే నాకిష్టం' సాహిత్యపరంగా, ట్యూన్ పరంగా 'ఎలాఎలా' పాటల్ని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. 'నిండుగోదావరి' పాట అయితే చాలా తక్కువ సమయంలో జనాల్లోకి వెళ్ళింది. టైటిల్ సాంగ్ కూడా చాలా బాగా వచ్చింది. అయితే అది క్యాసెట్‌లో పెట్టలేదు. వేటూరి గారు ఫస్ట్‌టైమ్ నా స్వరాలకు పదాలల్లారు. ఈ ఆడియో విని నిర్మాత సురేష్‌బాబు గారిచ్చిన కాంప్లిమెంట్‌ని మరిచిపోలేను".




# నువ్వు - నేను



ఈటీవీ 'ఆంధ్రావని'తో న్యూస్ రీడర్‌గా తన కెరీర్ మొదలుపెట్టిన దేవిక జెమినీ టీవీ ద్వారా 'శుభోదయం' అంటూ ప్రతి తెలుగు ప్రేక్షకుడి గుండె తలుపుని తట్టారు. 'శుభోదయం' ప్రోగ్రాం కోసం ఏకధాటిగా 200 మంది ప్రముఖుల్ని ఇంటర్వ్యూ చేసిన దేవిక క్రియేటివ్ ప్రోగ్రామ్స్‌ని ఎక్కువ ఇష్టపడతారు. జెమినీటీవీ సమర్పణలో రూపొందిన 'నువ్వు - నేను' చిత్రంలో బెస్ట్‌సాంగ్‌ని ఈసారి జెమినీ యాంకర్‌ని అడిగితే బాగుంటుందని దేవికని ప్రశ్నించడం జరిగింది. 'నువ్వు - నేను'లో తనకు నచ్చిన పాట గురించి ఆమె ఇలా చెప్పుకొచ్చారు. "ప్రియతమా.... ఓ ప్రియతమా' పాట నాకు బాగా ఇష్టం. ఆ పాటలో ఓ ఫీల్ వుంది. కానీ నేను బెస్ట్ సాంగ్ మాత్రం 'గాజువాక పిల్లకే' ఇస్తాను. ఎందుకంటే మా పాప తన్మయికి ఆ పాటంటే ఎంతో ఇష్టం. ఆ పాట వస్తే తెగ హుషారు పడిపోయి గంతులేస్తూ వుంటుంది. ఆ పాటని పాడటానిక్కూడా ప్రయత్నిస్తుంది. అందుకే మా పాపకి నచ్చిన పాటనే బెస్ట్ సాంగ్‌గా చెబుతాను'' అన్నారు నవ్వుతూ.

# స్టూడెంట్ నెం. 1



కీరవాణికి కజిన్ అయిన శ్రీలేఖ చిన్నవయసులోనే సంగీత దర్శకురాలిగా మంచి పేరుని సంపాదించుకున్నారు. మొదట్లో కీరవాణిని ఇమిటేట్ చేస్తుందనే ముద్రపడినా, తర్వాత ఆ ముద్రని తొలగించుకుని తనకంటూ ఓ ప్రత్యేకమైన ఇమేజ్‌ని సృష్టించుకున్నారు. ప్రస్తుతం ఆమె సుమారు ఓ పది చిత్రాలకు సంగీతం సమకూరుస్తూ బిజీగా వున్నారు. 'స్టూడెంట్ నెం.1'లో నచ్చిన పాటనే ఏదని అడిగితే అన్న సంగీతానికి చెల్లెలు ఇచ్చిన కితాబు ఇది.

"కాస్త నన్ను నువ్వు నిన్ను నేను తాకుతుంటే తాకుతున్న చోట సోకు నిప్పు రేగుతుంటే'' పాట నాకు బాగా నచ్చింది. అసలు పాట ఎత్తుగడే చాలా డిఫరెంట్‌గా వుంది. దానికి తగ్గట్టుగానే మంచి లిరిక్ పడింది. చాలా వెరైటీగా వున్నా ఈ పాటలో మంచి కిక్ వుంది''.

## నువ్వు నాకు నచ్చావ్



ప్రముఖ హాస్యనటులు కీ.శే. రాజబాబు చిన్నతమ్ముడైన అనంత్ అన్న కామెడీ రూట్‌లోనే వెళ్తున్నారు. ఇటు బుల్లితెరపైన, అటు వెండితెరపైనా రాణిస్తున్న అనంత్‌కి 'నువ్వు నాకు నచ్చావ్'లో పాత్ర మంచి పేరునే తీసుకువచ్చింది. ఈ సినిమాలో తనకు నచ్చిన పాట గురించి ఆయన ఇలా చెబుతున్నారు. "ఓ ప్రియతమా ఇది నిజమా ఈ పరిచయం ఒక వరమా' పాటకే నేను ఓటు వేస్తాను. ఈ పాటలో లవ్‌ని చాలా బాగా ఎక్స్‌ప్రెస్ చేసారు. పిక్చరైజేషన్ కూడా ఎక్సలెంట్‌గా వుంది. ఇప్పుడు యూత్‌కి కావాల్సిందంతా ఇందులో వుంది. అమ్మాయి పక్కన నడుచుకుంటూ వెళ్తూ ఈ పాట పాడితే ఖచ్చితంగా ఆ అమ్మాయికి ఆ అబ్బాయి తనను ప్రేమిస్తున్నాడని అర్థమవుతుంది. కుర్రాళ్ళు మాత్రం ఈ పాట పాడుకునే ముందు జాగ్రత్త పడాలి. ఎందుకంటే పక్కన ఐశ్వర్యారాయ్ వుందా, కల్పనా రాయ్ వుందో చూసుకోవాలిగా మరి" అని చెప్పి నవ్వేసారు అనంత్.

## ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం



ప్రత్యూష పదహారణాల తెలుగమ్మాయి. రాయుడు, సముద్రం, స్నేహమంటే ఇదేరా సినిమాల్లో నటించిన ఈ అమ్మాయి ప్రస్తుతం తమిళంలో బిజీ హీరోయిన్. 'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం' సినిమాకి, ఈ అమ్మాయికి సంబంధం ఏమిటనే సందేహం కలగొచ్చు. అసలు మొదట శ్రావణి పాత్రకిఈ ప్రత్యూషనే అనుకున్నారు. తమిళ సినిమాల్లో బిజీ కావడం వల్ల ఆమెకీ ఛాన్స్ మిస్సయ్యింది. ప్రస్తుతం శ్రీ చక్ర ఆర్ట్ ప్రొడక్షన్స్, ఆర్‌పిజి ప్రొడక్షన్స్ చిత్రాల్లో నటిస్తున్న ప్రత్యూషను ఈ సినిమాలో నచ్చిన పాట ఏదని అడిగితే ఇలా చెప్పింది. " ఓ మంచి సినిమా మిస్సయ్యాననే బాధ ఈ సినిమా గురించి తలుచుకున్నప్పుడల్లా కలుగుతుంది. నా ఛాన్స్ కాస్తా తనూరాయ్ కొట్టేసింది. తెరమీద ఆ పాత్ర చూస్తూ నేనైతే ఎలా వుండేదో అని ఊహించు కున్నాను. ఈ సినిమాలో పాటలన్నీ నాకు బాగా నచ్చాయి. ఒక్క పాట అని బేరీజు వేయడం కష్టం" అని తెలిపింది ప్రత్యూష

## ఆనందం



'ఆనందం' సినిమాతో ఆకాష్ తెలుగు ప్రేక్షకులకు బాగా దగ్గరయ్యాడు. ఈ సినిమా విజయంతో అతను తెలుగులో బిజీ హీరో అయ్యాడు. ఈ సినిమాలో మీకు బాగా నచ్చిన పాట అడిగితే 'కనులు తెరచినా కనులు మూసినా కలలు ఆగవేలా' అని టక్కున చెప్పాడు . ఈ పాట తనను బాగా ఆకట్టుకోవడానికి గల కారణాలను వివరిస్తూ - "పాటలో మంచి ఊపు వుంది. సంగీతం, సాహిత్యం రెండూ బాగా జత కలిశాయి. ఈ పాటని తెరమీద చూస్తున్నప్పుడు ఎంత ఆనందపడ్డానో, పిక్చరైజ్ చేస్తున్నప్పుడు కూడా అంత ఆనందం అనుభవించాను. రోజుకో పదిసార్లయినా ఈ పాటని పాడుకుంటుంటాను" అని చెప్పాడు.... "ఎవరైనా ఎప్పుడైనా సరిగా గమనించారా" పాట కూడా తనకు బాగా ఇష్టమని ఈ సందర్భంగా చెప్పాడు ఆకాష్.

## సుబ్బు



మిమిక్రీ ఆర్టిస్టుగా అనేక ప్రదర్శనలిచ్చి మంచి గుర్తింపుని సంపాదించుకున్న జూ. వేణుమాధవ్ వెండితెరపై అతి తక్కువ సమయంలోనే రాణించారు. 'సుబ్బు' సినిమాలో కామెడీ ట్రాక్‌లో తను కొద్దిసేపే కనిపించినా గానీ బాగానే ఐడెండెటీ వచ్చింది.

ఈ సినిమాలో నచ్చిన పాట ఏదని అడిగితే - "మస్తు మస్తు సంగతుంది పోరి, పస్తులుంచమాకే నన్ను డైలీ ప్యారీ, లుక్సుతోటి చంపమాకు ఐయామ్ సారీ, మూడుముళ్ళు వేసినాకే మిగతా స్టోరీ' పాట భలే వుంది. ట్యూన్‌లో వున్న హుషారు లిరిక్‌లో ఏ మాత్రం తగ్గలేదు. క్యాచీ పదాలతో చాలా గమ్మత్తుగా రాసారీ పాటను. పాట వింటుంటే మనక్కూడా డాన్స్ చేయాలనిపిస్తుంది. ఎన్‌టిఆర్ స్టెప్స్ అదరగొట్టాడు. సాంగ్ టేకింగ్ కూడా బాగుంది" అని అన్నాడు వేణుమాధవ్.

## జాబిలి



ఎస్వీ కృష్ణారెడ్డి దర్శకత్వంలో చక్రవర్తి 'ప్రేమకు స్వాగతం' అనే సినిమా చేస్తున్నారు. సంగీతం పట్ల మంచి ఆసక్తి, అవగాహన కలిగిన జెడికి 'జాబిలి' సినిమాలో ఇష్టమైన పాట ఏమిటో తెలుసుకుందాం.

"చిగురాకు ఎవరో చినుకైనదెవరో చిగురంత పేరే ప్రేమ, పెదవైనదెవరో మురళైనదెవరో పలికించు స్వరమే ప్రేమ' పాట నా మనసుని బాగా హత్తుకుంది. మంచి మెలోడి వుంది. ట్యూన్ కూడా చాలా బాగుంది. ప్లెజెంట్‌నెస్‌తో పాట సాగుతుంది. ఎఆర్‌రహమాన్ బిజీయమ్‌లా అనిపించింది. ఈ పాటలో వయొలిన్ వాద్యాన్ని బాగా ఉపయోగించుకున్నారు" అని చెప్పారు జెడి.

## భద్రాచలం



'ఒకటే జననం ఒకటే మరణం' పాటను ఈ మధ్యకాలంలో తనను బాగా ఇన్‌స్పైర్ చేసిన పాటగా అభివర్ణిస్తున్నారు యువ గేయరచయిత కులశేఖర్. "ఈ పాటకి తక్కువేమి మనకు రాముండొక్కడుండువరకు' అనే కీర్తన మాతృకలా అనిపిస్తుంది. ఇన్‌స్పిరేషన్ సంగతి ఎలా వున్నా, సుద్దాల అశోక్ తేజ మాత్రం చాలా స్ఫూర్తిదాయకంగా రాసాడు. 'రాబోయే విజయాన్ని - పిడికిలితో చూడాలి' అనే చరణం నన్ను కదిలించింది. వెంటనే అశోక్ తేజకి ఫోన్ చేసి కంగ్రాట్స్ చెప్పాను. 'మీరు చాలా మంచి పాట రాసారు. మీరు పడ్డ శ్రమకి ఫలితం దక్కింది. సినిమా కూడా సక్సెసయ్యింది' అని ఫోన్‌లో చెప్పాను. ఈ పాట నిజంగా నన్నెంత కదిలించిందంటే ఇప్పుడు నేను ఏ పాట రాస్తున్నా ఆ పాటే జ్ఞప్తికొస్తోంది. టీవీ యాడ్స్‌లో ఆ పాట వింటుంటే మనసు అటే వెళ్ళిపోతుంది" అని వివరణాత్మకంగా, ఉద్వేగంగా చెప్పుకొచ్చారు కులశేఖర్.

# హాల్లో నవ్వినంత మాత్రాన మంచి కామెడీ అని చెప్పలేం..

**జనవరి 13 - హాస్యదినోత్సవ సందర్భంగా**




రమణ అన్ని రకాల కథలూ రాసినా హాస్యరచయితగానే బాగా పేరు వచ్చింది. కథా రచయితగా ఉన్నప్పుడూ అంతే, సినీ రచయితగా అయిన తర్వాతా అంతే! రమణ సినిమాలలో ప్రవేశించేముందు చిన్న కథలే రాసారు. సినిమాకు కావలసినంత కథ రాయగలగాలంటే రచయితలు నవలలో, నాటకాలో రాయాలని అనుకునే రోజుల్లో అవేవీ రాయకుండానే రమణ సినిమాలలోకి అడుగుపెట్టి, జయకేతనం ఎగురవేసారు. తొలిసారిగా మాటలు రాసిన 'రక్తసంబంధం'లో హాస్యసన్నివేశాలున్నా ప్రధానంగా అది సీరియస్ సెంటిమెంటల్ చిత్రం. రెండవ చిత్రమైన 'దాగుడుమూతలు' ముందంతా సరదాగా సాగినా పోను, పోను సీరియస్ అవుతుంది. అయినా రమణ అనగానే హాస్యసన్నివేశాలు, హాస్యసంభాషణలే గుర్తుకువస్తాయి.

రాయగలను కదాని రమణ తన సినిమాలను సంభాషణలతో నింపి వేయలేదు. ఆ దృశ్యప్రధాన మాధ్యమాన్ని బాగా అర్థం చేసుకున్నారు కాబట్టే అతి తక్కువ మాటలు ఉపయోగించారు. అద్భుతమైన హాస్యాన్ని పండించారు. సినీరచయిత కావడానికి ముందు జర్నలిస్టుగా, సినీ సమీక్షకుడిగా పనిచేశారు కాబట్టి అనేక దేశాల, అనేక భాషల సినిమాలు విమర్శనాత్మక దృష్టితో చూసి గడించిన అనుభవాన్ని రమణ తన సినిమాలకు పూర్తిగా ఉపయోగించుకున్నారు. అలా రాసిన అనేక సినిమాలలో తనకు నచ్చిన సినిమాదృశ్యాల గురించి రాసిమ్మని 'విజయచిత్ర' వారు 1987లో అడిగినప్పుడు ఆయన రాసిన వ్యాసం :

హాస్యం సంభాషణలు అట్టేలేకుండా చెయ్యాలి. విజువల్‌కామెడీ బాగుంటుంది. అటువంటి కామెడీ చెయ్యడం చాలా కష్టం.

చార్లీ చాప్లిన్, బస్టర్ కీటన్, జెర్రీలూయిస్ వంటి వారిది ఎక్కువగా విజువల్ కామెడీ, మనదంతా ఎక్కువగా డైలాగ్స్ మీద ఆధారపడిన కామెడీ. ఆ విధంగా నేను రాసిన వాటిల్లో రావుగోపాలరావు గారి మీద వచ్చిందంతా 'భక్తకన్నప్ప'లో కానివ్వండి, 'ముత్యాల ముగ్గు' లో కానివ్వండి - అంతా డైలాగ్ ఓరియంటెడ్ కామెడీ. ఇందుకు భిన్నంగా 'బంగారు పిచుక'లోనిది సిట్యుయేషనల్ కామెడీ. అయితే మన ప్రేక్షకులు ఎటువంటి కామెడీని రిసీవ్ చేసుకుంటారు అన్నది చెప్పడం కష్టమే. 'అందాల రాముడు'కి హాల్‌కి వెళ్ళి చూస్తే 'ఇది సిల్వర్ జూబిలీ' పిక్చర్ అనుకునేంతగా నవ్వారు. కాని అది ఏవరేజ్ అయిందప్పుడు. అదే 'ముత్యాల ముగ్గు' సినిమాకి ఎవరూ పైకి నవ్వలేదు. కానీ అది అత్యధిక ప్రజాదరణ పొందిన హాస్యం అయింది. హాల్లో నవ్వినంత మాత్రాన మంచి కామెడీ అని చెప్పలేం. బిగ్గరగా నవ్వకపోయినంత మాత్రాన అది జోక్ కాదనీ చెప్పలేం. కాకపోతే లోలోపల నవ్వుకుని, బయటకు వచ్చిన తర్వాత చెప్పుకుని ఎంజాయ్ చేస్తారు. 'ముత్యాల ముగ్గు' డైలాగ్స్ ఆంధ్రప్రదేశ్‌లో మొదటిసారిగా రికార్డులు పదివేలు అమ్మాయి.



ఒక హాస్య సంఘటన బాగా రూపొందించాం అని ఎప్పుడు అనిపిస్తుందంటే దాన్ని శ్రోత విని, మనసులో పెట్టుకుని దాన్ని 'రిపీట్' చేస్తే అది ఆ హాస్యాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్ళినట్లు.

ముత్యాల ముగ్గులో "కాలు తీస్తేయింత, బుర్ర పగల గొడితే యింత, కాలేజీ సీటుకింత, మర్డర్‌కింత, నాలుగింటి కాంబినేషన్ అయితే యింత" అని రాశాను. ఆ సినిమా విడుదలైన రెండోవారమో, మూడోవారమో రాజమండ్రి వెళ్ళాను.



**'ముత్యాలముగ్గు'లో రావుగోపాలరావు**

ఓ బండి అతను -'బ్రెడ్డు-జామూ- కలిపి అయితే యింత, జామ్ లేకుండా బ్రెడ్ అయితే యింత, చికెన్ అయితే యింత, చికెన్‌లో బోన్ లేకపోతే యింత' అని బండిలో లౌడ్ స్పీకర్ పెట్టి ఈ జోక్‌ని రీ ప్రొడ్యూస్ చేశాడు అతని అవసరానికి తగ్గట్టుగా. జనం నవ్వుకుంటున్నారు అది విని. అలా చాలా జోక్స్ ఉన్నాయి. ఇప్పుడు 'అమ్యామ్యా' అనే పదం వుందనుకోండి... 'బుద్ధిమంతుడు'లో. నిజానికి అది నాది కాదు. అల్లురామలింగయ్యగారిది. నా ఎక్కవుంట్‌లో పడిపోయింది. నాకు పేరొచ్చేసింది. ఆయన యిప్పటికీ అంటూంటారు. -'మీదే కదటండీ' అని. 'మీరొప్పుకున్నారు కదా' అంటుంటాను. ఇవాళ్టికీ 'అమ్యామ్యా' అనేది నిలబడిపోయింది. ఒకమాట మూడక్షరాలైంది. తర్వాత అదే విధంగా ఇంకో పదం కాయిన్ చేశా. 'పేపర్‌వెయిట్' అని, కానీ దానికింత గుర్తింపురాలేదు.

నా మటుకు నాకు హాస్యం అనేది విజువల్‌గా... దృశ్యపరంగా ఉంటేనే బాగుండుననిపిస్తుంది. కామెడీలో డైలాగ్ అనేది వేరే డిపార్ట్‌మెంట్. ఇప్పుడు ఎక్కువ మాట్లాడే విలన్‌తో పొలిటికల్ సెటైర్ చెయ్యాలన్నప్పుడు డైలాగ్స్ తప్పవనుకోండి. అయితే ఇవాళ విజువల్ కామెడీ ఎవరూ ప్రయత్నించడంలేదు. ఈ తరం వాళ్ళు అసలు అటువంటి ప్రయత్నం చెయ్యడం లేదు. అంతా డైలాగ్ మీదే... పొలిటికల్ సెటైర్... సోషల్ సెటైర్... లేకపోతే అశ్లీల పదాలు వెయ్యడం... అంతే తప్ప, విజువల్‌గా మూవ్‌మెంట్‌లో, ఒక చూపులో కామెడీని కాలిక్యులేట్ చెయ్యడం పోయింది. నేను డైలాగ్ రైటర్ అయినప్పటికీ మొదట మనసులో బొమ్మ గీసుకుని దాని కెంత కావాలో అంతే డైలాగులు రాస్తాను. సీన్ డైలాగ్ ఓరియంటెడ్ అయితే తప్ప విజువల్‌కే ప్రాధాన్యత యిస్తాను. 'బొమ్మ మొదట, శబ్దం తర్వాత' అని నా ఉద్దేశం.



'మనవూరి పాండవులు'లోని ఓ సన్నివేశం విజువల్‌కి ప్రాధాన్యతగలది. ఇది జనాన్ని బాగా ఆకట్టుకుంది. అల్లురామలింగయ్య బాగా తాగేసి, భోజనానికి కూర్చుంటాడు. వెనక నుంచి ఓ చెయ్యి నెయ్యి వడ్డిస్తుంది. ఇంతలో మూడు చేతులు వస్తాయి. ఈ సన్నివేశం హిందీ (హమ్‌పాంచ్) లో కూడా బాగా ప్రజాదరణ పొందింది. నవ్వు తెప్పించింది. ఇలాంటివి ఎక్కువగా చూడాలని వుంది. అయితే వీటికి టైము వుండాలి. ఇవాళ అర కాల్ షీటు, పావు కాల్ షీట్లతో పనిచేస్తుంటే యిలాంటివి రావు. మొత్తం సన్నివేశం విజువలైజ్ చేసుకుని ఆ పాత్రకు కావలసినంత డైలాగ్ (మినిమమ్) మాత్రమే రాసి, పాత్రల కదలికల్లో కామెడీ పలికిస్తే చిరస్థాయిగా వుండే స్థాయిలో చార్లీ చాప్లిన్ వంటి కామెడీ మనకీ వస్తుంది. అలాంటి హాస్య సన్నివేశాలే నాకు యిష్టం.

# 'దేశికోత్తమ' అవార్డుపొందిన అమ్జద్ అలీఖాన్



డిసెంబరు 15న ప్రధాన మంత్రి చేతులమీదుగా అమ్జద్ అలీఖాన్‌కి ఘనసత్కారం జరిగింది. విశ్వభారతి యూనివర్శిటీ వారు వివిధ రంగాలలోని నిష్ణాతులకు ఇచ్చే 'దేశికోత్తమ' అవార్డుకు ఈ సంవత్సరం అమ్జద్ అలీఖాన్‌లను, గణాంక శాస్త్రవేత్త సి.రాధాకృష్ణా రావులను ఎంపిక చేయడం జరిగింది.

1945లో గ్వాలియర్‌లో జన్మించిన అమ్జద్ అలీఖాన్ సరోద్ వాద్య నిపుణుడిగా గణుతి కెక్కారు. మొగలాయి రాజ దర్బారులో వాద్య సంగీతాన్ని అందించిన కుటుంబం వారిది. వారు అనుసరించే 'సేనియా-బీన్‌కర్' ఘరానా తాన్‌సేన్ వారసత్వం అంటారు. తన తండ్రి ఉస్తాద్ హాఫీజ్‌ఖాన్ వద్ద సరోద్ అభ్యసించిన అమ్జద్ అలీఖాన్ 1958లో తన 12వ ఏట మొట్టమొదటి సోలో ప్రదర్శననిచ్చారు. ఆలిండియా రేడియో, టీవీల ద్వారా ఎన్నో కార్యక్రమాలు నిర్వహించి హిందుస్తానీ శాస్త్రీయ సంగీత వ్యాప్తికి తోడ్పడ్డారు. 1975లో అంటే 30 ఏళ్ళకే ఆయనను 'పద్మశ్రీ' వరించింది. 1977లో తన తండ్రిపేర ఉస్తాద్ హాఫీజ్ అలీఖాన్ స్మారక సమితిని ఏర్పరచి 1985 నుండి ప్రతీ ఏటా కచ్చేరీలు నిర్వహించి ఉత్తమ సంగీతకారులను సత్కరించే సంప్రదాయం నెలకొల్పారు అమ్జద్ అలీ ఖాన్.

గతపక్షం డిసెంబర్ 22న ఉస్తాద్ సుల్తాన్‌ఖాన్ (సారంగి) ఎల్.కే.పండిట్ (గాత్రం) హేమేంద్ర చంద్రసేన్ (సరోద్) లకు ఈ ఏటి ఆవార్డులు లభించాయి.

1981లో పాకిస్తాన్ పర్యటించి ఇరుదేశాల మధ్య సాంస్కృతిక వారధిని తిరిగి ఏర్పరచడానికి కృషిచేసారు. సరోద్ వాద్యానికి ప్రాచుర్యం కల్పించి శాస్త్రీయ సంగీతానికి సేవ చేసిన అమ్జద్ ఆలీఖాన్‌కు 1989లో సంగీత నాటక ఎకాడెమీ అవార్డు, తాన్‌సేన్ అవార్డు, 1991లో పద్మభూషణ్ లభించాయి.

సంగీతానికి ఎల్లలు లేవని చాటి చెబుతూ చైనా, ఇంగ్లండు, అమెరికా, మాస్కో, జర్మనీ, జపాన్‌లలో పర్యటించిన ఖాన్‌కు ఇంటర్నేషనల్ మ్యూజిక్ ఫోరమ్ అవార్డు లభించింది.

హిందూస్తానీ శాస్త్రీయ సంగీతం వారి వంశంలో ఆరుతరాలుగా వర్ధిల్లుతూ వచ్చింది. అది అమ్జద్ అలీఖాన్‌తో ఆగటం లేదు తన కుమారులైన అమాన్, అయాన్‌లను శిష్యులుగా చేసుకుని తరతరాల వారసత్వాన్ని, ప్రతిభను వారికి అందించారు. వారిద్దరివీ విడివిడిగా 20 దాకా ఆల్బమ్స్ వచ్చాయి. గత నెలలోనే 'లాండ్ మార్క్ జుగల్ బందీ' పేర (వర్జిన్ కంపెనీ విడుదల) ఇద్దరూ కలిసి ఒక ఆల్బమ్ రిలీజ్ చేశారు. సరోద్-సితార్‌తోను సరోద్-సారంగీతోనూ జుగల్ బందీ ఉన్నా సరోద్-సరోద్ జుగల్ బందీ ఆల్బమ్స్‌లో ఇదే ప్రథమం.

వారిద్దరూ ఖాన్ వద్ద చిన్న వయస్సునుండే నేర్చుకున్నారు. తండ్రి స్థాయి ముందులో తెలియకపోయినా ఆయన వాళ్ల స్కూలుకు వెళ్లినపుడు అందరూ ఆటో గ్రాఫ్‌లకోసం ఆయన వెంటబడడం చూసి ఆయన గొప్పతనం వాళ్లకు తెలిసివచ్చింది. సరోద్ వాద్యంపై గౌరవం పెరిగింది.

వాళ్లకు విద్యనేర్పడమే తప్ప, తన వెంట కచ్చేరీలకు తీసుకువెళ్ళి వాయించమనే అలవాటు లేదాయనకు. వాళ్లు సోలో ప్రదర్శనలు ఇచ్చినపుడు వేరే రకం శ్రోతలుంటారనే అవగాహన వాళ్లకు కలగాలని ఆయన ఉద్దేశ్యం.

తండ్రిగానే కాక ఒక కళాకారుడిగా కూడా ఆలోచించి కుమారులు ఇదరూ కలిసి ప్రదర్శనలిస్తే శ్రోతలు ఒకరితో ఒకరిని పోల్చి చూస్తారనీ, అందువల్ల ఎవరో ఒకరు బాధపడతారని ఆయన ఆవేదన. అందువల్ల జుగల్ బందీలు ఇవ్వద్దనే వారు. చివరికి ఇప్పుడు జుగల్‌బందీ ఇవ్వడం జరిగి పోయింది. ఇక కంపేరిజన్ తప్పదేమో!

ఈ ఆల్బమ్‌లో వారు రెండు రాగాలు వాయిం చారు. రాగేశ్వరీ, పూర్వీ కళ్యాణ్!' రాగేశ్వరిని సరోద్ మీద తొలిసారి పలికించినది అమ్జదే!

అమాన్, అయాన్‌లు 'టీవీ'లో సరిగమా ప్రోగ్రాంలలో నిర్వాహకులుగా టీవీ ప్రేక్షకులకు పరిచితులు. కానీ వారి కంటె ముందు కార్యక్రమం నిర్వహించిన సోనూనిగమ్ కున్న షో బిజినెస్ ఇమేజ్ వాళ్లకు లేకపోవడం ఇబ్బంది అయి పేరు తెచ్చుకోలేకపోయారు. పైగా దానివల్ల సరోద్ వాయిద్య కులుగా వారి కున్న పేరు దెబ్బతినడం మొదలుపెట్టింది. ఇక ఆ కార్యక్రమానికి స్వస్తి చెప్పి సరోద్ వాయిద్యానికే అంకితం అయారు, గురువు, తండ్రి అయిన అమ్జద్ కలలు నెరవేర్చబోతున్నారు.

ప్రముఖ కవుల పై సయీద్ నక్వీ తీసిన 'గుఫ్తగూ' సీరీస్‌కు అమ్జద్ సంగీతం అందించారు. ఇటీవలే ఎచ్.ఎమ్.వి. వారి 'వాదా' ఆల్బమ్ కు సంగీతం సమ కూర్చారు. దానికి లిరిక్స్ రాసినది గుల్జార్. గుల్జార్‌కి ఈయనంటే ఎంత గౌరవమంటే కొన్ని సంవత్సరాల క్రితమే అమ్జద్ పై గుల్జార్ డాక్యుమెంటరీ చిత్రాన్ని నిర్మించారు. అమ్జద్ కుటుంబం సరోద్ డాట్ కామ్ అనే వెబ్‌సైట్ కూడా నడుపుతున్నారు.

ఈ క్రమంలో ఈనాటి 'దేశికోత్తమ' అవార్డుకు ఒక విశిష్టత ఉంది. విశ్వకవి రవీంద్రుడు నెలకొల్పిన శాంతినికేతన్‌లోని విశ్వభారతి విశ్వవిద్యాలయం ద్వారా ఈ అవార్డు రావడం, అదికూడా కళాపిపాసి అయిన వాజ్‌పేయి హస్తాల మీదుగా అందుకోవడం అమ్జద్ అలీఖాన్‌కు సంతృప్తి కలిగించే అంశం.

# మేరియా క్యారీ



మేరియా క్యారీ పాప్ ప్రపంచంలో ఓ ఝుంఝూ మారుతం. అసలు ఆమె పేరే మారుతం. అవును, నేటివ్ అమెరికన్ భాషలో మేరియా అంటే గాలి అని అర్థం. 'పెయింట్ యువర్ వ్యాగన్' (1969) చిత్రంలో 'దే కాల్డ్ ది విండ్ మేరియా' అనే పాట వినివుంటారు. నిజానికి ఆ పాట వినే ఆమె తల్లిదండ్రులు ఆమె కా పేరు పెట్టారు. ఆమె తల్లి ప్యాట్రీషియా ఒపేరా గాయని కావడంతో బాటు, వాయిస్ కోచ్ కూడా. ఐరిష్ జాతికి చెందినది. తండ్రి ఆల్‌ఫ్రెడ్ ఆఫ్రో ఏసియన్ తెగకు చెందినవాడు.

1990లలో పాప్ రంగాన్ని ఓ ఊపు ఊపి సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్న ఈ ప్రసిద్ధ గాయని న్యూయార్కులోని లాంగ్ ఐలండ్‌లో 1970 మార్చి 27న పుట్టింది. మూడేళ్లవయస్సులో ఉండగా తల్లిదండ్రులు విడిపోవడంతో ఆమె జీవితం ఒడిదుడుకుల మయమయింది. మేరియా, అక్క, అన్న కూడా తల్లి దగ్గరే పెరిగారు. పాట పాడడంలో ఆమెకు సహాయపడేవారు. స్కూల్లో చదివేరోజుల్లోనే అన్న గారి బ్యాండ్‌కి పాడేది. స్టూడియో అద్దె తక్కువగా ఉంటుందని తెల్లవారుఝాము టైము తీసుకునేవారు. దాంతో స్కూలుకి వెళ్లడం కష్టమయిపోయేది.

చివరికి ఎలాగోలా స్కూలు చదువు అయిందనిపించి మేరియా న్యూయార్కుకి నివాసం మార్చింది. ఒక ఫ్రెండుతో కలిసి ఒక చిన్న అపార్టుమెంటులో జీవితం గడిపింది. తిండి గడవడానికి హేట్ చెకింగ్ గర్ల్‌గా పనిచేసింది. సెలూన్‌లో కిందపడ్డ వెంట్రుకలు ఊడ్చేపని కూడా చేసింది. ఆ రోజుల్లోనే పాప్‌సింగర్ గా ఉన్న బ్రెండా కె. స్టార్ కి బ్యాక్ అప్ (ట్రాక్ సింగర్) పాడే అవకాశం వచ్చింది. అదే విజయం వైపు ఆమె తొలి అడుగు. 1989 ప్రాంతంలో ఆమె జీవితం ఒక మలుపు తిరిగింది.

రికార్డు కంపెనీ ఎగ్జిక్యూటివ్స్‌ను కలిసి తన డెమో చూపించబోతూండగానే సిబిఎస్ రికార్డ్సు కంపెనీకి సంబంధించిన టామీ మోటోలా కంటబడింది. అతనామె పాటలు విని పరవశించాడు. తన లేబుల్‌లో పాడడానికి ఆమెతో అగ్రి మెంటు రాసుకున్నాడు. ఇక అప్పటి నుండి ఆమెకు ఎదురే లేదు. ఆమెను చక్కని గాయనిగా గుర్తించే చాలా మందికి ఆమె పాటలు రాస్తుందనీ, ఆల్బమ్స్ ప్రొడ్యూస్ చేస్తుందనీ తెలియదు.

పదేళ్లుగా ఆమె పాడిన హిట్స్ అన్నీ చేర్చి ఈ మధ్యే రిలీజ్ చేసిన గ్రేటెస్టు హిట్స్ అనే ఆల్బమ్ రిలీజ్ సందర్భంగా ఆమె ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆమె ఇలా అన్నది-

"వేనిషింగ్..." "విజన్ ఆఫ్ లవ్..." వంటి పాటలు నేను రికార్డు కంపెనీలో కాంట్రాక్టు కుదుర్చుకొనడానికి ముందు రాసినవి. వాటికెంతో పేరొచ్చింది. ఇటీవలి నా 'గ్లిట్టర్' ఆల్బమ్‌లో 'రిఫ్లెక్షన్స్' అనే పాట కూడా ఆ స్థాయిలో ఉంది. పదేళ్ల నా కెరియర్‌ని ప్రతిఫలించే ఈ ఆల్బమ్ వింటే నేను ఆర్టిస్టుగా ఎదుగుతూనే ఉన్నానని అనిపిస్తోంది. ఈ ఆల్బమ్‌లో 'ఫ్యాంటసీ....' నాకు అన్నిటికంటె నచ్చిన పాట."

# 2001 సంవత్సరం విశేషాలు...



★ 'మౌలిన్ రూజ్' కారణంగా వెండితెరపై మ్యూజికల్స్‌కు మంచి రోజులు వచ్చాయనిపించింది. ఈ సినిమా ఈసారి ఎకాడమీ అవార్డులు కొల్లగొడుతుందనుకుంటున్నారు.

★ 1984లో 'బాండ్ ఎయిడ్' తర్వాత పాప్ సింగర్స్ అంతా కలిసి కట్టుగా సహాయ కార్యక్రమాలు చేపట్టినది 2001 లోనే. అమెరికాపై టెర్రరిస్టుల దాడిని నిరసించడానికి అందరూ గొంతు కలిపారు.

★ మిక్ జాగ్గర్, పాల్ మెక్ కార్ట్నీ సోలో ఆల్బమ్స్ విడుదల చేశారు. రెండూ ఫెయిలయ్యాయి.

★ మడోనా భారీ ఎత్తున లైవ్‌షో ఏర్పాటు చేసి హెడ్‌లైన్స్ కెక్కితే విక్టోరియా బెక్‌హామ్ భర్త కారణంగా పేరు తెచ్చుకుంది.

★ రోలింగ్ స్టోన్స్ ప్రపంచయాత్ర తలపెట్టారు కానీ ముందుకు సాగలేదు.



★ బ్యాక్ స్ట్రీట్ బాయ్స్, బ్రిట్నీ స్పియర్స్ ఆధిక్యంలో ఉన్నారు.

★ బాబ్ డైలాన్ ఇంకో క్లాసిక్ ఆల్బమ్ ఇచ్చారు.

## మరణాలు

★ గాయని, నటీమణి ఆలియా (22 సం॥లు)

★ బీటిల్ జార్జ్ హారిసన్

★ బెట్టీ ఎవరెట్, పెర్రీ కోమో, బెట్ ఎట్‌కిన్స్, జో రామోన్ (గాయకులు) ఇసాక్ స్టెర్న్ (వయోలనిస్టు), చార్లెస్ ట్రెనెట్ (గాయకుడు, గీత రచయిత)

★ డెనిస్ ది మెనేస్ సృష్టికర్త హేంక్ కౌబాయ్

★ 'సమ్ లైక్ ఇట్ హాట్' 'ఇర్మలాడ్యూస్' వంటి హాస్య చిత్రాల హీరో జాక్ లెమ్మన్

★ సైఫీ హ్యూమరిస్టు డగ్లస్ ఏడమ్స్

★ తొలి హిందీ రాప్ గాయకుడిగా పేరుబడ్డ అశోక్ కుమార్

# ఆధ్యాత్మిక అద్భుతాన్ని సాధించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవి

కాళహస్తి!!

పేరెత్తగానే మనకి జ్ఞాపకం వొచ్చేవి!... సాలెపురుగూ... పాము.... ఏనుగు ... వాటి కైవల్యం....

కంటిగుడ్డుని పనసతొనలా వొల్చి పరమేశుడికి సమర్పించిన కన్నప్పా....

"రాజుల్ మత్తులు వారి సేవ నరక ప్రాయంబు....
వారిచ్చు అంభోజాక్షీ
చతురంత యానతురగీ
భూషాదుల్...
ఆత్మవ్యథా బీజముల్....."

అని కాళహస్తీశ్వర శతకంలో.... వైరాగ్యంతో కన్నీరుమున్నీరైన మహాకవి ధూర్జటీ...

సూదిపడ్డా కనిపించేంత తేట నీటి ప్రవాహం సువర్ణ ముఖీనదీ!.... అన్నిటినీమించీ .... నిత్యం కర్పూరం కలిపిన నీటితో అభిషేకం చేసు కుంటూ ..... లోకాన్ని చల్లగ చూసే కాళహస్తీశ్వరుడు....

చాలామందికి తెలీని మరో రెండు విశేషాలున్నాయ్!

ఒకటి.... ఆధ్యాత్మరామాయణ కీర్తనలు...

రెండు... వాటిని రచించిన "మునిపల్లె సుబ్రహ్మణ్య కవీ...."

విషయానికొస్తే....



ప్రస్తుతం చూస్తున్న ఎంతోమంది చిత్రాలతో పాటు మన సంగీత త్రయం యొక్క చిత్రాలు కూడ ఊహా చిత్రాలే. అలాగే ఇక్కడ ఉన్న ఈ మునిపల్లె సుబ్రహ్మణ్య కవి (1730-1780) చిత్రం కూడా ఊహా చిత్రమే! అడగగానే ఈ ఊహా చిత్రాన్ని 'హాసం' కోసం ప్రత్యేకంగా వేసి ఇచ్చిన బాపుగారికి కృతజ్ఞతలు

- ఎడిటర్

పదిహేడవ శతాబ్దంలో ఆంధ్ర ప్రాంతంలో రాజకీయ సాంఘిక పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉండటం వల్లా....

సంగీతానికి బొత్తిగా ఆదరణ కరువవడం వల్లా....

సుబ్రహ్మణ్య కవి పూర్వీకులు కడుపు చేత పట్టుకునీ... సంగీతాన్ని నెత్తి నెట్టుకుని... తంజావూరికి వలస పోయారు.

అక్కడ చాలాకాలం ఆనం దంగా గడిపిన ... సుబ్రహ్మణ్య కవి తండ్రి రామలింగన్న....

పుట్టిన గడ్డపై మమకారం పోక.... మళ్ళీ ఆంధ్ర ప్రాంతానికొచ్చి మునిపల్లెలో స్థిరపడ్డారు.

రామలింగన్నగారికి... ముగ్గురు కొడుకులు.

వరదన్న... వెంకన్న... సుబ్రహ్మణ్యం....

సరే తండ్రి సంగీత విద్వాంసుడవడం వల్ల.... వారికీ సంగీతం వొంట పట్టింది!!

సుబ్రహ్మణ్య కవి యవ్వనంలో ఉండగానే ..... ఉన్నట్టుండి వొంటిమీద ఏవో పొడలు ప్రారంభమయ్యాయ్... తర్వాత శరీరం మీద మచ్చలు రావడం.. వాటికి స్పర్శజ్ఞానం లేకపోవ డం....

జడిసిపోయిన సుబ్రహ్మణ్యం....
ఆయుర్వేద వైద్యుణ్ణి సంప్రదిస్తే....
పిడుగులాటి వార్త చెప్పాడు....
కుష్ఠు వ్యాధి సోకిందని....
గుండె ఆగినంత పనైంది....

ఆ రోజుల్లో కుష్ఠువ్యాధంటే ఏవుందీ!... చాలామంది ఆ పేరు ఎత్తడానికే భయపడే వారు. సమాజం వెలేసేది....! ఆఖరికి కుటుంబ సభ్యులు సైతం... నిర్లక్ష్యం చేసేవారు....

దానికి ఒకటే మందు...
ఆత్మహత్య.....!!!

ఏ నాడు నేను చేసుకున్న పాపమో.... అని పరితపించిన సుబ్రహ్మణ్యం

ఎవరికీ చెప్పాపెట్టకుండా....వెంకటేశ్వర స్వామిపై భారం వేసి...!

తిరపతి కెళ్ళిపోయాడు !!

తనకొచ్చిన వ్యాధిని నయం చేయమని కన్నీటితో వేడుకుంటూ...

తనకున్న సంగీత పరిజ్ఞానంతో వెంకటేశ్వర స్వామిలీలలు కీర్తనలుగా రాస్తూ...

కాస్త ఊరట పొందుతున్నప్పుడు....

అదే సమయంలో కాళహస్తి సంస్థానాధీశులైన...

దామెర్ల కుమార వేంకటాద్రి సార్వభౌముల వారు ఏడుకొండల వాణ్ణి సేవించుకునేందుకు తిరుపతి రావడం....

సుబ్రహ్మణ్యకవి గానం వినడం.... ముగ్ధులైపోవడం....

వెంటనే తన ఆస్థాన విద్వాంసుడిగా కాళహస్తి రమ్మని ఆహ్వానించడం జరిగిపోయి....

'అంతా నీ లీల ప్రభూ' అని ఆరోజు రాత్రి కొంత నిశ్చింతగా కన్నుమూసి పడుకున్నాడు .... సుబ్రహ్మణ్య కవి

కలలో... శంఖు చక్రాలు ధరించీ.... తిరునామం దిద్దీ.... మందహాసంతో స్వామి సాక్షాత్కరించీ.... తన మీద కీర్తనలు రాసి అంకితమిస్తే వ్యాధి నయమౌతుందని.... చెప్పి.... అంతర్ధానమయ్యాడు!!

కాళహస్తి సంస్థానానికి వచ్చిన సుబ్రహ్మణ్య కవికి ... రాజా వారు సకల సౌకర్యాలు కలిగించి... ప్రశాంతంగా రచనలు చేసుకోడానికి వీలుగా.... సువర్ణముఖీ నది ఒడ్డున ఒక ఇల్లు కూడా కట్టించి ఇచ్చాడు.

**ఒక బ్రాహ్మీముహూర్తాన**
**కాళహస్తి దేవాలయంలో...**

పరమేశ్వరుడి సాక్షిగా.... వేంకటేశ్వరుడు ఆజ్ఞాపించిన ప్రకారం శ్రీరామచంద్రుని కథని.... కీర్తనలుగా రాయడానికి శ్రీకారం చుట్టాడు.

విష్ణువు కథని... శివుని సమక్షంలో!

ఇదే హరిహరాద్వైతం ... ఇదే పరమార్థం....

ఆధ్యాత్మరామాయణ కీర్తనలు కూడా.... శివుడు... పార్వతికి రామాయణం చెప్తున్నట్టుగా ఉంటాయి.

**ఉదాహరణకి** : చేరీ.... వినవె శౌరి చరితము గౌరీ
సుకుమారి గిరివరకుమారీ....

తెలుగు సాహితీ జగత్తులో... ఇంత అలవోకగా ప్రాసలు వేసి రాసిన కీర్తనలు... అరుదు.



# తనికెళ్ళ భరణి

## మాటలకు తరణిపెట్టి హాస్యాన్నందించే 'అరణి' శ్రీ తనికెళ్ళ భరణిగారికి నమస్తే -

ఈసారి 'హాసం'లో వైణిక ప్రముఖులు శ్రీ దూ. సూ. సో. గార్ని గురించి, స్పష్టమైన వ్యాసం రచించినందుకు చాలా సంతోషం. మీలో మంచి కవి, సద్విమర్శకుడు, హాస్యగానితో చెట్టాపట్టాలేసుకొని సంచరిస్తారు. అందుకే ఏది వ్రాసినా, చేసినా ఫలవంతం. దూర్వాసమహామునికి ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా పట్టలేమని పురాణ విదితం. అలానే శ్రీ దూర్వాసుల వారు పాశ్చాత్య సంగీతాన్ని వినిపించి, దాని లోతులు తరచి అందర్నీ విస్మయ పరిచారు. శారద ప్రేరితమైన 'కర్ణాటకాన్ని' హనుమత్ప్రేరిత' హిందుస్తానీని, చుళికీకరించి 'ద్వివేది' అయ్యారు. సంగీత యజ్ఞం చేసి సోమయాజి అయినట్లు వారి పేరు సార్థకమయింది. ఇంటి పేరూ, స్వంత పేరూ సార్థకం చేసుకున్న సంగీత చిరంజీవి. మధ్యలోని సవిత్రుమూర్తి సూర్యనారాయణుడు సాక్షాత్తూ సామవేద స్వరూపుడే. ఇలా అన్నీ ఆయనలో మూర్తీభవించినట్టు అనిపించి, మీ వ్యాసం చదివిన తర్వాత కల్గిన స్పందనతో వ్రాస్తున్నాను. శ్రీమతి విజయలక్ష్మి గారి పుస్తకం లభ్యమౌతుందా? ఎక్కడ? ఎలా? తెలిపితే సంతోషం.

భగవద్దత్తమైన సంగీతాన్ని శాస్త్రోక్తంగా సాధన చేసి ధన్యులైనారు శ్రీ సోమయాజుల వారు. వీణపై వారు పలికించిన 'మూర్ఛనలకు' సితార్ విద్వాంసులు సితవదనులై, ఖిన్నులై వారి ప్రతిభకు 'మూర్ఛ'లు పోయి స్మితవదనంలో 'సాబాస్' అని మెచ్చుటం శ్రీవారి ప్రతిభకు గీటురాయి, సితారుల హృదయ వైశాల్యానికి మచ్చూనూ. ఇలాంటి వ్యాసాలు వ్రాయటం వల్ల యీ నాటి వారికి వారి పరిచయమూ లభిస్తుంది. వ్రాసే విధానంలో చక్కని గతి, సంగతి వుండడం మనస్సుకు యిట్టే పట్టేస్తుంది. అలా మీరు వ్రాశారు కనుక పండింది. ఇలాంటి ధన్యజీవుల యదార్థకథలను రసరమ్యంగా, మీ వీలువెంట అందిస్తూండండి. పత్రికలకు అవి ఒయాసిస్సులు అయి, మా వంటి వారి ఆశీస్సులకు కారణాలవుతాయి. మీలోని రచయితను నిద్రపోనివ్వకండి. లాక్కుని బయటకు రండి. 'హాసం'లో దరహాసంతోపాటు 'దరువు' కల సంగీత విషయాలు కూడా వస్తున్నందుకు సంతోషం. మాటలతో ఆడించండి. పాడించండి. ఆంధ్రప్రేక్షక, పాఠకలోకాన్ని రసరమ్య పుష్కరిణిలో ఓలలాడించండి.

**-గబ్బిట దుర్గాప్రసాద్,** ఎమ్.ఎ., బి.యస్సీ, బి.యిడీ,
రిటైర్డ్ హెడ్‌మాస్టర్,, ఉయ్యూరు, కృష్ణా జిల్లా.

రామాయణం పూర్తయిపోయింది....

కానీ అది తనకి అంకితమివ్వమని పేచీ పెట్టాడు రాజు.

ససేమిరా అన్నాడు కవిరాజు!!

రాజుకన్నా... కవి బలవంతుడు!

కత్తికన్నా.... కలం గొప్పది.... శాసనం కన్నా... అక్షరాలు గొప్పవి.

అందుకే అంటాడు...గువ్వల చెన్నుడు...

గుడికూలును - నుయిపూడును
వడి నీళ్ళకు చెరువు తెగును
వనములు ఖిలమౌ....
చెడనిది పద్యంబొక్కటే
కుడి యెడమల కీర్తిగన్న గువ్వల చెన్న - అని....

తర్వాత రాజావారు .... పశ్చాత్తాపపడి... లెంపలు వాయించుకుని.... క్షమార్పణ కోరడం.... తానే స్వయంగా... కవికి పల్లకీని ఏర్పాటు చేసి అంకితం ఇప్పించడం...

ఆ మర్నాడు.... సుబ్రహ్మణ్య కవి ... సువర్ణముఖీ నదిలో స్నానం చేసే సరికి కుష్ఠు వ్యాధి మంత్రం వేసినట్టు మాయమవ్వడం!

శరీరం సువర్ణ ఛాయలతో వెలిగిపోవడం... అదో కథ....

రాజు వెళ్ళిపోయాడు... కవీ వెళ్ళి పోయాడు.... కానీ శాశ్వతంగా మిగిలిపోయింది మాత్రం.... 'ఆధ్యాత్మ రాయాయణ కీర్తనలు'.

వందేళ్ళక్రితం ఆంధ్ర దేశంలో ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు రాని ఆడపిల్లలు లేరూ అనడం అతిశయోక్తి కాదని....

ఒక్కసారి ఆ కీర్తనల్నివింటే తెలుస్తుంది వాటి శక్తేవిటో!!!

అక్షరాల్ని పిండితే.... అమృతం బొట్టు బొట్టుగా రాల్తుంది.

అందుకే హిందూ కళాశాల ఆంధ్రోపన్యాసకురాలు ప్రమీలాదేవి గారు... తమ పరిశోధన గ్రంథంలో ఇలా అన్నారు.

"ఆది దంపతుల (ఉమామహేశుల) సంవాద రూపంలో సాగిన ఆధ్యాత్మ రామాయణంలో వేదాంతం మూర్తీభవించింది సుబ్రహ్మణ్య కవి.... పట్టి విద్వాంసుడిగా కాక... అఖండ చిదానుభవాన్ని అనుభవించిన ఆత్మనిష్ట కల యోగిగా కనిపిస్తాడు... ఇందులో క్షేత్రయ్య ఛాయలు కానరావు. మహాభక్తుడైన జయదేవుడు కూడా అందుకోలేని తాత్విక స్థాయి ఇందులో గోచరిస్తుందీ" అని.....

1960 ప్రాంతంలో ఆకాశవాణిలో భక్తిరంజని కార్యక్రమంలో ఈ ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు వస్తూ ఉండేవి. అప్పట్నించే అవంటే నాకెంతో మోజు! పుస్తకం కొనుక్కునీ కొన్ని కంఠస్తం కూడా చేసాను. సంగీతం రాక పోయినా ఆ సాహితీ సౌరభాల్ని అనుభవించేందుకూ....! ఒక్కసారి వింటే మీరలా పరవశించి పోతారు మరి!!!

ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు వింటుంటే...

శ్రీరాముడు...శివుడికి క్షీరాభిషేకం చేస్తున్నట్టనిపిస్తుంది !

ఈశ్వరుడు...వెంకటేశ్వరుడికి అర్చన చేసినట్టనిపిస్తుంది !!

పార్వతీదేవి సీతమ్మవారిని పెళ్ళికూతుర్ని చేస్తున్నట్టనిపిస్తుంది !!!

ఇంతెందుకూ...తెలుగువారు తవ్వుకున్న కొద్దీ దొరికే

బంగారు పాతరని దాచిన మునిపల్లె సుబ్రమణ్య కవి పాదాలని

ముద్దెట్టు కోవాలనిపిస్తుంది !

(డాక్టర్ సి. విజయలక్ష్మి గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

- **భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయదలచుకునే వారు

**తణికెళ్ళ భరణి**
C/o "హాసం"
**502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్**
**హైదరాబాదు-500 018**
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.




నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై
అధ్యయనం చేసిన రచయిత,
జర్నలిస్టు, నటుడు
**రావికొండలరావు**
రాసిన వ్యాసమిది



మోకాళ్ల పైకి పంచె, పైన జుబ్బా, ఆ పైన అంగవస్త్రం, చంకలో ముడిచిన గొడుగుతో - లింగులింగుమని పెద్ద పెద్ద అంగలు వేస్తూ వస్తున్న ఆయన వంగర వెంకట సుబ్బయ్య. మూడు వందల చిత్రాలకు పైగా, ముప్పై సంవత్సరాలకు పైగా సినిమాల్లో నటించిన వంగర. ఎప్పుడైనా బస్సు ఎక్కేవారేమో గాని, సాధారణంగా నడకే. 1936లో వచ్చిన 'విప్రనారాయణ' నుంచి, 67లో వచ్చిన 'రహస్యం' వరకు, ఆ పైనా కూడా చిత్రాల్లో వివిధ పాత్రలూ ధరించిన సుబ్బయ్యగారు చెప్పుకోడానికి అక్షరాలా హాస్యనటుడూ కాదు. కాని, తాను హాస్యం చెయ్యకుండా - చెప్పే సంభాషణ ద్వారా హాస్యం తెప్పిస్తారు. పండితుడు. సంస్కృతాంధ్రాలు క్షుణ్ణంగా చదివిన వాడు. వేదం పఠించిన వాడు.

# 'వ్యంగ్య'ర వెంకట సుబ్బయ్య

"మామూలుగా వేదం చదవడం కాకుండా, వెనక నుంచి ముందుకు చదవడం కూడా ప్రాక్టీసు చేశాను. చాలామంది అది చెప్పమనే వారు - 'రివర్సు'లో వున్నా వేదం వేదమే. అదో ఫీటు. సరదాగా ప్రాక్టీసు చేశాను'' అని చెప్పేవారు వంగర. నూరు సంవత్సరాల క్రితం - అంటే 1901లో ఆయన 'చిత్రనళీయం' నాటకంలో ఇంద్రసేనుడు వేశారు. అప్పుడు ఆయన నాలుగేళ్లు. "అక్కడి నుండి నాటకాలు. ఇంగ్లీషు చదువులు లేవు. కొంతకాలం చదువు చెప్పే ఉద్యోగం చేశాను. ఎన్నో నాటకాల్లో ఎన్నెన్నో వేషాలు. హరిశ్చంద్రుడి దగ్గర్నుంచి కాల కౌశకుడి వరకూ. ఏది వీలైతే అది! " అని, తన అనుభవం చెప్పారొక సారి. 'విప్రనారాయణ' నాటకాన్ని అరోరా ఫిలిం కంపెనీ చూసింది. అలాగే తెరకెక్కిస్తే - శ్రీనివాసుడి పాత్ర వెంకట సుబ్బయ్యది. తదాదిగా సినిమాలూ, నాటకాలూ రెండూ వుండేవి. బాలయోగిని, రైతుబిడ్డ, మాలపిల్ల,



పల్నాటియుద్ధం నాటి సినిమాలు. షావుకారు, పెద్దమనుషులు, దొంగరాముడు, మాయాబజార్ - తర్వాతి సినిమాలు. 'షావుకారు'లోని గుమస్తా, 'పెద్దమనుషులు' లోని సిద్ధాంతి, 'మాయా బజార్' లోని స్తోత్ర పండితుల్లో శాస్త్రి - గుర్తు తెచ్చుకుంటే చాలు, ఆయన పలికించిన హాస్యం అర్థం అవుతుంది.

ఆయన ఎప్పుడూ చమత్కార బాణాలు సంధిస్తూనే వుండే వారు. మంచి మాటకారి. వ్యంగ్య భాషణంతో - దెబ్బకొట్టే వారు. ఒకానొక షూటింగులో ఒక డైరెక్టరు గారు "వంగరా!'' అని పిలిచారు - ఏకవచన ప్రయోగం. "పాతిక సంవత్సరాలై ఈ సినిమా పరిశ్రమలో వంగే వున్నాను. మహాప్రభో - ఇంకేం వంగనూ? నడుం పడిపోయింది!'' అని బదులిచ్చారాయన.

"మా యింట్లో ముగ్గురు ఇష్టులం. అంటే ఇష్టం వున్న వారం అని కాదు. నా భార్య రోగిష్టి మా అబ్బాయి కోపిష్టి, నేను పాపిష్టి'' అని చెప్పేవారాయన. ఆయన సీరియస్‌గా చెప్పినా, వినే వాళ్లకి నవ్వు వచ్చేది.

ఒకసారి ఎండలో నడుస్తూ వస్తున్నారు

గొడుగు వేసుకుని - స్టూడియోల రోడ్డులో.

"ఇంత ఎండలో వస్తున్నారు. ఎక్కణ్ణుంచి?" అని అడిగితే "ఏముంది! ఈ సినిమా ప్రపంచంలో తిరగడాలెక్కువ. ముందు వేషాల కోసం తిరగాలి. ఇచ్చిన తర్వాత "మళ్లీ ఎప్పుడొస్తుంది?" అని అడగడానికి తిరగాలి. డబ్బులు అడగడానికి తిరగాలి. అయిపోయిన తర్వాత నెక్స్ట్ పిక్చర్స్‌లో వేషం వుందా అని అడగడానికి తిరగాలి. అలా తిరగవలసిందే. నా కాళ్లు అరగవలసిందే. ప్రొజెక్టర్లో ఫిలిమూ తిరుగుతుంది. అందులో నటించే వాళ్లం గనక, నాబోటి వాళ్లూ తిరగవలసిందే!" అన్నారు. ఎంత వ్యంగ్యం!

"భరణీ స్టూడియోకి వెళ్లాను. బ్రాహ్మణ వేషాలేం లేవు. పొమ్మంటిరి - నేనింక ఎందుకూ పనికిరానట్టు! ఏవియం స్టూడియో కనిపించింది. - లోపలికి వెళదామా అనుకుని



'మ్చ్' వద్దనుకున్నాను. ఎంచేతంటారా - "ఏవీఇయ్యం" అని పెద్దబోర్డ్ పెట్టేసుకున్నారుగా - నాకేం ఇస్తారు?.... వస్తూ వాహినీలో దూరాను. చక్రపాణిగారు కనిపిస్తే నమస్కారం పెట్టాను.

"ఎందుకొచ్చా? వేషం వుంటే పిలవం? నువ్వు రావాలా!" అని ప్రేమతో గసిరారు. అయ్యా అదీసంగతి. ఈ తిరుగుబాటు లేకపోతే జరుగుబాటు లేదు. తిరుగుబాటు అంటే వేరే అర్థం కాదు సుమండీ!" అంతా చమత్కారమే! వ్యంగ్యమే! ఎవరైనా "వెంకట సుబ్బయ్య గారూ కులాసా?" అని పలకరిస్తే "కు - లేదు. అంతా లాసే" అనే వారు. హోటల్లో కాఫీ తాగి, మొహం ఆముదం తాగినట్టు పెట్టి "కా - లేదు. ఫీయే" అన్నారొకసారి. ఫీ అంటే డబ్బు, క్షేమమా?" అని అడిగితే "ఆహా క్షామమే" అనే వారు.

సుబ్బయ్యగారు సంభాషణ ప్రియుడు. గంటల తరబడి, నిలబడి మాట్లాడితే, టైము తెలిసేది కాదు. "సినిమాల్లో వున్న వాళ్లు ఎవరి పని వారు చేసుకు పోవాలి. తప్పుని తెలిసినా దిద్దడానికి వీల్లేదు. నిన్న పురాణచిత్రం షూటింగు. ఒకాయన సంభాషణ తప్పు

## 'మాయాబజార్' లో వంగర పాల్గొన్న కొన్ని హాస్య సన్నివేశాలు





**లక్ష్మణ కుమారుడు (రేలంగి) తన మందిరంలో నిలువుటద్దంలో తన ముఖారవిందాన్ని చూసుకుని మురిసిపోతూ కర్ణాభరణాలను సరిచేసుకుంటూ, కూనిరాగంలో సంగీతాలాపన చేస్తూ, కళ్లు తిప్పి ఈలవేసి "సారథీ" అని తన అనుచరుణ్ణి (బాలకృష్ణ) పిలిచాడు.**

**లక్ష్మణకుమారుడి వెర్రి వెంగళప్పాయి తనం తెలిసినవాళ్ళు గనక, జంట పండితులు శాస్త్రి (వంగర) శర్మ (అల్లురామలింగయ్య) వీలున్నప్పుడల్లా ప్రశంసిస్తూ, అతన్ని కీర్తిస్తూ మంచినో,మామూలునో సంపాయించు కుంటూ ఉంటారు.**

వంగర : (ప్రశంసిస్తూ) "సురుచిరకార రణధీర శూరవీర లక్ష్మణకుమార, సుకుమార..."

రేలంగి: (కోలగాముఖం పెట్టి) చాలు ముఖస్తుతి

వంగర : అస్తు

అల్లు: (ఆరంభించాడు) ప్రభూ మరి నన్ను వినండి. అభిమన్యుని జన్మ కన్న - శుభమైనది మీ జన్మ.

రేలంగి: (బహుమతి అందిస్తూ):భళీ! ఇదీ కవిత్వం!

వంగర : (అభిమన్యుడిని తిడితే లక్ష్మణ కుమారుడు మురిసిపోతాడని తెలిసి) వనవాసము వాని ఖర్మ - ఘనరాజ్యము మీది సుమ్మ

రేలంగి : లెస్స బలికితిరి

వంగర : యుద్ధకాండలో ఉపద్రవంగా పద్మవ్యూహం పన్నినవేళల

అల్లు: (పూర్తి చేస్తూ) పురోగమించుట వానికి తెలియును. తిరోగమించుట తమకు తెలియును.

రేలంగి : (భాష అర్థం చేసుకోలేక) 'అవునవును'

వంగర : అతనికి మీ తెలివేదీ

అల్లు : :అతనికి మీ సుళువేది

వంగర : :అతనికి మీ కళ ఏదీ

ఇద్దరు : :స్తుతి గాదిది స్తుతిగాదిది

**(వివాహభోజనాన్ని ఘటోత్కచుడు స్వాహా చేశాక వంటశాలలోకి వచ్చి చూసి నిర్ఘాంతపోయి)**

వంగర : శర్మా! కనబడ్డవీ మాయమైనవీ

అల్లు : మాయమైనవీ కనబడ్డవీ...

(తాంబూలపళ్ళెం కదులుతుంది)

వంగర : ఇదీ భ్రాంతేనంటావా

అల్లు : ఇది కూడా భ్రాంతే

వంగర : ఈ భ్రాంతికి కారణం

అల్లు : కారణం ఏముంది- పైత్యప్రకోపంలో ఒక రూపం- ఈ భ్రాంతి.

పలుకుతున్నాడు. రాసిందీ అలాగే వుంది. అది శుద్ధ తప్పు అని నాకు తెలిసినా, నోర్మూసుకున్నాను. మూసుకోవాలి! చెప్పాం అనుకోండి - "నీ పని నువ్వు చూస్కోవయ్యా - నీకెందుకు?" అని గసురుతారు. అంచేత లౌక్యం కావాలి. అబ్బో - చాలా డేంజరు. సినిమాలోకం ఇది!" అని చెప్పేవారు వంగర.

ఇతర భాషా చిత్రాన్ని తెలుగులోకి డబ్ చెయ్యడం ఆరంభించినప్పుడు డబ్బింగ్ ఆర్టిస్టులంటూ లేరు. చాలా మంది రేడియో ఆర్టిస్టులనే రప్పించి, డబ్బింగ్ చెప్పించే వారు. సుబ్బయ్యగారు రేడియో ఆర్టిస్టు. చాలా పౌరాణిక, సాంఘిక నాటికల్లోని పాత్రల్ని గాత్రంతో పోషించారు. అంచేత ఆయన్ని పిలిపించారు. అది మలయాళ చిత్రం. ఒక పాత్రను తెరమీద చూపించి, "అతను సంభాషణ ఆరంభించగానే, ఈ తెలుగు డైలాగుని, ఆ బొమ్మ చూస్తూ చెప్పాలి" అన్నారు. వంగర గారు ప్రయత్నం మొదలు పెట్టారు. అరగంటయింది. గంటయింది. కుదరడం లేదు. "అయ్యో! ఇది నా వల్ల కాని పని. ఆ పాత్ర - నేను సర్దుకునే లోపల మొదలు పెట్టేస్తున్నాడు. లేదా, ఆలస్యం చేస్తున్నాడు. నాకంటె ముందు పరుగెడుతున్నాడు. లేదా వెనకబడి పోతున్నాడు. అతను బొమ్మలో వున్నాడు గనుక, నా స్పీడుకి రమ్మనడం కుదరనిపని. అంచేత వారికీ నాకూ పొత్తు కుదరదు. పొత్తు పొసగని ఈ వ్యాపారం నా వల్ల కాదు. క్షమించండి" అని బయటపడ్డారు.

సామెతలు, పిట్ట కథలు, కబుర్లతో అందర్నీ పలకరించే వెంకట సుబ్బయ్యగారు - ఎనభై ఏళ్లకు పైగా జీవించారు. అంతటి చమత్కారికీ - డెభ్భై ఐదో ఏట మాట దెబ్బతిన్నది. "ఎండలో వెళ్లి చెరువు స్నానం చెయ్యడంతో, పక్షవాతంలా వచ్చి మాట మడత పడుతోంది. ఇంక నాకు నాటకాలూ, సినిమాలు దూరమే. పోన్లెండి, ఇహ నా నోటికి ఎవడూ దడవనక్కర్లేదు" అని ఛలోక్తి విసిరారు - అప్పుడు కూడా.

'షావుకారు'లో కోర్టు సాక్ష్యం, 'దొంగ రాముడు'లో "నీ బొంద" ఊత పదం వంటివి వంగర మార్కు అభినయానికి చిన్న ఉదాహరణ. 'మాయాబజార్'లో విందు భోజనంలో వంటకాలు కోరుకొంటూ - "గోంగూర! శాకంభరీ దేవి ప్రసాదం. ఆంధ్ర శాకం! అది లేనిదే ప్రభువులు ముద్దయినా ముట్టరు!" అని చెప్పి, నవ్వించిన శాస్త్రిగారు వంగర. ఆ చిత్రంలోనే భయపడిపోతూ "అస్తు" పలుకులతో వినోదింప జేసిన పండితుడు - వంగర.

## 'చక్రపాణి'లో వంగర పాల్గొన్న హాస్యసన్నివేశం



చక్రపాణి (సి.ఎస్.ఆర్.) పరమలోభి. అతనివద్ద గుమాస్తా కోటయ్య (వంగర) అతనికంటే ఘనుడు. చక్రపాణి పెద్ద మనుమరాలి భర్త రమణారెడ్డి రెండో మనుమరాలికై సంబంధం తెస్తానంటాడు. సాయంత్రం నాలుగు గంటలకు పెళ్లివారిని బళ్లల్లో తీసుకురావాలి రెండురూపాయలు ఇప్పించమంటాడు. సి.యస్.ఆర్. తనవద్ద డబ్బు ఉన్నా అది లెక్కపెట్టి పెట్టుకున్న రొక్కమనీ, ఆ రెండురూపాయలూ గుమాస్తా వద్ద తీసుకోమనీ అంటాడు. రమణారెడ్డి వచ్చేసరికి పనిమనిషి వంగరతో మాట్లాడుతోంది.

పనిమనిషి : కోటయ్యగారూ కోటయ్యగారూ ఎన్నాళ్ళించో అడగాలను కుంటున్నాను. మీ వయసెంతండీ?
వంగర : నా వయస్సుతో నీకు ఏం పనే?
పనిమనిషి : చెప్పుదురూ ఫర్వాలేదు.
వంగర : నడివయసు. కూడికలతో మెదడు ఉడికి తల తెల్లపడ్డది గానీ...
పనిమనిషి : పోనీ ఆ పాడు కూడికలు మానేయక పోయారూ.....
వంగర : ఇది కూడా పోతే ఇంకా బతుకేముందే! ఇక మాట్లాడించకు...
రమణారెడ్డి (వచ్చి) : కోటయ్య గారూ
వంగర : అబ్బా పోవే
రమణారెడ్డి : బాగుంది అదేంటండోయ్ పోవే అంటున్నారు
పనిమనిషి : అల్లుడు గారండీ
వంగర : ఓ, ఓ, మీరా క్షమించండి, చూళ్లేదు
రమణా రెడ్డి : రెండు రూపాయలు ఇలా ఇవ్వు
వంగర : మీకెందుకు బాబూ?
రమణా రెడ్డి : పెళ్లి వారిని తీసుకురావాలి. వాళ్ల ఖర్చుకోసం
వంగర : మా చిట్టాలో బళ్ల పద్దులు లేవు ఇంతవరకు! కులాసాగా నడిచి రమ్మనండి
రమణా రెడ్డి : చక్రపాణి గారు ఇమ్మన్నారయ్యా
వంగర : నాతో చెప్పలేదే. తాయారూ నువ్ అడిగిరా
రమణారెడ్డి : ఏం? నే చెపితే నమ్మకం లేదా? దానిమాటే నమ్మకమా?
వంగర : చిత్తం. పనిచేసే పిల్లకదూ అబద్దాలు చెప్పడానికి భయపడుతుంది. తమరు అల్లుళ్ళాయే
పనిమనిషి : (తిరిగి వచ్చి) ఇమ్మన్నారు.
వంగర : ఆ. ఆహ సరే (రమణారెడ్డితో) ఆ చెప్పండి... ఆ వచ్చేవారి పేరేమిటి?
రమణారెడ్డి : పెళ్లి వారయ్యా, పేరెందుకు?
వంగర : చుట్టరికం వేరు. చిట్టా వేరు. బాబూ చెప్పండి
రమణారెడ్డి : జగన్నాధరావుగారు... పెళ్లిపెద్ద....
వంగర : ఇంటిపేరు...?
రమణారెడ్డి : పెంకులు... ఇయ్యవయ్యా అంటుంటే
వంగర : అంత తొందరైతే ఎలా! ఇది డబ్బు. ఇంటిపేరు చెప్పకపోతే ఎలా?
రమణారెడ్డి : పెళ్లివారి పేరు పుస్తకాలలో రాస్తే బాగుండదు పొడి అక్షరాల్లో రాయవయ్యా కో.జ. అని
వంగర : కో.జ. ఏంటండీ. గుండెగ మీది పేరల్లే... పూర్తి పేరు చెప్పండి.
రమణారెడ్డి : కోతుల జగన్నాధరావుగారు... డబ్బు తీయవయ్యా
వంగర : కోప్పడకండీ. వారు ఒకవేళ రాకపోతే...?
రమణారెడ్డి : బాగుంది. ఇదేమిటయ్యా శుభమా అని పెళ్లివారు వస్తుంటే
వంగర : ఏమైనా ఇబ్బందులు రావచ్చు. అన్నప్పుడెల్లా ప్రయాణాలు చేయగలమా?

# యస్.డి. బర్మన్ రికమెండ్ చేసిన
# చిత్రగుప్త



జనవరి 14 చిత్రగుప్త వర్ధంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసం

ప్రఖ్యాత హిందీ సంగీత దర్శకుడు చిత్రగుప్త 1917 నవంబరు 16న కర్‌మైని గ్రామంలో పుట్టారు. కర్‌మైని గ్రామం బీహార్‌లోని గోపాల్ గంజ్ జిల్లాలో ఉంది. చిత్రగుప్త పూర్తి పేరు చిత్రగుప్త శ్రీవాస్తవ. ఆయన ఎకనమిక్స్‌లోను, జర్నలిజంలోను పాట్నా యూనివర్సిటీ నుండి యమ్.ఎ. చేశారు. కొత్తలో ఆయన సంగీత దర్శకత్వం వహించిన చిత్రాల టైటిల్స్‌లో చిత్రగుప్త యమ్.ఎ. అని వేయించుకునేవారు. తన మాస్టర్ డిగ్రీల గురించి ఆయనకు ఎంతో గర్వంగా ఉండేది.

స్వాతంత్ర్య సమరం టైములో ఆయన కొన్నాళ్ళు జైలులో కూడా ఉన్నారు. అదే టైములో ఒకసారి ఆయన జవహర్‌లాల్ నెహ్రూ దగ్గర 'సారే జహాఁసె అచ్ఛా' గీతాన్ని కూడా పాడారు. స్నేహితుడు మదన్ సిన్హా (ప్రఖ్యాత సినిమాటోగ్రాఫర్) ప్రోత్సాహంతో భాట్‌కండా యూనివర్సిటి నుండి సంగీతంలో గ్రాడ్యుయేట్ అయ్యారు.

తరువాత ఆయన స్నేహితుడు సర్వోత్తమ బాదామి సహకారంతో కీ॥శే॥ త్రిపాఠి వద్ద అసిస్టెంటుగా జాయిన్ అయ్యారు. మొట్టమొదట ఆయన స్వతంత్రంగా సంగీతం కూర్చిన చిత్రం 'లేడీరాబిన్ హుడ్'(1946). ఈ స్టంట్ ఫిలింలో నాడియా నటించింది. తరువాత ఆయన కొన్ని సినిమాలకు త్రిపాఠితో కలిసి పనిచేశారు. సంగీతాన్ని నూతనరీతుల్లో చెయ్యాలన్న చిత్రగుప్త ప్రతిపాదనలకు త్రిపాఠి అంగీకరించకపోవడంతో 1954లో ఆయన త్రిపాఠి నుండి విడిపోయారు.

చిత్రగుప్తకు మొట్టమొదట బాగా పేరుతెచ్చిన చిత్రం 1952లో వచ్చిన 'సింద్‌బాద్ ది సైలర్'. దీన్ని మహేష్ భట్ తండ్రి నానాభాయ్ భట్ డైరెక్టుచేశారు. దీనిలోని సంగీతం చాలా బాగా రావాలని చిత్రగుప్త చాలా తపన పడ్డారు. ఈ చిత్రంలో రఫీ, షంషాద్ బేగం పాడిన 'ఆదా సే జూమ్‌తే హుయే' అన్న పాట బాగా హిట్ అయ్యింది.

**1940-1950**లలో చిత్రగుప్త ఎన్నో హిట్ చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు. అందులో ఫైటింగ్ హీరో, తూఫాన్ క్వీన్ లాంటి స్టంట్ చిత్రాలు, నాగ పంచమి, శివరాత్రి, గణేష్ వివాహ్, తులసీదాస్ లాంటి పౌరాణిక, చారిత్రాత్మక చిత్రాలు ఉన్నాయి. తులసీదాస్‌లో రఫీ పాడిన "ముఝే అప్నీ శరణ్ మే లేలో రామ్" అన్న పాట ఇవాల్టికీ పాప్యులరే. చిత్రగుప్త సంగీత దర్శకత్వం వహించిన 'మన్ చలా' చిత్రంలో హాస్యనటుడు ఆగామీద తీసిన పాట 'భగవాన్ తుఝే మైఁ ఖత్ లిఖ్‌తా' చిత్రగుప్త పాడినదే!.

**1955**లో ఎ.వి.యమ్ వారు 'శివభక్త' చిత్రం తీస్తూ సంగీత దర్శకత్వం వహించమని యస్.డి.బర్మన్‌ని అడిగారు. కాని యస్.డి.బర్మన్ ఎ.వి.యమ్ వారి ఆఫర్‌ను తిరస్కరిస్తూ ఇటువంటి చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించగలవాడు ఒక్క చిత్రగుప్తయే అని చిత్రగుప్తని ప్రశంసించారు. ఆ తరువాత ఎ.వి.యమ్ వారి 'శివభక్త' చిత్రానికి చిత్రగుప్తే సంగీత దర్శకత్వం వహించారు. ఈ చిత్రంతో ఆయన అగ్రశ్రేణి సంగీత దర్శకులలోకి చేరిపోయారు. ఈ చిత్రం

**ఘంటసాల గీతాలలో మనం మరువలేనిది 'పయనించే ఓ చిలుకా' ఒకటి. ఆ పాటకు ఒరిజినల్ ట్యూన్‌ను అందించిన సంగీత దర్శకుడి పేరు చాలామందికి తెలియదు.**

**ఎ.వి.యమ్ వారు 'శివభక్త' (1955) అనే సినిమా తీస్తూ ఆ సినిమాకు సంగీత దర్శకత్వం వహించమని ఎస్.డి. బర్మన్‌ను కోరారు. పౌరాణిక సినిమాలకు తనకంటే బాగా చేయగల వ్యక్తిని చూపిస్తానని బర్మన్ ఒక వ్యక్తిని రికమెండ్ చేశారు.**

**'కయామత్ సే కయామత్ తక్' వంటి సూపర్ హిట్ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించిన 'ఆనంద్- మిలింద్' లకు తండ్రి, గురువు -'ఆయనే!'**

**ఆయన పేరు-చిత్ర గుప్త!**



చిత్రగుప్త సంగీతం సమకూర్చిన "ఊంచే లోగ్" (తెలుగులో సుఖదుఃఖాలు) లో అశోకుమార్, రాజ్‌కుమార్



చిత్రగుప్త కుమారులు, శిష్యులు ఆనంద్ - మిలింద్

లోనే లతా మూడు పాటలు పాడింది. లతతో చిత్రగుప్తకున్న అనుబంధం 'బార్‌బార్ నాచోతో' మొదలయి 'అంగారె'(1977) వరకు సాగింది. వీరిద్దరి కాంబినేషన్‌లో దాదాపు 240 పాటలు వచ్చాయి.

**1950** తరువాత చిత్రగుప్త సంగీత దర్శకుడుగా ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాడు. ఆయన ప్రతిభ 1964లో వచ్చిన ఎ.వి.యమ్ వారి 'మైభీ లడ్కీ హూఁ' వరకు అద్భుతంగా చూపించారు. బాభీ, బర్ఖా మైఁ చుప్ రహూంగీ లాంటి చిత్రాలలోనే కాక చిన్న తరహా చిత్రాలైన ఏక్‌రాజ్, గెస్ట్‌హౌస్, బర్మారోడ్, పతంగ్, రాకెట్ గర్ల్, షాదీ, గంగాకి లహరే, మైఁ షాదీ కర్నేచలా, ఒపేరాహౌస్ లాంటి చిత్రాలకి సంగీత దర్శకత్వం వహించారు.

**1960**కి ముందు వచ్చిన ఆకాష్ దీప్, బౌలాద్, వాస్నా, ప్యార్‌కాసప్నా, మేరా కసూర్ క్యాహై, ఘర్ బసాకె దేఖో కమర్షియల్‌గా హిట్స్ కాకపోయినా మెలోడి పరంగా చిత్రగుప్త తన శైలిని నిలబెట్టుకున్నాడు. ముఖ్యంగా లత, రఫీ పాడిన యుగళ గీతాల్లో.

**1969**తో వచ్చిన హార్ట్ ఎటాక్‌తో ఆరోగ్యం బాగోలేక తరువాత వచ్చిన చిత్రాలైన పరదేశి, సంసార్, ఇంతజార్(1973)లలో చిత్రగుప్త తనదైన ముద్ర చూపించలేకపోయాడు. తరువాత వచ్చిన భోజపురి చిత్రం 'గంగామాయి తుహి పియారి చఢైబొ'లో తన ప్రతిభను తిరిగి ఋజువు చేసుకున్నాడు. ఈ చిత్రం టైటిల్ సాంగ్ శైలేంద్ర రాయగా లత, ఉషా మంగేష్కర్ పాడారు.

**భో**జపురి చిత్రాలలో చిత్రగుప్త తిరుగులేని సంగీత దర్శకుడిగా నిరూపించుకున్నా, 1970లో సంగీత ప్రపంచంలో వచ్చిన మార్పులు ఆయన్ని హిందీ చిత్రరంగం నుండి పక్కకి నెట్టాయి. అదే పరిస్థితిలో ఆయన ఆరోగ్యం మరింత పాడవడం




హెచ్.ఎమ్.వి. వారి చిత్రగుప్త గోల్డెన్ హిట్స్ లో చోటు చేసుకున్న కొన్ని హిట్ సాంగ్స్

### ఎ సైడ్ -

| పాట: | సినిమా: |
|---|---|
| 1. దో దిల్ ధడక్ రహే హైఁ | ఇన్సాఫ్(1956) |
| 2 చల్ ఉడ్ జా రే పంఛీ | భాభీ (1957) |
| 3. ఏక్ రాత్ మే దోదో చాంద్ ఖిలే | బర్ఖా (1959) |
| 4. తేరీ దునియా సే దూర్ | జబక్ (1961) |
| 5. రంగ్ దిల్ కీ ధడ్‌కన్ భీ లాతీ తో హోగీ | పతంగ్ (1960) |
| 6. దేఖో మౌసమ్ క్యా బహార్ హై | ఒపేరా హౌస్ (1961) |
| 7. అగర్ సున్ లే తో ఏక్ నగ్మా | ఏక్ రాజ్ (1963) |
| 8. ముఫ్త్ హుయే బద్నామ్ | బారాత్ (1960) |
| 9. చాన్ద్ జానే కహాఁ | మైఁ చుప్ రహూఁగీ (1962) |
| 10. జాగ్ దిలే దీవానా | ఊంచే లోగ్ (1965) |

### బి సైడ్ -

| | |
|---|---|
| 1..తుమ్‌నే హసీఁ హసీఁ మేఁ | ఘర్ బసాకే దేఖో (1963) |
| 2.చన్దా సే హోగా వో ప్యారా | మైఁ భీ లడ్కీ హూఁ (1964) |
| 3. ఛే దో న మేరీ జుల్ఫే | గంగాకి లహరే (1964) |
| 4. ఘమ్ కీ రాత్ కాటే | మేరా కసూర్ క్యా హైఁ (1963) |
| 5.ముఝ్ దర్ద్-ఏ-దిల్ కా పతా న | ఆకాష్ దీప్ (1965) |
| 6. ఏ పర్‌బతోఁ కే దాయిరే | వాస్‌నా( 1968) |
| 7. అర్మాన్ థా హామేఁ జిన్‌కా | బౌలాద్ (1968) |
| 8..మేరే గోరే అంగ్ బసే | పర్‌దేశి (1970) |
| 9.ఆకే మిల్ జా | ఇంతెజార్ (1973) |

### ఇంకా కొన్ని మంచిపాటలు -

దగా బాజ్ హో (బర్మారోడ్), అజనబీ సే బన్ కే కరోన, పాయల్ వాలీ దేఖ్‌నా (ఏక్‌రాజ్), దగా దగా వయ్, వయ్, వయ్ (ఒపేరా హౌస్), తుమ్‌నే హసీ హీ హసీ మేఁ (ఘర్ బసా కే దేఖో), దీవానే తుమ్, దీవానే హమ్, ఆజ్ కి రాత్ నయా చాంద్ లేకే ఆయీ హై (షాదీ), లాగీ ఛూటేనా (కాలీ టోపీ లాల్ రుమాల్), తుమ్ హీ హో మాతా (మై చుప్ రహూంగీ), మేరే దిల్ కభీ తో కోయీ ఆయేగా (ప్యార్ కా సప్నా), జోడీ హమారీ (బౌలాద్).

కూడా ఒక కారణం.

**1985**లో వచ్చిన 'ఘర్‌ద్వార్' చిత్రగుప్త ఆఖరి హిందీ సినిమా. దీనిలో, 1984లో వచ్చిన 'అబ్ ఆయెగా మజా' లోను మరికొన్ని భోజపురి సినిమాల్లోను ఆయన కుమారులు ఆనంద్ మిలింద్ సహకారం ఉంది.

**చి**త్రగుప్తకి మొదటి నుండి కూడా ఇండియన్ క్లాసికల్ మ్యూజిక్ మీదకంటే వెస్టర్న్ మ్యూజిక్ మీదే మక్కువ. 1954లో ఆయన తన గురువు త్రిపాఠి నుండి విడిపోయింది అందుకే! అందువలనే ఆయన తన కుమారులు ఆనంద్, మిలింద్‌లను శాస్త్రీయ సంగీతం నేర్చుకోవటానికి అంతగా ప్రోత్సాహం ఇవ్వలేదు. సంగీత రంగానికి వారిద్దర్ని పరిచయం చేసేముందు వాళ్ళిద్దరిని ఉన్నత విద్య కోసం పంపించారు చిత్రగుప్త.

**త**న శిష్యులు, కుమారులు అయిన ఆనంద్-మిలింద్ ఇద్దరూ 'కయమత్ సే కయామత్ తక్', 'లాల్ దుపట్టా మల్‌మల్ కా', 'దిల్', 'బాగి' వంటి హిట్‌లు కొట్టడం ఆయనను ఆనందపరిచింది. అటువంటి హిట్‌లు తన జీవితంలో చవిచూడలేదాయన. జీవిత చరమాంకంలో తండ్రికి అటువంటి తృప్తి నిచ్చిన ఆయన కుమారులు అభినందనీయులు.

**చి**త్రగుప్తది సరదా అయిన మనస్తత్వం. ఆయన ఏనాడు పెద్ద స్టార్స్‌తోగాని, పెద్దపెద్ద కంపెనీలకు గాని పనిచెయ్యలేదు. సీదా సాదా అయిన చక్కని సంగీతం సామాన్యుడికి కూడా అందేస్థాయిలో సమకూర్చడమే ఆయన ఘనత. ఆయనది డబ్బు మనస్తత్వం కాదు. 1960లో శంకర్ జైకిషన్ లాంటి వారు 5 లక్షలు డిమాండ్ చేస్తుండే టైములో ఆయన ఎ.వి.యమ్ వంటి పెద్ద సంస్థవద్ద చిత్రానికి 20.000/-రూ.లు మాత్రం తీసుకున్నారు!

**చి**త్రగుప్త మ్యూజిక్ చేసిన కొత్తలో ఆయన మీద రామచంద్ర ప్రభావం కొంత ఉండేది కాని తరువాత ఆయన తనదంటూ ఒక శైలిని ఏర్పరుచుకొని దానికే కట్టుబడ్డారు. చిత్రగుప్త 250 చిత్రాలలో దాదాపు 1500 పాటలు కంపోజ్ చేశారు. తెలుగులో కులదైవంలోని పద పదవె వయ్యారి గాలి పటమా, పయనించె ఓ చిలుకా గీతాలు బాభీలోని చల్ చల్‌రే పతంగ్ మేరీ చల్‌రే చల్ ఉడ్ జా రే పంఛీ గీతాలకు 'అగ్ని ప్రవేశం'లోని "నా ఊహలో హలో" గీతం ఆకాష్ దీప్ లోని 'దిల్ కా దియా' గీతాల పై ఆధారపడ్డవే! చిత్రగుప్త 1991 జనవరి 14న మరణించారు.

**-టి.యస్. రావు**

# చిత్రగుప్తవారసులు ఆనంద్-మిలింద్

**అబ్ ఆయేగా మజా, ఖయామత్ సే ఖయామత్, దిల్, భాగీ, బేటా, అనాడీ, రాజాబాబు తదితర ఎన్నో మ్యూజికల్ హిట్ చిత్రాలను అందించిన సంగీత ద్వయం ఒక్కసారిగా తెరవెనకకు వెళ్ళిపోయినప్పటికీ నాలుగు సంవత్సరాల తర్వాత సరస్వతి...యే తేరా ఘర్ యే మేరా ఘర్...అంటూ ఒక్కసారిగా వార్తలలోకి వచ్చారు ఆనంద్-మిలింద్ లు. ప్రఖ్యాత హిందీ సినీ సంగీత దర్శకుడు చిత్రగుప్త కుమారులే అయినప్పటికీ ముందుగా టీ.వీ. సీరియల్స్‌కు పనిచేసిన తర్వాతే సినిమా రంగానికి వచ్చారు వీరు. అబ్ ఆయేగా మజా(1984) చిత్రం ద్వారా సినీ రంగానికి పరిచయమైన వీరు అంతకుముందు కరంచంద్ టీ.వీ.సీరియల్‌కు, మన్సూర్‌ఖాన్ నిర్మించిన ఉమబెర్తో అనే లఘు చిత్రానికి పనిచేసారు. అయితే వీరికి గుర్తింపు తీసుకువచ్చిన చిత్రం మాత్రం ఖయామత్ సే ఖయామత్(1988). ఆ చిత్రం తర్వాత వీరి విజయపరంపరకు అడ్డే లేకపోయింది. కేవలం పది సంవత్సరాలలో 100 చిత్రాలకు పైగా పనిచేసిన వీరు ఎన్నో మ్యూజికల్ హిట్‌లను ఇచ్చినప్పటికీ ఇళయరాజా, లక్ష్మీకాంత్-ప్యారేలాల్ వంటి సంగీత ప్రముఖుల్ని కాపీ కొడ్తున్నారని, ఇచ్చిన ట్యూన్ మరల మరలా ఇస్తున్నారనే విమర్శను వీరు ఎదుర్కొవలసి వచ్చింది. మిలింద్ పాశ్చాత్య సంగీతంలో నిష్ణాతుడైతే, ఆనంద్ ఇండియన్ క్లాసికల్ మ్యూజిక్‌లో నిష్ణాతుడు. నదీం-శ్రావణ్, ఎ.ఆర్.రెహమాన్ లాంటి సంగీత దర్శకులు ఎన్నో ప్రయోగాలు చేస్తూ ఉంటే యే తేరా ఘర్ యే మేరా ఘర్ అంటూ సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించిన ఈ సంగీత ద్వయంతో కాసేపు.....**



ఆనంద్ - మిలింద్

**యే తేరా ఘర్ యే మేరా ఘర్...సంగీత ప్రధానమైన చిత్రం ఏమీ కాదు. అయినా ఆ చిత్రానికి అంత మంచి సంగీతం ఇవ్వటానికి ప్రేరణ ఏమిటి?**

సబ్జెక్ట్‌ను బట్టే మేం మా పనితీరును విశ్లేషిస్తాం. అయితే ఈ చిత్ర దర్శక నిర్మాతల నుండి మాకు మంచి ప్రోత్సాహం లభించటంతో మంచి సంగీతం రావటానికి వీలు కుదిరింది. అయితే సంగీతం హిట్ అయినంతగా చిత్రం హిట్ కాకపోవటంతో ఒకింత నిరాశకు గురిచేసిందనే చెప్పాలి. గతంలో మేం చేసిన లాల్ దుపట్టా మల్‌మల్‌కా, వంశ్ చిత్రాలకు కూడా ఇలాగే జరిగింది. 10 సంవత్సరాల క్రితం ప్రేమకథా చిత్రాలు వెల్లువలా వస్తున్నప్పుడు కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలలో ఒకరైన ఆనంద్‌జీ యాక్షన్, కామెడీ చిత్రాలను మిస్ కావద్దని చెపుతూ డాన్, విక్టోరియా నెం.203 లాంటి చిత్రాలను తాము ఎలా హిట్ చేసిందీ తెలిపారు. ఆయన చెప్పిన విధంగానే మేం ఇప్పటికీ చేస్తున్నాం.

**దాదాపు 4 సంవత్సరాలపాటు తెరకు దూరంగా ఉండటానికి కారణం?**

చాలా కారణాలున్నాయి. అయితే 1997లో సినీ పరిశ్రమ స్లంప్‌లో కూరుకుపోవటం ప్రధాన కారణం. అప్పటికి కూడా మేం హీరో నెం.1, మృత్యుదండ్,సప్తాహ్, జూఠ్ బోలే కౌవా కాటే లాంటి మ్యూజికల్ హిట్స్ ఇచ్చాం. అయితే దర్శక నిర్మాతల దగ్గరకు వెళ్ళి పని అడగటం మాకు తెలియదు. ఇది మా నాన్న గారి నుండి వారసత్వంగా వచ్చిన లక్షణం. ఇప్పుడెక్కడా నిర్మాతకు, సంగీత దర్శకుల మధ్య సరైన అనుబంధమే లేదు. అందుకే మంచి సంగీతం కూడా కరువైపోయింది. ఒకరు అవకాశం పొందారంటే మేం అవకాశం కోల్పోయినట్లే!

**కేవలం 5 లేదా 6 సంవత్సరాలలో 90 చిత్రాలకు పైగా చేసి చదువుకోసమో లేక దర్శక నిర్మాతల తీరును మార్చాలనో కొంత బ్రేక్ ఇచ్చామనటం సబబేనా?**

దీనితో మేం పూర్తిగా అంగీకరించం. మేం అన్ని చిత్రాలు చేయటానికి భవిష్యత్‌పై మాకున్న అభద్రతాభావమే. ఎందుకంటే మా నాన్నగారు సంగీత దర్శకుడిగా ఫెయిల్ అయిన రోజుల్లో ఈ చిత్ర పరిశ్రమ పెద్దలు వ్యవహరించిన తీరు మా కళ్ళ ముందు మెదిలేది. ప్రాణాపాయ స్థితిలో ఉన్నా డాక్టర్ దగ్గరకు వెళ్ళడానికి మా నాన్నగారు రెండు బస్సులు మారాల్సి వచ్చిందా రోజుల్లో. ఇక్కడ సక్సెస్ ముఖ్యం. 1996-97లో దాదాపు 35 చిత్రాలు మేం వదిలేసినప్పుడు, మాకు పనిపట్ల శ్రద్ధలేదని ఈ ఫిల్మీవాలాలే అన్నారు. అయితే చేసేవి తక్కువే అయినా అంకిత భావంతో పనిచేయాలని అనుకుంటున్నాము.

**ఎ.ఆర్. రెహమాన్ రాకతో సినీ సంగీతంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. 1990లలో వచ్చిన సంగీతం సంగీతమే కాదని నేటి అభిప్రాయం. మీ నుండి ఎలాంటి సంగీతాన్ని ఆశించవచ్చంటారు?**

వాయిద్యాల హోరు లేకుండా ఓ కొత్త లోకంలోకి విహరింపజేసే అద్భుతమైన మెలోడీని ఆశించవచ్చు.

**రెహ్మాన్ సంగీతంపై మీ అభిప్రాయం ఏమిటి?**

మా తర్వాత వచ్చిన కంపోజర్స్‌లో రెహమాన్ ఒక్కడే తనకంటూ ఓ ప్రత్యేకమైన శైలిని ఏర్పాటుచేసుకుని కొత్త కొత్త ప్రయోగాలు చేస్తూ వస్తున్నాడు. అయితే ఎంతమంది అతని సంగీతాన్ని ఇష్టపడుతున్నారన్నది చెప్పటం కష్టం.

**మొదట్లో మీరు కూడా దిల్, ఖయామత్ సే ఖయామత్ లాంటి చిత్రాలకు విభిన్నమైన సంగీతాన్ని ఇచ్చినప్పటికీ తర్వాత లక్ష్మీకాంత్-ప్యారేలాల్, ఇళయరాజాల బాణీలను అనుసరించటానికి కారణం ఏమిటి?**

నిజమే, మేం వారిని అనుకరించాం. మేం అప్పట్లో రీ-మేక్‌లు ఎక్కువగా చేయటం వల్ల అప్పటికే ప్రాంతీయ భాషలో హిట్ అయిన ట్యూన్స్‌నే దర్శక నిర్మాతలు, మ్యూజిక్ కంపెనీ వాళ్ళు ఇష్టపడేవాళ్ళు. మేం ఎంతో మంచి సంగీతాన్ని ఇచ్చినప్పటికీ వారు పాత దానివైపే మొగ్గు చూపటంతో తప్పని సరి పరిస్థితిలలో మేం అలా చేయవలసి వచ్చింది.

**నదీం-శ్రావణ్, రామ్-లక్ష్మణ్‌ల తర్వాత అనూమాలిక్, రెహమాన్, జతిన్-లలిత్‌లతో పోటీపడిన మీరు ఇప్పుడు కెరటాలలా దూసుకువస్తున్న యువ సంగీత దర్శకుల్ని ఏ విధంగా ఎదుర్కొంటారు?**

నిజం చెప్పాలంటే ఇప్పుడున్న వారిలో ఎక్కువ మంది అనూమాలిక్, రెహమాన్, నదీం-శ్రావణ్‌లను కాపీ చేస్తున్నారే కానీ, తమకంటూ ఓ ప్రత్యేకమైన స్టైల్‌ను ఏర్పరచుకోవటం లేదు. మా అభిప్రాయం ప్రకారం రాజేష్ రోషన్ తర్వాత ఎ.ఆర్.రెహమాన్ మాత్రమే మంచి సంగీతాన్ని ఇస్తున్నారు.

**ప్రస్తుతం మీరు చేస్తున్న చిత్రాలు?**

మూడు చిత్రాలు విడుదలకు సిద్ధంగా ఉన్నాయి. అవి రోష్నీ (ఏ తేరా ఘర్ ఏ మేరా ఘర్ నిర్మాతలదే), హర్మేష్ జీ నిర్మిస్తున్న ఖుల్లమ్ ఖుల్లా ప్యార్ కరేంగే, ఆంఖేం సే గోలిమార్ ( గోవిందా, రవీనా టాండన్). ఇవి గాక మరో 5 చిత్రాలకు పనిచేస్తున్నాం. ●

జె.పుల్లారెడ్డి సమర్పించు
శ్రీ బాలాజీ ఆర్ట్ క్రియేషన్స్

# సీమసింహం

## తారాగణం

**బాలకృష్ణ**, విశ్వనాథ్, రఘువరన్, బ్రహ్మానందం, భరణి, గౌతంరాజు, దేవన్, ఎమ్మెస్ నారాయణ, యల్బీ శ్రీరామ్, జయప్రకాష్ రెడ్డి, చలపతిరావు, చరణ్‌రాజ్, రంగనాథ్ కాస్ట్యూమ్స్ క్రిష్ణ, సిమ్రాన్, రీమాసేన్, సంగీత, కిన్నెర, అన్నపూర్ణ, శివపార్వతి, రజిత, కల్పనారాయ్, వర్ష

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేశకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'** పత్రికలో
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## సాంకేతిక నిపుణులు

కెమెరా : వియస్ ఆర్ స్వామి
స్టిల్స్ : జ్యోతికుమార్
కాస్ట్యూమ్స్ ఛీఫ్ : రమేష్
ఎడిటర్ : కోటగిరి గోపాలరావు
డాన్స్ : లారెన్స్, బృందం, రాజ్‌కుమార్, తరుణ్
ఫైట్స్ : కణల్ కణ్ణన్
ఆర్ట్ : బి. వెంకటేశ్వరరావు
మేకప్ : రాము, వాసు
స్పెషల్ ఎఫెక్ట్స్ : ప్రకాష్
జూ॥ఆర్టిస్ట్ సప్లయర్ : రవి.
ఛీఫ్ - అకౌంటెంట్ : శ్రీరామ్
క్యాషియర్ : చిన్న నాగేశ్వరరావు
మేనేజర్స్ : రాజ, జె. మూర్తి, మహంధాత, రాజు
కథ : చిన్ని కృష్ణ
మాటలు : పరుచూరి బ్రదర్స్
పాటలు : సిరివెన్నెల, భువనచంద్ర చంద్రబోస్, శ్రీనివాస్
సంగీతం: మణిశర్మ
నిర్మాతలు : జె.భగవాన్ డి.వి.వి.దానయ్య
దర్శకుడు : జి. రాం ప్రసాద్




సీమసింహం

జయంత్ ఫల్మమ్ సినర్జీస్

# టక్కరి దొంగ

## తారాగణం

మహేష్ బాబు, లిజారే, బిపాషా బసు, రసూల్‌దేవ్, తనికెళ్ళ భరణి, సూర్య, రాజు

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేశకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'** పత్రికలో
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## సాంకేతిక నిపుణులు:

రచన: సత్యానంద్
సంగీతం: మణిశర్మ
పాటలు : చంద్రబోస్, కులశేఖర్, వెన్నెలకంటి, భువనచంద్ర.
కెమెరా : జయనన్ విన్సెంట్
స్టిల్స్ : దాస్
కాస్ట్యూమ్స్ : మోహన్
ఎడిటర్ : మార్తాండ్ కె. వెంకటేష్
డాన్స్ : సరోజ్ ఖాన్, రాజు సుందరం, ప్రసన్న రాజశేఖర్
ఫైట్స్ : విజయన్
మేకప్ : రామకృష్ణ
స్పెషల్ ఎఫెక్ట్స్ : యతిరాజ్
డి.టి.యస్ : రామానాయుడు స్టూడియో
సహనిర్మాతలు : పి.సి. వసంత్, పి.సి. సుమంత్
నిర్మాత-దర్శకత్వం : జయంత్. సి.పరాంజీ




టక్కరి దొంగ

రచన: భువనచంద్ర | 1 | గానం:శంకర్ మహదేవన్, చిత్ర

అ: రెండు జెళ్ళపాప
రేణిగుంట చేప (2)
రాతిరేళ కొస్తావా
ఆ: కుర్రకారు బావ
కోరుకున్నదిస్తా
ఆరగించి పోతావా
అ: సై జోగిరి సై సై చోకిరి
వేసేయ్‌న పీట రావే పాలపీక
ఆ: కూతేయ్యరో బాకా
లేటే చేయమాకా
గిల్లనా గిచ్చనా అల్లరే చేయనా
ఆడదట్టి ఈడదట్టి
ఈడు కొల్ల గొట్టనా ॥రెండు॥
అ: ముద్దబంతి సోయగాలతో
ముచ్చటైన కానుకిస్తవా
జాజిపూల జావళీలతో...
ముద్దులకు దాటనిస్తవా
ఆ: కోరుకున్నవాడు
కొంగుపట్టుకుంటే...
కొత్త మత్తు నెత్తికెక్కదా
అ: ఊరు చేరి గువ్వ
గోల చేయమంటే
గోలుకొండ ఊయలూగదా
ఆ: సబ్బులా సోకునే
రుద్దుకో రుద్దుకో
సందెవేళ సందుచూసి
సొత్తు సొనబెట్టుకో ॥రెండు॥
ఆ: వాలు చూపు మీద ఒట్టురో
వెన్నుపూస ఒణుకుతుందిరో
లేత లిప్పు మీద వొట్టురో
తేనె కప్పు తొణుకుతుందిరో
అ: కస్సుమంటు ఆశ
ఒళ్ళు విప్పుకుంటే
కోడె ఈడు పడగలెత్తదా
ఆ: బుస్సుమన్న యవ్వనాల్ని
తట్టుకుంటే
కన్నెకోక కేక లెట్టదా
అ: నక్కతోక తొక్కినా నాగినీ నాగినీ
చీరలో చిక్కుకున్న
చుక్కబెంగ తీర్చుకో
కుర్రకారు బావ కోరుకున్నదిస్తా
ఆరగించి పోతావా
అ: రెండు జెళ్ళపాపా రెచ్చిరేగిపోతా
రాతిరేళ కొస్తావా
ఆ: సై నాయకా సై సై నాయకా
వేసెయ్యరో టీకా లేటే చేయమాకా
అ: ఊదేస్తా బాకా రావే పాలపీక
ఆ: అక్కడే గిచ్చుకో అల్లరే చేసుకో
ఆడనుంది ఈడబెట్టి
ఈడు కొల్లగొట్టుకో ॥కుర్రకారు॥



రచన: చంద్రబోస్ | 6 | గానం:శంకర్ మహదేవన్

మంచితనం ఇంటిపేరు
మొండితనం ఒంటిపేరు
కొత్తదనం కొసరుపేరు
తెలుగుదనం అసలుపేరు
ముక్కుసూటితనం మారుపేరు
ఆవేశం నా పేరు ఇక నన్నెవరు ఆపేరు
ఆత్మ విశ్వాసం నా పేరు ఇక నన్నెవరు ఆపేరు
అన్యాయంపై దూకే సింహం నీనౌతా
అంధకారమును చీల్చే సూర్యుడు నేనౌతా
ఆకలెట్టు అన్నోళ్ళకి అన్నం నౌతా
ఆడ పడుచులందరికీ మరో అన్ననౌతా
మనిషీ ఏనాడు రెండుసార్లు చావడు
మనిషీ ఏనాడు రెండుసార్లు చావడు
చచ్చేలోగా ఏదో సాధించక తప్పదు
ఉత్తేజం నాపేరు ఇక నన్నెవరు ఆపేరు
హే... ఉద్వేగం నాపేరు ఇక నన్నెవరు ఆపేరు ॥మంచి తనం॥
కన్నీటిని తుడిచేందుకే ఉన్నది నాచేయి
కన్నతల్లి ఋణం తీర్చేందుకె ఉన్నది నా బ్రతుకు
కొందరికే అందుతోంది గూడు గుడ్డ కూడు
అందరికీ పంచేందుకు వేస్తా నే ముందడుగు
మడమే తిప్పనని పట్టాను దీక్ష (2)
మనకందరికీ ఉంటుంది రామయ్య రక్ష
నిస్వార్థం నాపేరు ఇక నన్నెవరు ఆపేరు
నిజాలన్నీ నా పేరు ఇక నన్నెవరు ఆపేరు ।మంచితనం॥



రచన: చంద్రబోస్ | 1 | గానం:శంకర్ మహదేవన్

ప: నలుగురికీ నచ్చినది నాకసలె ఇక నచ్చదురో
నరులెవరు నడవనిది ఆ రూట్లో నే నడిచెదరో (2)
పొగరని అందరు అన్నా అది మాత్రం నా నైజం
తెగువని కొందరు అన్నా అది నాలో మేనరిజం
నిండు చందురుడు ఒకవైపు చుక్కలు ఒకవైపు
నేను ఒక్కడిని ఒకవైపు లోకం ఒకవైపు (2) ॥నలుగురి॥
చ: నువ్వు నిలబడి నీళ్ళు తాగడం నథింగ్ స్పెషల్
పరుగులెత్తుతూ పాలు తాగడం సంథింగ్ స్పెషల్
నిన్ను అడిగితె నిజం చెప్పడం నథింగ్ స్పెషల్
అప్పుడప్పుడు తప్పు చెప్పడం సంథింగ్ స్పెషల్
లేని వాడికి దానమివ్వడం నథింగ్ స్పెషల్ (2)
ఉన్న వాడిని దోచుకెళ్ళడం సంథింగ్ స్పెషల్ ॥నలుగురి॥
చ: బుద్ధి మంతుడి బ్రాండు దక్కడం నథింగ్ స్పెషల్
పోకిరోడిలా పేరు కెక్కడం సంథింగ్ స్పెషల్
రాజ మార్గమున ముందుకెళ్ళడం నథింగ్ స్పెషల్
దొడ్డి దారిలో దూసుకెళ్ళడం సంథింగ్ స్పెషల్
హాయి కలిగితే నవ్వు చిందడం నథింగ్ స్పెషల్ (2)
బాధ కలిగినా నవ్వుతుండడం సంథింగ్ స్పెషల్ ॥నలుగురి॥

రచన: వెన్నెలకంటి | 2 | గానం: టిప్పు, కల్పన

ఆ: హే మామా మామా మామా హేహే మామా వచ్చాడే వాస్కోడిగామా
హై మామా మామా మామా హైహైమామా చేశాడే నాటీ హంగామా



అ: ఊయలల్లే ఊగే నీ నడుమే ముద్దు
ఆ: హమ్మ హమ్మ హమ్మ సితం ఆగాలమ్మా ॥బాగుందమ్మా॥
అ: వెచ్చటి గుండెల చప్పుళ్ళో నాకంటి రెప్పల్లో
పదిలంగా వుందో యమ్మ నీ రూపమే
ఆ: పున్నమి వెన్నెల కాంతుల్లో ఆ మబ్బు డొంకల్లో
రేయంతా వెతికానమ్మా నీ కోసమే
అ: అమ్మాయి బుగ్గల్లో మందారం మొగ్గల్లే
దోబూచు లాడుతున్న సిగ్గే ముద్దు
ఆ: ఒద్దూ ఒద్దూ ఒద్దూ నను కవ్వించొద్దు
మోమాటాలే ఒద్దూ గిలిగింతే ఒద్దు ॥బాగుందమ్మా॥
ఆ: ఉక్కిరి బిక్కిరి అవుతున్నా నేనెంత కాదన్నా
నీలోనే చెప్పిందమ్మా నా ఊపిరి
అ: ఎప్పుడు ఎప్పుడు అనుకున్నా ఈ రోజే చూస్తున్నా
నాకెంతో నచ్చిందమ్మా నీ వైఖరి
ఆ: ఛీ పాడు సిగ్గన్నా సూదంటు రాయేలే
కుచ్చెళ్ళు లాగేస్తున్న చూపే ముద్దు
అ: ముద్దు ముద్దు ముద్దు నీ నడుమే ముద్దు
ఆ: విప్పొద్దయ్యో నువ్వు మరి చికాకొద్దు
అ: బాగుందమ్మా బాగుంది అమ్మాయి నీ ముద్దు
ఆ: మళ్ళీ మళ్ళీ అంటాను అబ్బాయి చంపొద్దు
అ: ఊయలల్లే ఊగే నీ నడుమే ముద్దు
ఆ: హమ్మ హమ్మ హమ్మ సితం ఆగాలమ్మా

అ: అంది పుచ్చుకుంటా
ఆ: అడిగింది ఇచ్చుకుంటా
అ: కాలు దువ్వుతూ కయ్యమాడుతూ కాలక్షేపం చాలే రమ్మంటా
ఆ: కళ్ళతోనే కంచెలన్ని కత్తరించి చూపించు నీ సత్తా
అ: నిన్ను చూస్తే మరి రెచ్చిపోతున్నది ॥అవ్వా॥
ఆ: కన్నుమూస్తే సరి పచ్చి కలలైనది

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి **5** గానం: హరిహరన్, సుజాత

ఆ: చందమామా చందమామా అంత దూరం ఎందుకమ్మా
అ: కన్నెభామా కన్నెభామా ఆపవే హంగామా
ఆ: హాయ్ రామా అందుకోమ్మా అలుసా చెలి ప్రేమా
అ: అయ్యో రామా తట్టకమ్మా కులుకుల చలిచీమ
ఆ: తగదమ్మా మగజన్మ మొగమాటమా ॥చందమామా॥
అన్నీ ఇస్తా అన్నాగా ఆత్రంగా అవుననకా
ఆలోచిస్తానంటావా అంతు చూడకా అ...
అ: అంతో ఇంతో బిడియంగా తలవంచుకు నిలబడతా
కొంచెం పొంచుకు వస్తావా ముందు వెనక చూడక
ఆ: సిగ్గే చిక్కబడి తప్పుకుంది చాటుగా
అ: మబ్బే వెంటబడి అంటుకోకే అన్యాయంగా ॥చందమామా॥
కొంచెం అలవాటయ్యాకా రెచ్చిపోతే పద్ధతిగా
అంతేగాని ఇంతిదిగా ఇదేం వేడుకా...
ఆ: మీసం రోషం నచ్చాకే మనసిచ్చా ముచ్చటగా
మీనం మేషం ఎక్కడికో జారిపోకు చల్లగా
అ: సరదా తీరుస్తా సత్తువెంతో చూడవే
ఆ: పెదవే అందిస్తా ఆ మాటలాపి ముందుకు రావే
అ: కన్నెభామా కన్నెభామా ఆపవే నీ హంగామా
ఆ: చందమామా చందమామా అంత దూరం ఎందుకమ్మా
అ: తగ్గువమ్మా తగువాడే చెలగాటమా



రచన: సిరివెన్నెల **2** గానం:బాలు, కవితా సుబ్రహ్మణ్యం

ఆ: కోకా రైకా హుషారుగా
కో అంటున్నవయ్యో
ఆకు వక్క అందించగా
నీ ముందున్నవయ్యో
అ: కోకా రైకా గమ్మత్తుగా
ఏం కవ్వించెనమ్మో
ఆకు వక్క పండించగా
నే వస్తాను లేమ్మో
ఆ: తారంగా గారంగా
ముద్దిస్తా మురిపెంగా
అ: సిద్ధంగా ఉన్నాగా
ఆ సంగతి చూడగా
ఆ: బాలయ్యో ఏం గోలయ్యో
అ: గౌరమ్మో ఏం జోరమ్మో ॥కోకా॥
అ: పిల్లో నావళ్ళో తల్లడిల్లి పోతావే
గిల్లే అల్లర్లో గొల్లు గొల్లు మంటావే
ఆ: అందే స్వర్గంలో
అంతు చూడనంటావే
సిగ్గే బెదిరేలా
బుగ్గ చిదమనంటావే
అ: నీ మొటిమలో ఏం కిటుకులో
నా మడికాస్తా చెడుతోందే
ఆ: నీ చిటికెలో ఏం గుటకలో
ఈ చెవిలో చెప్పి తడుతోందే
అ: నీ నవ్వుతో నా గుండెతో
గవ్వలు ఆడకే
ఆ: బావయ్యో ఏం గోలయ్యో
అ: గౌరమ్మో ఏం జోరమ్మో
ఆ: నా నడుమొంపుల్లో
తూగే పడవైపోవా
గుట్టుగా నా మెళ్ళో
గొలుసులాగ దాక్కోవా
అ: చుట్టే చేతుల్లో
బెట్టు వదులుకుంటావా
పుట్టే తిమ్మిరిలో
పట్టు తప్పి పడిపోవా
ఆ: నా నడుముతో చెయ్ కలపకే
నువ్ వడ్డాణం ఐపోవా
అ: కన్నెరుపుతో నిన్నిమిరితే
వెన్నదిరి బెదరనంటావా
ఆ: దండగా ఈ ఎండలో
చలి కాగించవా ॥గౌరమ్మో॥

రచన: శ్రీనివాస్ **3** గానం: మనో, రాధిక

అ: పోరి హుషారుగుందిరో హైటేమో ఆరుందిరో (2)
శారి సూపరుగుందిరో పైటేమో బాగుందిరో
ఆ: రారా నా గుండెగుంట రాతిరంతా మేలుకుంటా
రింగే పెట్టేసికుంటా రాజులాగ చూసుకుంటా



ఏస్కోరా నాతో భేటీ చేసుకోనా బ్యూటీ లూటీ
అందంలో నేనే నాకు సాటి ॥అలేబా॥
ఆ: కన్నె ఒంపుల్లోనా ఉన్నాదోయ్ సుఖం
అలేబా అలేబా అలేబా అలేబా
తడిమే చూపుల్తో నా అంగాంగము
అ: ఓసి నంగనాచి ఇదేం సంగతి
తేనెకళ్ళ బూచి నాతోనా పేచి ॥అలేబా॥
ఆ: అవునంటే కులికేస్తా కాదంటే కరిచేస్తా
ఒడికొస్తే వెచ్చని ముద్దే ఇస్తా
అ: పోపోవే కొరకంచు నీ వగలు చాలించు
తలకెక్కిన కైపును కాస్తా దించు ॥అలేబా॥
అ: కన్నెపిల్లా గుర్రం ఒకటేలే మనసా
పడకుంటే కళ్ళెం మానవులే నసా ॥అలేబా॥
ఆ: రౌతు నవుతానంటే నీదాన్నైపోనా
కలకాలం రాజాతో గిలి నైపోనా
అ: అట్టాగే దొరసాని చూశానే సరదాని
పలికిస్తా రావే నీ తబలానీ... ఓ
ఆ: అసలే నే పసిదాన్ని అపైనా కసిదాన్ని
నిన్నొదలను ఏమైనా ఐపోనీ ॥అలేబా॥
అ: అలేబా అలేబా అలేబా చూపిస్తా రారా రా నాదెబ్బ

రచన: కులశేఖర్ **5** గానం:యస్.పి.చరణ్, ఉష

అ: బాగుందమ్మా బాగుంది అమ్మాయి నీ ముద్దు
ఆ: మళ్ళీ మళ్ళీ అంటాను అబ్బాయి చంపొద్దు



అ: లక్కీ సో లక్కీ నిను చూశానులే
దిక్కి డీడిక్కి ఆడేశానులే
ఆ: లుక్కే నీ లుక్కే హుక్కేసిందిలే
చుక్కే ఎంచక్కా పక్కేసిందిలే
అ: సోనా సోనా సుల్తానా ఆడే ఉల్టానా
నిన్నే వీడి వెళ్తానా ముద్దుకోరి వద్దచేరనా
ఆ: జీనా మర్‌నా ఏమైనా నీదే ఈ మైనా
సోకే నీకే నజీరానా నాదిందిన్న
ఆ: ॥హే మామా॥
అ: హే మామా మామా మామా హేహే మామ వచ్చాడే వాస్కోడిగామా
హైమామా మామా హై హై మామా చేశాడే నాటీ హంగామా
శాంతి మస్తాని షో స్టార్ట్ చెయ్యనీ
సో నీ సోగ్గాణ్ణి అవి చూపేయనీ
ఆ: మేడం వచ్చాడు సై జంపాలురో
హీరో నా హీరో ఇక నువ్వేనురో
అ: ఆజ ఆజా నా రోజా చెయ్యాలే పూజ
తాజా తాజా కౌగిళ్ళ తపనల తకధిమిలో
ఆ: లేజా లేజా లే రాజా ఉందా కలేజా
ఐసా పైసా తేల్చేస్తా కాస్కో మచ్చా ॥హే మామా॥
అ: హల్లో హాయ్ పిల్లో నా కల్లోకిరా
పిల్లా ఆ... పిల్లా నా ఒళ్ళోకిరా
ఆ: మల్లా ఔ మల్లా నా గల్లీకిరా

అ: పళ్ళు పాలన్ని తాగి పాట కచ్చేరేసుకుంటా ॥పోరి॥
ఆ: జాలి లేద బ్రహ్మకింత పిల్లదా
ఎందుకింత అందమంటే విన్నాడా... విన్నాడా
అ: నారు పోసినోడు నీరు పొయ్యడా
తుంగ మొక్కలడ్డమొస్తే తియ్యడా... తియ్యడా
ఆ: మా చెట్టుకుంది రెండు పళ్ళంటా
తుంచుకొచ్చినోడు నా కింగంటా
అ: ఆ మాట అంటే నే ముందుంట
అంతకంటే లేదు మంచి విందంట
ఆ: అమ్మో ఈ రంగముల్లు ముట్టుకుంటే తుమ్మముల్లు
పట్టే పిస్తోలు గుళ్ళు ఒక్కసారి గుండెజల్లు
అ: పాదం కేశాల దాక పాకిపోయే పాడు కళ్ళు ॥పోరి॥
అ: చిట్టిగారెలొండుతున్న చిట్టెమ్మో
చిన్నగాడి ఇంత తుంచి పెట్టమ్మో పెట్టమ్మో
ఆ: పుట్టెడన్ని బుద్ధులున్న పిల్లడా
ఆ బుద్ధుడంటే గిట్టదా పిల్లడా... పిల్లడా
అ: సంకురాత్రి సంబరంగా వస్తాలే
సోకు మీద శాండిలేసి పూస్తాలే
ఆ: జూను ఎండలాగా నువు హీటేలే
కొత్త కుండ వుంది నాది నీకేలే
అ: అమ్మో దానిమ్మపండా కమ్మగుంటే ఇంక తింటా
గుమ్మో నీ మాట యింట గండిపేట ఈదుకుంటా
ఆ: చుట్టూ చుట్టేసుకుంటే చాకిరేవు పెట్టుకుంటా ॥పోరి॥
అ: పోరి హుషారుగుందిరో హైటేమో ఆరుందిరో
ఆ: ఓరి నైజాము పోరడో సీమ సింహం నువ్వేరో
అ: రావే నా వెండిగుత్త రాతిరంతా మేలుకుంటా
ఆ: రింగే పెట్టేసుకుంటా రాజులాగా చూసుకుంటా
అ: పళ్ళు పాలన్ని తాగి పాట కచ్చేరేసుకుంటా ॥పోరి॥



రచన: సిరివెన్నెల **4** గానం:ఉదిత్‌నారాయణ్, స్వర్ణలత

అ: అవ్వా బువ్వా కావాలంటే ఎట్టాగమ్మో
ఆ: అవ్వీ ఇవ్వీ ఇస్తానంటే బెట్టేందయ్యో ॥అవ్వా॥
అ: నన్ను చూస్తే మరీ రెచ్చిపోతున్నది
ఆ: కన్ను మూస్తే సరి పచ్చి కలలైనది
అ: ఇన్నాళ్ళూ ఏమైందో వంటిలో తిమ్మిరి
ఆ: నీ వల్లే రేగింది తెలుసుకో తుంటరి ॥అవ్వా॥
అ: గుప్పుమంది పిట్టా నీలో చెప్పరాని మంట
ఆ: ఒప్పుకుంటానంటే నీకే ఒప్పుచెప్పుకుంటా
అ: తప్పు చేయమంటే ఎట్టా పట్టపగటిపూట
ఆ: రెప్ప మూసుకుంటే అంతా చిమ్మ చీకటంటా
అ: చప్పుడెందుకంటా
ఆ: ఎప్పుడెప్పుడంటా హే
అ: అష్ట దిక్కులు ఆలకించగా మోగించాలా ముద్దుల జేగంటా
ఆ: మోత లెందుకంటా
అ: కంగారు దేనికంటా
ఆ: వేడి వేడిగా వాడివాడిగా సాగిస్తావా లేదా ఈ వేట
అ: కాలికేస్తే వేలికేస్తూ గోల చేస్తే చెడతావే జాగర్త
ఆ: కన్నుమూస్తే సరి పచ్చి కలలైనది
అ: నిను చూస్తే మరీ రెచ్చిపోతున్నది ॥అవ్వా॥
ఆ: రుస్సు రుస్సురంది తాపం మూసికోనిదంటా
అ: కస్సు బుస్సు అందే కోపం ఎవరి మీదనంటా
ఆ: మాయదారి ప్రాయం మోస్తూ ఎంత కాలమంటా
అ: చేతనైన సాయం చేస్తా చేరుకోవే జంట
ఆ: నిన్నే నమ్ముకుంటా
అ: సై అంటే కమ్ముకుంటా
ఆ: నీట ముంచినా పాల ముంచినా ఈపై నీదే భారమ్మనుకుంటా



గుల్లా రసగుల్లా ఒడి బళ్ళోకిరా
అ: గోలా గోలా రంగోలా గోలే చెయ్యాలా
గోడ దూకే నీ ఈడు ఆడమంది రాసలీలా
ఆ: హొల్లా హొల్లా ఉయ్యాల ఊగించెయ్యాలా
వేళా పాళా లేదింక వేసెయ్ ఈలా ॥హైమా॥

రచన: కులశేఖర్ **3** గానం:యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ప్రసన్న

ఆ: హేహే హేహే తనన (2)
చుక్కల్లో చంద్రుడీ చిన్నోడు
సూపుల్లో సూర్యుడీ సోగ్గాడు
అ: ముద్దొస్తూ వున్నవే అమ్మాయి
మోగించెయ్ మంటవా సన్నాయి
ఆ: సింగంలా దూకరా మగధీరుడా దమ్మెంతో చూపరా పగధీరుడా
అ: మాటల్తో చంపకే ఓ బాలికా
వస్తాలె కాసుకో నీ ఓపిక
ఆ: హలో ఐసలకిడి బావా నేను సోకులకిడికోవా
వద్దనకా ముద్దులతో మురిపించవా
అ: హలో పిట్ట నడుము పిల్లో నీవాలు చూపు వల్లో
నేను మరి తేలికగా పడిపోనల్లా
ఆ: చుక్కల్లో చంద్రుడీ చిన్నోడు
అ: ముద్దొస్తూ వున్నవే అమ్మాయి
పాల పొంగు పాప తెగ రువ్వకే నవ్వు
నీలి కళ్ళ చేప వల వెయ్యకే నువ్వు
ఆ: గాలిలాగ వచ్చి నను తాకితే నువ్వు



మాయదారి మోహం వణికించదా నవ్వు
అ: ఇద్దరి కథ యివ్వాళే పెంచెయ్యకు
విచ్చలవిడి దుకాణం పెట్టెయ్యకు
ఆ: హత్తెరి మన యవ్వారం పెంచెయ్యకు
అద్దిరిపడి గుడారం దించెయ్యకు ॥హలో పిట్ట॥
టిప్పు టాపు బావ మొహమాటమే లేదు
అప్ టు డేటు గుంటే డౌటన్నదే రాదు
అ: రాలుగాయి పిల్ల చెలగాటమే వద్దు
కాలు జారకుండ మనకుందిలే హద్దు
ఆ: కష్టమనకు ఓరయ్యో ఈ పూటకు
ఇష్ట సఖిని ఇలాగే జోకొట్టకు
అ: కూత పెరిగెనివ్వాళే ఈ పిట్టకు
తోడు పెరుగునివ్వాళే నా పెట్టకు
ఆ: ఇలా చూడు టక్కరి దొంగ చెలి ఈడుకి తెగ బెంగ
చేరేటి సిగ్గులకే సెలవే యిక
అ: హలో హంస నడక పిల్లో సిరిమల్లెల చిరుజల్లో
ఇప్పుడిక తప్పదిక తొలి వేడుక ॥ఇలా॥

రచన: భువనచంద్ర **4** గానం: కె.కె.కల్పన

ఆ: అలేబా... అలేబా... అలేబా బా బా అలేబా
ఏందబ్బా రారబ్బా ఏస్తాలే లేలే గుడుంబా
ధగధగలాడే కళ్ళు నిగనిగలాడే ఒళ్ళు
సలసలసల కాగే వయసు నీదే

# సామాన్యుడికి జరిగిన అసామాన్య సత్కారం




**గత పక్షం డిసెంబరు 18న పుణెలో ఒక అద్భుతం జరిగింది. ప్రపంచ చరిత్రలో ఎక్కడా జరగని విధంగా ఒక కార్టూన్ క్యారెక్టరుకు అక్షరాలా శిల్పాభిషేకం జరిగింది. అదీ భారత ప్రథమ పౌరుడి చేతుల మీదుగా! ఆర్కే లక్ష్మణ్ కార్టూన్లలో కనిపించే కామన్ మాన్‌ను 8 అడుగుల కంచు విగ్రహంగా మలిచి సింబయోసిస్ ఇంటర్నేషనల్ కల్చర్ అండ్ ఎడ్యుకేషన్ సెంటర్ ఆవరణలో స్థాపించడం జరిగింది.**

కామన్‌మాన్ సృష్టికర్త ఆర్.కే.లక్ష్మణ్ (రాశిపురం కృష్ణస్వామి లక్ష్మణ్), 'టైమ్స్ ఆఫ్ ఇండియా' కార్టూనిస్టుగా జగద్విఖ్యాతి పొందారు. ప్రముఖ రచయిత ఆర్.కే.నారాయణ్ (స్వామి అండ్ ఫ్రెండ్స్, గైడ్ ఇత్యాది నవలల రచయిత) తమ్ముడిగా, ఆయన నవలలకు, కథలకు తన బొమ్మల ద్వారా ప్రాణప్రతిష్ట చేసిన ఘనుడు. నారాయణ్ మాల్గుడి అనే ఒక ఊహా నగరాన్ని, దానిలోని రకరకాల జనాలను కలం ద్వారా సృష్టిస్తే, వారెలా ఉంటారో, ఆ పరిసరాలెలా ఉంటాయో తనకుంచె ద్వారా వెలువరించి ఆ అన్నకు దీటుగా వచ్చే తమ్ముడని నిరూపించుకున్నారు.

బొమ్మలు వేయడమే కాక లక్ష్మణ్ స్వయంగా రచయిత కూడా. 'ఏక్సిడెంట్' వంటి క్రైమ్ కథలు, తన శైలిలో రాసినా 'సారీ, నోరూమ్' వంటి వ్యంగ్య నవలలో అన్నగారి పోకడలు పోవడం జరిగింది. చక్కటి చిత్రకారుడు, క్యారికేచరిస్టు అయిన లక్ష్మణ్ తన కార్టూన్లలో వాతావరణాన్ని నాలుగు గీతలతో సరిపెట్టకుండా విపులంగా చిత్రీకరిస్తారు.

1947లో 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా'లో కెరియర్ ఆరంభించిన లక్ష్మణ్ అర్థశతాబ్ది దాటినా ఆ సంస్థనే అంటి పెట్టుకుని ఉన్నారు. ఆ పత్రిక మొదటి పేజీలో కనబడే పాకెట్ కార్టూన్ శీర్షిక పేరు 'You Said it'. ఆ పాకెట్ కార్టూన్ ద్వారా సంఘాన్ని, రాజకీయాల్ని విమర్శించడానికి ఆయన ఎంచుకున్న పాత్ర కామన్‌మాన్. 50 ఏళ్ల క్రితం నాటి గుమస్తాలు ధరించే దుస్తులు ధరించిన మధ్య వయస్కుడి పాత్రను ఆయా సంఘటనలకు సాక్షిగా నిలబెట్టారు. అతడు మాట్లాడడు - కళ్ళప్పగించి చూసి విస్తుపోవడమే అతని పని. అందుకే జన సామాన్యం లోని ప్రతీ వ్యక్తీ ఆ బొమ్మలో తనను తాను ఊహించుకోవడం జరిగింది. ఆ ఐడెంటిటీ వల్లనే కామన్‌మాన్‌కి అంతపేరు.



కామన్‌మాన్ విగ్రహావిష్కరణోత్సవంలో రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్, కార్టూనిస్టు ఆర్.కె.లక్ష్మణ్ తదితరులు

నిర్భయానికి, నిజాయితీకి పేరుబడ్డ లక్ష్మణ్ తన కార్టూన్ల ద్వారా మేధావుల ప్రేమను, ఆదరాన్ని చూరగొన్నాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశాన్ని విడిచి వెళుతున్న లార్డ్‌మౌంట్ బ్యాటెన్ ఇకపై లక్ష్మణ్ కార్టూన్లను చూడలేమని వాపోయారట. 50 ఏళ్లకు పైగా నిరంతరంగా, పాఠకులకు బోరు కొట్టకుండా ఆ శీర్షికను నిర్వహించగలిగిన అసామాన్య ప్రతిభాశాలి లక్ష్మణ్. ఆ కామన్‌మాన్‌ను ముఖ్యపాత్ర చేసి తీసిన టీవీ సీరియల్ 'వాగ్లే కీ దునియా' కూడా హిట్ అయింది. దానినే తెలుగులోకి 'అమాయక చక్రవర్తి' పేర అనువదించారు.

తమాషా ఏమిటంటే కామన్‌మాన్ పాత్ర ద్వారా లక్ష్మణ్ ఎద్దేవా చేసిన రాజకీయ నాయకులందరూ ఆనాటి ఫంక్షన్‌కి హాజరయి లక్ష్మణ్‌ను ఆకాశానికి ఎత్తేశారు. సౌమ్యతకు పేరుబడ్డ రాష్ట్రపతి కె.ఆర్.నారాయణ్ తన చైనా పర్యటన సందర్భంగా లక్ష్మణ్ తనపై వేసిన కార్టూన్లను సభలో చెప్పి నవ్వించారు కూడా! ●

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త,
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు
**శ్రీ ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్‌నెం.040-7402993

## ఆనందమే లేదా లోకమున

**ఆనందమేలేదా లోకమున**
**ఆనందమే లేదా**
**ప్రకృతి అందముల పరికించుటలో**
**ఇంపగు యీ సెలయేటి గానముల ॥ఆనందమే॥**
**1. పొంగెడు ఆశలు పురిగొల్పగుమది ॥ఆనందమే॥**
**2. భగవంతుని మది భక్తి పాడగను ॥ఆనందమే॥**



రచన : బసవరాజు అప్పారావు
సంగీతం : సాలూరి రాజేశ్వరరావు
గానం : ఎస్.వరలక్ష్మి, రాజేశ్వరరావు

రాగం : సింధుభైరవి (కర్ణాటక సం॥)
తాళం : చతురశ్ర ఏక (క.సం॥)
భైరవి (హిందుస్తాని సం॥)
కహరువా (హిం. సం॥)
ఆరోహణ : స రి గ మ ప ద ని స
అవరోహణ: స ని ద ప మ గ రి స

షడ్జమం, శుద్ధరిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశికినిషాదం - ఈ స్వరాలే ఆరోహణ, అవరోహణాల్లో వుంటాయి. ఇవేగాక చతుశ్శృతి రిషభం, ప్రతిమధ్యమం, చతుశ్శృతి దైవతం కూడా యీ రాగంలో వాడబడతాయి. కనుక యీరాగంలో 10 స్వరాలుంటాయి.

కర్ణాటక సంగీతంలో సింధుభైరవిని శాస్త్రీయ రాగంగా పరిగణించరు పండితులు. దీనిని లలిత శాస్త్రీయ రాగంగా వ్యవహరిస్తారు. యీ రాగంలో సంగీత త్రిమూర్తులైన త్యాగరాజు, దీక్షితర్, శ్యామశాస్త్రి గార్ల రచనలేవీ కానరావు.

కాని హిందుస్తాని సంగీతంలో యిది చాలా ప్రముఖమైన శాస్త్రీయ రాగంగా భావించబడుతుంది.

లలిత సంగీతానికి మాత్రం యీ రాగం ఎంతో అనుకూలమైనదీ, ఉపయోగకరమైనదీ కావడం చేత యీ రాగంలో వేలకొలదీ పాటలు రూపు దిద్దుకున్నాయి. తెలుగు జానపద సంగీతంలో కూడా కొన్ని గేయాలు యీ రాగంలో వున్నాయి. తెలుగులోనే కాక భారతదేశంలోని దాదాపు అన్ని ప్రాంతీయ భాషలలోనూ యీ రాగంలో గీతాలు మనకు కానవస్తాయి. బాగా ప్రచారంలోనూ, వాడుకలోనూ వున్న రాగాలలో సింధు భైరవి కూడా ఒకటి.



## ఎస్.వరలక్ష్మి

తెలుగు చలన చిత్రరంగం ప్రారంభ దశలో వచ్చిన నటీనటులందరూ చిత్రాలలో వారు నటించే పాత్రలకు వారే పాటలు పాడుకొనేవవారు. అటువంటి నటీనటులలో నాగయ్య, పి.భానుమతి, ఎస్.వరలక్ష్మి గార్లను ప్రముఖంగా చెప్పుకోవాలి. చిత్రాలలో నటించినంత కాలమూ తమ పాటలు తామే పాడి నటనలోనే కాక సంగీతంలోనూ కూడా తమ ప్రత్యేకతను, విశిష్టతను ప్రదర్శించిన ప్రతిభామూర్తులయిన గాయనీమణులు పి.భానుమతి, ఎస్.వరలక్ష్మి. ఎటువంటి పాటనైనా, ఎంత క్లిష్టమైన, కష్టమైన సంగతులు, గమకాలతోఅలరారే గీతాలపైన అవలీలగ పాడగలిగిన గాత్రాలు వారివి.

ఎస్.వరలక్ష్మి చలన చిత్రాలలోనే కాక ఆకాశవాణిలో కూడా ఎన్నో పాటలు పాడారు. "ఊపరే ఊపరే ఉయ్యాల", "గణగణ గణగణజయగంటా" మున్నగు గీతాలు అనేకసార్లు ఆకాశవాణిలో ప్రసారమై బహుళ ప్రచారం పొందినవి. కర్ణాటక సంగీత పద్ధతిలోనైనా, హిందుస్తానీ సంగీత పద్ధతిలోనైనా సంగతులు ఆమె గాత్రంలో చాలా స్పష్టంగాను, నిర్దుష్టంగాను పలుకుతాయి. ఆమె రాజేశ్వరరావు గారితో కలిసి పాడిన "ఆనందమే లేదా లోకమున" అనే గీతం ప్రజల హృదయాలలో సుస్థిర స్థానాన్ని పొందిన గీతాలలో ఒకటి. ఈ పాటలో రాజేశ్వరరావుగారు సింధు భైరవి రాగాన్ని వాడిన విధానం గమనిస్తే ఆయన జీనియస్ అందులో కనిపిస్తుంది. 1940వ దశకంలోని చివరి భాగంలో యీ పాట బేసిక్ రికార్డుగా వచ్చినట్లు నాకు గుర్తు. లలిత సంగీతంలో అంతగా టెక్నిక్స్ అభివృద్ధి కాని ఆ రోజులలో ఆయన ఆర్కెస్ట్రాను వాడిన తీరు, పల్లవిని ప్రతిచోటా కౌంటర్ లాగా వరలక్ష్మి గాత్రంతో కలిపి పాడడం అప్పట్లో వినూత్న సృష్టేమరి. లలిత సంగీతంలో ఆయన అప్పటికే ఎన్నో కొత్త ప్రయోగాలు చేశారు. శాస్త్రీయ సంగీత పద్ధతిలోని రాగస్వరూపానికి, యితర నియమ నిబంధనలకు, కట్టుబాట్లకు పరిమితం కాకుండా, రాగాన్ని అనేక కోణాలనుండి దర్శించి, అవసరమైన రససిద్ధి కోసం రాగంలో స్వతంత్ర స్వరసంచారాలు, అన్యస్వర ప్రయోగాలు మొదలైనవి చేశారు. అలా ఎన్నో పాటలకు బాణీలను కూర్చారు. ఈ పాటలో పల్లవిలో సింధుభైరవిలోని స, రి, గ, ప, ద స్వరాలనే ఎక్కువగా వాడుకుంటూ కొత్తదనాన్ని చేకూర్చారాయన.

స, రి, గ, ప, ద, స - ఈ స్వరాలు ఆరోహణ, అవరోహణగా వుండే రాగం భూపాలం. ఇప్పుడు అంతరగాంధారంతో



# బసవరాజు అప్పారావు

ప్రముఖ భావ కవులలో ఒకరైన బసవరాజు అప్పారావుగారు 1894లో జన్మించారు. విజయవాడలో హైస్కూలులోను, మద్రాసులో ప్రెసిడెన్సీ కళాశాలలోను చదువుకొని బి.ఏ. పట్టాను పొందారు. చిన్నతనం నుండే ఎన్నో ఒడుదుడుకులకు లోనైన అప్పారావు గారు మద్రాసులో 'ఆంధ్రపత్రిక' 'భారతి' సంపాదక వర్గంలో చేరి కొంతకాలం పని చేశారు. ఆ సమయంలోనే అప్పారావు గారింట్లో తరచూ మహాకవులైన రాయప్రోలు, దేవులపల్లి, బాపిరాజు, నండూరి మొదలగు వారు

వాడుకలోనున్న భూపాలరాగం పూర్వం సాధారణ గాంధారంతో పాడబడేదట. దీనినే హిందుస్తానిలో 'భూపాల్‌తోడి' అని పిలుస్తారు. సింధు భైరవిలోని చతుశ్రుతి రిషభం, శుద్ధ, ప్రతిమధ్యమాలు, కైశికి నిషాద స్వరాలను అక్కడక్కడ కలుపుకుంటూ యీ పాటకు చాలా హృద్యమైన బాణీని కూర్చారు. స్వరకర్త పాటంతా విన్నాక కూడా హృదయంలో సరిగపదస అన్న భూపాల రాగస్వరాలే మొదలుతూవుంటాయి. ఇదీ యీ పాటలోని విశిష్టత.

ఎన్.వరలక్ష్మి చిత్రాలలో పాడిన "పతిరూపమునీయరయా" ("బాలరాజు") "శ్రీదేవిని నీదుదేవేరిని" (శ్రీవేంకటేశ్వర మహాత్మ్యం"), "తిరుమల తిరుపతి వేంకటేశ్వరా" ("మహామంత్రి తిమ్మరుసు"), ''నమోభూత నాథా నమోదేవదేవా'' ("సత్యహరిశ్చంద్ర") మొదలగు పాటలు తెలుగువారు ఎన్నటికీ మరువలేనివి.



కలుసుకుంటూండేవారు. కవితా గోష్టులు జరుగుతూండేవి.

బసవరాజుగారు రచించిన అనేక గీతాలు ఆకాశవాణి ద్వారాను, పత్రికల ద్వారాను బహుళ ప్రచారాన్ని పొందాయి. ఆ తరువాత ప్రైవేటు రికార్డులుగా రాజేశ్వరరావు, టంగుటూరి సూర్యకుమారి మొదలగువారి కంఠాలలో అనేక గీతాలు వెలువడినాయి. బసవరాజుగారి సతీమణియైన రాజ్యలక్ష్మమ్మగారు కూడా "సౌదామిని" అనే పేరుతో ఎన్నోగీతాలు వ్రాశారు.

అప్పారావుగారు రచించిన "ఆకసమున చిరుమబ్బుల చాటున", "అమ్మాభూదేవి" పాటలను మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో పాడి, ఆ తరువాత వాటిని హైదరాబాదు కేంద్రంలో 1957లో నా చేత పాడించారు. బసవరాజుగారు రచించిన "గుత్తివంకాయ కూరోయ్ బావా" అనే పాటను బందా కనకలింగేశ్వరరావుగారు గ్రామఫోను రికార్డుగా పాడారు. టంగుటూరి సూర్యకుమారి 'ఒంటిగా నుయ్యాలలూగితివా నా ముద్దు కృష్ణా" "లేపనైనా లేవలేదే - మోము చూపనైనా చూపలేదే" అనే గేయాలను పాడారు.

'తాజ్‌మహల్'ను సందర్శించి వ్రాసిన "మామిడి చెట్టును అల్లు కొన్నదీ మాధవీలతొకటి", ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అస్తమించగా ఎంతో ఆవేదనతోను బాధతోను రచించిన "ఏలా పాడేనింక యమునా కల్యాణి - లీలా మాధవుడు గోపాలుడు లేడాయె", "నల్లవాడే గొల్ల పిల్లవాడే" అన్న శ్రీకృష్ణుని రాసలీలల్ని వర్ణించే గీతం - యిలా ఎన్నో అత్యంత భావగర్భితమైనవి బసవరాజుగారి కలం నుండి జాలువారినవి. 1938లో గూడవల్లి రామబ్రహ్మంగారు 'మాలపిల్ల' చిత్రంలో "నల్లవాడే గొల్లపిల్లవాడే" పాటను వెండి తెరకెక్కించారు. ఆ చిత్రంలోనే గాంధీగారి మీద అప్పారావుగారు వ్రాసిన "కొల్లాయి గట్టితేనేమి మా గాంధికోమ్మటై పుట్టితేనేమీ" పాట కూడా వున్నది.

1941లో "అపవాదు" చిత్రంలో "ఈ మావిపై నుండి ఈవు కూకూయంచు" అనే పాట

1956లో "ఏది నిజం" చిత్రంలో "గుత్తొంకాయ్ కూరోయ్ బావా" పాటను 1956లో "కన్యాశుల్కం" చిత్రంలో "నీ పుట్ట దరికి నా పాపలొచ్చేరు" అనే పాటను ఉపయోగించారు.

అప్పారావు గారికి కుమారుడు పుట్టిన సందర్భాన, ఆ రోజు దీపావళి పండుగ దినం కాగా, ఆయన ఆనందంగా

"లోకాని కుత్తుత్త దీపావళి
నాకుమాత్రము దివ్యదీపావళి
వేదాలనాధుడౌ వేదాద్రి నరసింహ
దేవుడే నా యింట దీపమైనాడు
..................
ఉయ్యాల తొట్టెలో ఊగుతున్నాడు" అని పాడుకున్నారు. కాని

## సింధు భైరవి రాగం ఆధారంగా వెలువడిన సినీ గీతాలు - తెలుగు

| వ.నెం. | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. కాదుసుమాకలకాదుసుమా | కీలుగుర్రం | ఘంటసాల, వక్కలంక సరళ | ఘంటసాల |
| 2. ప్రేమకోసమై వలలో పడెనే | పాతాళభైరవి | విజేవర్మ | ఘంటసాల |
| 3. సంసారం సంసారం ప్రేమసుధాపూరం | సంసారం | ఘంటసాల | సుసర్ల దక్షిణామూర్తి |
| 4. పయనమయే ప్రియతమ నను మరచిపోకుమా | లైలామజ్నూ | ఘంటసాల | సి.ఆర్.సుబ్బరామన్ |
| 5. ఏమిటోయీ మాయ | మిస్సమ్మ | పి.లీల | ఎస్.రాజేశ్వరరావు |
| 6. అనురాగాలు దూరములాయెనా | విప్రనారాయణ | ఎ.ఎం.రాజా, పి.భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 7. దరిచేరుచుకోరా రంగా | విప్రనారాయణ | భానుమతి బృందం | ఎస్.రాజేశ్వరరావు |
| 8. సన్నగవీచే చల్లగాలికి | గుండమ్మకథ | పి.సుశీల | ఘంటసాల |
| 9. కనులకు దోచిచేతికందని | బాటసారి | జిక్కి, భానుమతి | మాష్టర్ వేణు |
| 10. బంగారు బొమ్మరావేమే (పెళ్ళిపాట -మంత్రాలతో సహా) | రక్తసంబంధం | సుశీల, బృందం | ఘంటసాల |
| 11. ఇదేనండి భాగ్యనగరం | ఎం.ఎల్.ఏ. | ఘంటసాల, ఎస్.జానకి | పెండ్యాల |
| 12. నీ ధర్మం నీ సంఘం | కోడలు దిద్దినకాపురం | సుశీల | టి.వి.రాజు |
| 13. జయమ్ము నిశ్చయమ్మురా | శభాష్‌రాముడు | ఘంటసాల, సరోజిని, బృందం | ఘంటసాల |
| 14. చేసేది ఏమిటో చేసెయ్యి సూటిగా | తెనాలి రామకృష్ణ | ఘంటసాల | విశ్వనాథన్ రామమూర్తి |
| 15. భయమేలా ఓ మనసా | భలేరాముడు | పి.బి.శ్రీనివాస్ | ఎస్.రాజేశ్వరరావు |
| 16. తెలియగ లేరే నీలీలలు | భీష్మ | ఘంటసాల | ఎస్.రాజేశ్వరరావు |
| 17. కరగిపోయాను కర్పూరవీణలా | మరణమృదంగం | బాలు, సుశీల | ఇళయరాజా |

ఆ ఆనందం ఆయనకు కొన్నాళ్ళవరకే పరిమితమయింది. హఠాత్తుగా ఆ కొడుకు మరణించగా ఆయన

"వేదాద్రి శిఖరాన వెలిగున్న జ్యోతి
మినుకుమని కానేసు కునికిపోయింది
దేవలోకమునుండి దిగినట్టి గంగ
వచ్చినదారినే పట్టి మళ్ళింది.
కాపురమ్మొచ్చిన కన్నెపాపాయి
ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు" అంటూ

కడుభారమైన ఆ భావాన్ని వ్యావహారిక భాషలో గుండెకు గుచ్చుకునేలా ఆయన చెప్పిన తీరు మనల్ని ఎంతగానో కదలించేస్తుంది. అందుకే కృష్ణశాస్త్రిగారు పై గేయంలోని "ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు" అన్న చివరి పంక్తిని "ప్రపంచ కావ్య భాండారంలో గొప్ప పంక్తుల్లో ఒకటిగా పేర్కొన్నారు. ప్రముఖ భావకవుల రచనలను సంకలనం చేసి 'వైతాళికులు' గ్రంథంగా వెలయించిన ముద్దుకృష్ణ బసవరాజు గురించి యీ విధంగా చెప్పారు. "నగ్నంగా, నిజంగా వుంటుంది. ఆయన కవిత్వం. జిలుగూ తళుకూ ఉండదు. ఉండటానికి వీలులేదు. ప్రతి భావమూ గుండె చీల్చుకుని దూకుడుగా వస్తుంది. అందుచేతనే యీయన పాటల్లో తొలి చరణాలే గుండె పట్టుకుంటవి".

"పాట పాడుతుండగ నా
ప్రాణి దాటి యేగేనా?
ప్రాణిదాటి యేగుచుండ
పాటనోట మ్రోగేనా?

అని ఆయన తలచినట్లుగానే చివరి క్షణాల్లో అప్పారావుగారు పాడుతూనే కన్నుమూశారు.

## సింధు భైరవి రాగం ఆధారంగా వెలువడిన సినీ గీతాలు - హిందీ

| | | | |
|---|---|---|---|
| 1. తూగంగాకీ మౌజ్మైం జమునాకా ధారా | బైజుబావరా | రఫీ, లత | నౌషాద్ |
| 2. ఛోడ్‌గయేబాలమ్ | బర్సాత్ | లత, ముకేష్ | శంకర్, జైకిషన్ |
| 3. బర్సాత్‌మే హంసేమిలే తుమ్‌సజన్ | బర్సాత్ | లత, బృందం | శంకర్, జైకిషన్ |
| 4. ఓకైసీ ఖుషీకీహైరాత్‌బలమ్‌మేరేసాథ్ | కాలీఘటా | లత | శంకర్, జైకిషన్ |
| 5. హమ్‌సేనాపూఛోకోయీ ప్యార్‌క్యాహై | కాలీఘటా | లత | శంకర్, జైకిషన్ |
| 6. మెహఫిల్ మేజల్ ఉఠీ షమాపర్‌వానేకేలియే | నిరాలా | లత | సి.రామచంద్ర |
| 7. ఓ పాస్ ఆరహే హైం | దహేజ్ | లత | సి.రామచంద్ర |
| 8. తూప్యార్‌కరే యా ఠుక్‌రాయే | దేఖ్‌కబీరారోయా | లత | మదన్‌మోహన్ |
| 9. ఇన్‌సాఫ్‌కామందిర్‌యే భగవాన్ కాఘర్‌హై | షబాబ్ | రఫీ | నౌషాద్ |
| 10. ఆవారాహూం | ఆవారా | ముకేష్ | శంకర్, జైకిషన్ |
| 11. దిల్ బేకరార్‌హై | నగీనా | సి.ఎచ్.ఆత్మా | శంకర్, జైకిషన్ |
| 12. తూనేహాయ్ మేరే జగ్‌మే జిగర్ కోఢూండీలియా | నగీనా | లత | శంకర్, జైకిషన్ |
| 13. సాంవరేసాంవరే | అనూరాధ | లత | పండిత్ రవిశంకర్ |
| 14. ఘర్‌ఆయామేరాపర్ దేశీ | ఆవారా | లత | శంకర్, జైకిషన్ |
| 15. లాగాచున్‌రీమ్ దాగ్ | దిల్‌హీతోహై | మన్నాదే | రోషన్ |
| 16. యేహవాయేరాత్ యే చాంద్‌నీ | సంగ్‌దిల్ | తలత్‌మెహమూద్ | సజ్జాద్ హుస్సేన్ |
| 17. కహాంహోకహాంమేరే జీవన్‌సహారే | సంగ్‌దిల్ | తలత్‌మెహమూద్ | సజ్జాద్‌హుస్సేన్ |
| 18. హుస్నేజాన్ ఆయిధర్ ఆ, ఆయినా హూంమైంతేరా | సాథీ | ముకేష్ | నౌషాద్ |
| 19. రులాకర్ చల్‌దియే ఏక్‌దిన్ | బాద్‌షా | హేమంత్‌కుమార్ | శంకర్‌జైకిషన్ |
| 20. జోతుమ్‌తోడోపియా (మీరాభజన్) | ఝనక్‌ఝనక్‌పాయల్‌బాజే | లత | వసంత్‌దేశాయ్ |
| 21. ఐమేర్‌దిల్‌కహీ ఔర్ చల్ | దాగ్ | తలత్‌మెహమూద్ | శంకర్, జైకిషన్ |
| 22. జూహీకి కలీమేరే లాడ్‌లీ | దిల్‌ఏక్‌మందిర్ | సుమన్‌కల్యాణ్‌పూర్ | శంకర్, జైకిషన్ |
| 23. మేరే ఐదిల్ బతా | ఝనక్ ఝనక్‌పాయల్‌బాజే | లత, మన్నాదే | వసంత్‌దేశాయ్ |
| 24. ఆజ్‌ఫిర్ జీనేకీ తమన్నాహై | గైడ్ | లత | ఎస్.డి.బర్మన్ |
| 25. ఇత్‌నానాముఝేసేతూప్యార్ బఢా | ఛాయా | లత, తలత్ | సలిల్‌చౌదరి |
| 26. తస్‌వీర్ తేరేదిల్‌మే | మాయా | రఫీ, లత | సలిల్‌చౌదరి |
| 27. ఆజా ఆబ్‌తో ఆజా | అనార్‌కలీ | లత | సి.రామచంద్ర |
| 28. రాజాకీ ఆయేగీ బారాత్ | ఆహ్ | లత | శంకర్, జైకిషన్ |
| 29. వందేమాతరం | ఆనంద్‌మఠ్ | లత, బృందం | హేమంత్‌కుమార్ |
| 30. దేఖ్‌లియా మైంనే సాజన్ తేరావాదాదేఖ్‌లియా | దీదార్ | లత, రఫీ | నౌషాద్ |

ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని

సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా ధారావాహికంగా 'హాసం' సమర్పిస్తున్న

కామెడీ స్కిట్‌లలో మూడవది ఇది.



# 'అంకిత' భావం

— రాజా

సుబ్రహ్మణ్యం తోటలో అటూ ఇటూ పచార్లు చేస్తూ ఉంటాడు.

పెళ్ళి జరిగినట్టు బుగ్గన చుక్క.

సుబ్ర: ఈవిడ గారు ఇంకా రాదేంటి? కొంపదీసి సిగ్గు గట్రాలాంటివి ఏవైనా పడుతోందా ఏంటి...? ఖర్మ... ఆ... పెళ్ళయిన తర్వాత ఇంకా సిగ్గేంటి అదిగో... అంకిత...

(తలెత్తి చూశాడు. దూరంనుంచి వస్తున్న అంకిత... ఆమె బుగ్గన కూడా చుక్క)

సుబ్ర: అంకితా

అంకిత: ఏవండీ

సుబ్ర: అంకితా

అంకిత: ఏవండీ

(పరుగెత్తుకుంటూ దగ్గరికి వస్తాడు. అంకిత స్కూటర్ బ్రేక్ వేసినట్టు అతని కాలుని తనకాలుతో అదిమేస్తుంది గట్టిగా)

సుబ్ర: ఏంటి అంకితా... పెళ్ళయిన తర్వాత కూడా ఈ బ్రేకేంటి?

అంకిత: ఎందుకంటే పెళ్ళికి ముందు మనం తీసుకున్న ప్రతిజ్ఞ మరోసారి మీకు గుర్తు చేయడానికి.

సుబ్ర: నిజమైన ప్రేమలోని థ్రిల్ తెలియాలంటే పెళ్ళయ్యేదాకా ఒకర్నొకరు ముట్టుకోకూడదు అనుకున్నాం... అంతే కదా... మరి పెళ్ళయిపోయింది కదా...

అంకిత: అయ్యో శ్రీవారూ... పెళ్ళయ్యేదాకా అంటే ఫస్ట్‌నైట్ కూడా అయ్యేదాకా అనే అర్థం.

సుబ్ర: అదేంటీ... ఈ ఎక్స్‌టెన్షనేంటి...!?

అంకిత: అంతకన్నా క్లియర్‌గా ఏ ఆడపిల్లా చెప్పదు, చెప్పలేదు, మొగుడు మగాడైతే అర్థం చేసుకోవాలి.

సుబ్ర: వామ్మో...!?

అంకిత: అప్పటికీ చుట్టూ చుట్టాలందరూ ఉన్నారే మీరు కబురుపెట్టారని, రాకపోతే ఏమైనా అనుకుంటారని దొంగతనంగా దొడ్డిదారిన వచ్చాను తెలుసా?

సుబ్ర: పోన్లే ఆమాత్రం అర్థం చేసుకున్నావు థాంక్స్... ఇంతకీ మన ఫస్ట్‌నైట్‌కి ముహూర్తం ఎప్పుడనుకుంటున్నారూ?

అంకిత: ఏమో అవన్నీ పెద్దవాళ్ళ మధ్య మాటలు... మనకి చెప్తారా ఏవన్నానా?

సుబ్ర: పిచ్చి అంకితా... నీకంటే అందరూ ఉన్నారు... గానీ నాకెవరున్నారు... నాకు నేనేగా పెద్ద... నాతో చెప్పొచ్చుగా వాళ్ళు...!?

అంకిత: తెల్లవారు ఝామునేగా పెళ్ళయింది... అప్పుడే పోయి అడిగారనుకోండి కొత్త పిచ్చోడు పొద్దెరుగడు అనుకుంటారు.

సుబ్ర: నీకేం తెలుసు అంకితా... నా బాధ? మా అమ్మ గర్భం ధరించిన పదకొండు నెలలకి నేను పుట్టానట. తెలియకుండానే రెండు నెలలు లేటుని భరించాను. పెరిగి పెద్దయ్యాక ఉద్యోగం కోసం రిటెన్‌టెస్ట్ రాసిన రెండేళ్ళ తర్వాత ఇంటర్వ్యూకి పిలిచారు. అయినా భరించాను. ఉద్యోగంలో జాయినవటానికి నాంపల్లిలో ఆటో ఎక్కితే వాడు పక్కనే ఆబిడ్స్‌లో ఉన్న టెలిఫోన్ ఆఫీసుకి తీసుకెళ్ళమంటే పదిమైళ్ళ అవతలున్న సికింద్రాబాద్, మారేడ్‌పల్లికి తిప్పి తిప్పి లేటుగా చేర్చాడు అయినా భరించాను, కావలసిన వయసులో పెళ్ళికాక పోయినా ఉద్యోగం చేసేపిల్లకోసం వెయిట్ చేసి చేసి ఏజ్‌బార్ అయిపోయినా భరించాను. కానీ ఈ ఫస్ట్‌నైట్ లేటునే భరించలేక పోతున్నా అంకితా... భరించలేక పోతున్నా.

అంకిత: మధ్యాహ్నం భోజనాల సమయంలో చెప్తారేమోనండీ మరీ అంత బైటపడిపోతే ఎలా?

సుబ్ర: ఇంకాస్సేపుంటే కిందపడిపోతాను అంకితా... కింద పడిపోవటం కంటే బైటపడిపోవటమే బెటరు కదా...

అంకిత: ఇంకనే వెళ్తానండీ ఎవరైనా చూస్తే బాగోదు...

సుబ్ర: ముందు అసలు విషయం మాట్లాడనీ అంకితా ఆ తర్వాత వెళ్దువుగాని...

అంకిత: అబ్బా... మీతో ఎలాగండీ... చెప్పండి త్వరగా...

సుబ్ర: నా బాధంతా మన ఫస్ట్‌నైట్ గురించే అంకితా... ఫస్ట్‌థింగ్ ఏంటంటే మీ చుట్టాల్లో ఎవరైనా చాదస్తంగాళ్ళు ఉంటే వాళ్ళు మనకి అడ్డురాకుండా కాస్త చూసుకో గలవా?

అంకిత: అదేంటీ... వాళ్ళెందుకు అడ్డొస్తారు...?

సుబ్ర: నీకు తెలీదు అంకితా... టీవీకి యాంటెనాలాగ, ఆటోవాళ్ళకి పొగరులాగ, టెలిఫోన్‌కి రాంగ్ కాల్‌లాగ, కరంటుకి ఎక్సెస్ బిల్ లాగ... బంధువులంటూ ఉంటే వాళ్ళకి చాదస్తం ఉండితీరుతుంది. తెలుసా?

అంకిత: ఎక్కడ బంధువులు ఉంటారో అక్కడ చాదస్తం ఉంటుంది. టింగ్ టింగ్...

సుబ్ర: (అడ్వర్టయిజ్‌మెంట్ చాలన్నట్టు దండంపెడుతూ...)అంకితా...

ప్లీజ్...

అంకిత: చెప్పండి...

సుబ్రః పోనీ ఏదైనా హోటల్‌లో రూం బుక్ చేసుకుంటే...

అంకిత: దేనికీ...

సుబ్రః మన ఫస్ట్‌నైట్‌కి

అంకిత: వెర్రికుదిరింది, రోకలి తలకి చుట్టు... అన్నాట్ట... అలా ఉంది...

సుబ్రః ఏం ప్లాన్ బానే ఉంది కదా

అంకిత: ఆమధ్య మా కజిన్స్ ఇలాగే ఓ హోటల్‌లో రూమ్ తీసుకున్నారు. వెంటనే పోలీసులు రంగప్రవేశం... ప్రతి రూమ్‌ని చెక్ చేయడం, ప్రతీవాళ్ళని అనుమానంగా చూడడం, వంకరగా మాట్లాడడం, ఆ సంగతి తెలిసి బంధువులంతా వీళ్ళని నానా చివాట్లు పెట్టడం.

సుబ్రః వామ్మో

అంకిత: తెలిసింది కదా... ఇంకెప్పుడూ హోటల్‌లో రూం అనకండి...

సుబ్రః మరి నన్నేలా చావమంటావు అంకితా

అంకిత: అయ్యయ్యో అంతమాటనకండీ

సుబ్రః సరే... ఇంకెంత మాట అనమంటావో అదైనా చెప్పు

అంకిత: నేనెలా చెప్పగలనండీ

సుబ్రః అంటే... చెప్పలేవు కనుక చెప్పవు... అదే చెప్పగలిస్తే... ఖచ్చితంగా చెప్పేస్తావన్నమాట నేనెలా చావాలో...

అంకిత: అయ్యయ్యో నా ఉద్దేశం అది కాదండీ

సుబ్రః అంకితా...! ఉద్దేశాలు ఒద్దూ ఉపదేశాలూ ఒద్దు. మరో గంటలోగా మీ వాళ్ళు నాతో మన ఫస్ట్‌నైట్ విషయం మాట్లాడక పోయారో వెంటనే మూటా ముల్లె సర్దుకుని చెక్కేస్తాను... సాయంత్రమే సన్యాసం స్వీకరించేస్తాను... రేపు ఉదయాన్నే కర్మయోగం గురించి లేదా వేదాంతం గురించి లెక్చర్లిస్తూ టీవీలో కనిపిస్తానంతే!



అంకిత: అలాగా... ఏదీ... చెయ్యండి చూద్దాం...

సుబ్రః అదేంటీ... భయపడకుండా, ఆశ్చర్యపోకుండా ఆ ఎక్స్‌ప్రెషనేంటి... పైగా అంత ధైర్యంగా...?

అంకిత: మా నాన్న సంగతి మీకు తెలీదు కనుక మీరా ఫీలింగిచ్చారు నాకు తెలుసుకనుక నేనీ ఎక్స్‌ప్రెషనిచ్చాను ఏం... వింటారా మా నాన్న సంగతి...

సుబ్రః ఏం చేస్తాం... రూప్ తేరా మస్తానా... వినక నేను ఛస్తానా...! చచ్చినట్టువింటా చెప్పు

అంకిత: మా నాన్న సినిమా డైరెక్టర్ అని తెలుసుగా...

సుబ్రః అయితే!?

అంకిత: ఏ ఆర్టిస్టుతో ట్రబులొచ్చినా డూప్‌ని పెట్టేస్తాడు. మా అక్కయ్య పెళ్ళిలో కూడా మా బావ అలిగితే 'తాళి కడతావా డూప్ చేత కట్టించ మంటావా?' అని అరిచాడు. దెబ్బకి మా బావ తాళికట్టాడు. మీరిలా ఎక్స్‌ట్రాగా మాట్లాడితే ఆయన దగ్గర్నుంచి ఏ రిప్లయి వస్తుందో ఊహించుకోండి.

సుబ్రః వామ్మో... వార్నాయనో... మీ ఇష్టం వచ్చినపుడు ముహూర్తం పెట్టుకోండి. మీరు చెప్పేదాకా నేనా ఊసెత్తితే ఒట్టు.

అంకిత: గుడ్ బోయ్

సుబ్రః హుం... బోయ్ కాదు... మాన్ అనాలి ఇంకొన్నాళ్ళుపోతే ఓల్డ్‌మాన్, అని కూడా అనాల్సివస్తుంది... హుం... ఏమిటో ఈ బ్రతుకులో... అన్నీ లేటే... వెధవ బతుకు...

అంకిత: అలా నిరాశ పడితే ఎలానండి.... ఎలాగైనా మా అక్కద్వారా విషయం కనుక్కొని మధ్యాహ్నం భోజనాల సమయంలో మీకు చెప్తాగా...

సుబ్రః హమ్మయ్య... ఆ మాత్రం ధైర్యం చాలునాకు... మరో చిన్న రిక్వెస్ట్ అంకితా...

అంకిత: ఏంటదీ...

సుబ్రః శోభనం గదిలో ఈ తెల్లపట్టు చీరలు, తెల్ల పట్టు పంచెలు, పాలు, పళ్ళు, అగరొత్తులు, బిస్కత్తులు

అంకిత: బిస్కెట్లు కూడా పెడతారాండీ...?!

సుబ్రః ఏదో ప్రాసకోసం నేనే పెట్టాలే... ఒదిలెయ్... ఒదిలెయ్... దాని సంగతి... ఇంతకీ చెప్పొచ్చేదేంటంటే అలాంటి ఫార్మాలిటీసు అవీ ఏవీ లేకుండా సింపుల్‌గా నువ్వు నీ కిష్టమైన డ్రస్సులో రా. నేను నాకిష్టమైన డ్రస్సులో వస్తా...

అంకిత: అదేంటీ...!?

సుబ్రః అదే సస్పెన్స్... ఇక్కడ చెప్పను... ఇప్పుడు చెప్పను... అన్నీ అక్కడే... అప్పుడే...

....కట్....

(సీన్ ఓపెన్ అవగానే గదిలో మంచంమీద సుబ్రహ్మణ్యం,అంకిత నార్మల్ డ్రస్‌లతో కూర్చొని ఉంటారు. బుగ్గన చుక్కలు ఉంటాయి)

అంకిత: అయ్యా శ్రీ వారూ... తీరిందా మీ బెంగ...

సుబ్రః అబ్బే... ఇంకా ఎక్కడ అంకితా... ఇప్పుడేగా మనిద్దర్నీ గదిలోకి పంపించారు. అన్నట్టు ఇంతకీ ఇదేనా నీ ఫేవరెట్ డ్రస్సు?

అంకిత: ఆ... ఇదే... మరి మీరు...?

సుబ్రః చెప్తా... చెప్తా... ముందు నువ్వు కళ్ళు మూసుకోవాలి

అంకిత: ఆ తర్వాత?

సుబ్రః నేను నా ఫేవరెట్ లక్కీషర్టు తీసి తొడుక్కుంటా

అంకిత: ఆ తర్వాత

సుబ్రః అప్పుడు నువ్వు కళ్ళు తెరచి, 'ఏవండీ' అంటూ ఈ రెండు చేతుల మధ్యకి వస్తావు

అంకిత: ఆ తర్వాత

సుబ్రః ఆ తర్వాత ఏం జరుగుతుందో నువ్వే చూస్తావు

అంకిత: ఇంతేనా...

సుబ్రః ఇంతేనా అంటే ఇంకా చాలా ఉంది అంకితా... ముందు మన ప్రోగ్రాం కానీ... ఇప్పటికే లేటయిపోయింది.

అంకిత: (కళ్ళుమూసుకుని) సరే అయితే... కళ్ళుమూసుకున్నా

(సుబ్రహ్మణ్యం పరుపుకింద దాచిన ఎర్రషర్టు తీసి, తను తొడుకున్న షర్టు విప్పేసి, ఎర్ర షర్టు తొడుక్కొని, రెండు చేతులు చాచి, కళ్ళు మూసుకొని)

సుబ్ర: అంకితా...

(అంకిత కళ్ళు తెరిచింది. సుబ్రహ్మణ్యం వంక చూసింది. ముందుకి రాబోయింది. రైలు శబ్దం... ఎర్రలైటు కళ్ళ ముందు కనిపించింది. రెండు మూడు సార్లు ట్రై చేసింది... ముందుకి వెళ్ళలేక పోతోంది. ప్రయత్నిస్తోంది కానీ నోట్లోంచి 'కీచు'మంటూ పట్టాలమీద రైలు చక్రాలు ఆగిన లెవెల్లో సౌండ్ వస్తోంది. దెబ్బతో ఆగిపోతోంది)




సుబ్ర: అంకితా... అంకితా... అంకితా...

అంకిత: ఏవండీ...

సుబ్ర: ఏమయింది అంకితా ఏమయింది

అంకిత: నా దగ్గరకి రాకండీ... దయచేసి అ షర్టు తీసేసి ఇంకో షర్టువేసుకోండీ... ప్లీజ్...

సుబ్ర: అదేంటి అంకితా... ఏమయిందీ షర్టుకి... బ్యూటిఫుల్‌గా ఉందిగా...

అంకిత: ఉంది గానీ... అదుండగా నేను మీ దగ్గరికి రాలేనండీ...

సుబ్ర: ఏమిటి అంకితా... వింతగా ప్రవర్తిస్తున్నావు... ఏమయిందీ షర్టుకి...?

అంకిత: మనం ప్రేమించుకున్నప్పుడే చెప్పాను కదండీ నా స్వభావం గురించి... గుర్తులేదా...?

సుబ్ర: అబ్బా... అంకితా... ఇప్పుడీ మూడ్‌లో అవన్నీ ఎలా గుర్తొస్తాయి...? ఏం చెప్పావో జ్ఞాపకం చెయ్యి మరొక్కసారి...

అంకిత: నా పేరు అంకిత అని అలాగే నేనెంతో అంకిత భావంతో ఉద్యోగం చేస్తానని చెప్పాను కదండీ

సుబ్ర: చెప్పావు... అయితే...

అంకిత: నేను ఉద్యోగం చేస్తున్నది రైల్వేలో కదండీ...

సుబ్ర: అయితే...

అంకిత: మీ షర్టు నన్ను ముందుకురానివ్వటం లేదండీ రెడ్ సిగ్నల్‌లా అపేస్తోందండీ

సుబ్ర: అంకితా... నీకేమైనా పిచ్చెక్కిందా... నువ్వుపని చేస్తోంది రైల్వే ఆఫీసులో క్లర్క్‌గా... ఇంజన్ డ్రైవర్‌గా కాదు... తెలుసా...?

అంకిత: తెలుసండీ... అయినా సరే... నాకున్న డెడికేషన్ అలాంటిది... సంస్థలో ప్రతి అణువు నేనే అన్నట్టు ఫీలయిపోతాను. నేనే రైల్వే... నేనే రైలు... రైలే నేను

సుబ్ర: వామ్మో వార్నోయనో ఇదెక్కడి అంకితభావంరా తండ్రోయ్...

అంకిత: పోనీ మీ షర్టు తీసేసి మరో షర్టు వేసుకోవచ్చుగా

సుబ్ర: (నెత్తి కొట్టుకుంటూ)ఖర్మ... ఖర్మ... ఖర్మ...!

అంకిత: ఏవయిందండీ

సుబ్ర: దేవుడు లేడూ దేవుడు.. అదే... ఈ ఖర్మ ఫిట్టింగు పెట్టిన వాడు... ఆయన రాశాడే నారాత పరపరపరమని ఎడంచేత్తో

అంకిత: అబ్బ... అసలు విషయం చెప్పండీ

సుబ్ర: జాతక ప్రకారం నా ఫేవరెట్ గ్రహం కుజుడుట... ప్రస్తుతం నాకు నడుస్తున్న పీరియడ్ కూడా కుజదశట...

అంకిత: అయితే...

సుబ్ర: కుజుడుకి ఎరుపు రంగంటే ఇష్టంట కాబట్టి ఇదిగో ఈ పగడం ఉంగరం, ఈ ఎర్ర షర్టు వేసుకుంటే ముఖ్యమైన కార్యాలు కలిసొస్తాయిట

అంకిత: లేకపోతే

సుబ్ర: అన్నిట్లోనూ ఫెయిలవుతానట...

అంకిత: అయితే మరిప్పుడెలాగండి?

సుబ్ర: అది నువ్వే చెప్పాలి.

అంకిత: మీరు మీ షర్టే మార్చలేక పోతే నేను నా స్వభావాన్ని ఎలా మార్చుకోగలనండీ!?

సుబ్ర: అంతేనా ఉద్యోగం మానెయ్యడానికి ఇదేమైనా కొత్త ఎత్తా?

అంకిత: మీరేం మాట్లాడు తున్నారో నాకర్థం కావటం లేదండీ...

సుబ్ర: దట్ టైప్ ఆఫ్ డాల్స్ కెన్నాట్ బి బాయిల్డ్ బిఫోర్‌మి...

అంకిత: ఇందాకే బెటరు... బిడాలం అంటే మార్జాలం అన్నట్టు ఇప్పుడస్సలు అర్థంకావడంలేదండీ

సుబ్ర: అంటే ఆ పప్పులు మన దగ్గర ఉడకవు... నువ్వు ఉద్యోగం చెయ్యాల్సిందే... అది నా ప్రిన్స్‌పుల్

అంకిత: మరి అంకితభావం నా ప్రిన్స్‌పుల్‌కదా... నా ప్రిన్స్‌పుల్స్‌ని అణగదొక్కుతారా మీరు?ఇదేనా మీ ఆదర్శం? ఇదేనా మీ సంస్కారం?.. ప్రేమించుకుంటున్నప్పుడు మీరు చెప్పిన మాటలన్నీ ఒట్టినీటి మాటలేనా... చెప్పండీ... మాట్లాడరేం చెప్పండీ...

సుబ్ర: ఆగు... దయచేసి ఆగిపో... అంతంత మెలో డ్రామా డైలాగులు కొట్టక... మరో రెండు డైలాగులు ఎక్స్‌ట్రా కొట్టేవంటే...

అంకిత: ఏం చేస్తారు?

సుబ్ర: మూర్ఛరోగిలా నిల్చున్న ఫళాన గిలగిలగిలగిల కొట్టుకుచస్తాను. చూడలేక భయంతో నువ్వు ఛస్తావు.

అంకిత: మరిప్పుడెలా అండి?

సుబ్ర: ఏవుందీ... రేపు ఉదయాన్నే వెళ్ళి రిజైన్ చెయ్యి. మా ఆఫీసులోనే నీకు ఉద్యోగం చూస్తాను. అంతవరకూ ఫస్ట్‌నైట్ కాన్సిల్...

అంకిత: ఇలా అయిందేంటండీ?

సుబ్ర: ఏవుందీ... నీకు అంకిత భావం ప్రిన్స్‌పుల్లు. నాకు ఎర్రషర్టూ, ఉద్యోగం చేసే పెళ్ళాం ప్రిన్సిపుల్లు... ఆ దేవుడికి ఖర్మ ఫిట్టింగు ప్రిన్సిపుల్లు... అంతే వెయిట్ చెయ్యాల్సిందే... నా బతుకే లేట్ బతుకు కదా

(ఇద్దరూ తలలు పట్టుకొని కూచుండగా)

....కట్....

(సీన్ ఓపెన్ అయ్యేసరికి సుబ్రహ్మణ్యం తలుపు కొడుతూ ఉంటాడు)

సుబ్ర: అంకితా... అంకితా... (అంకిత నిద్ర లేచి తలుపుతీస్తుంది) ఏంటోయ్ ఇంకా కళ్ళబరువు తీరలేదా ఎంతనైట్ డ్యూటీ చేస్తే మాత్రం పట్టపగలు ఇంత నిద్రేంటోయ్?

అంకిత: ఏం చెయ్యమంటారు చెప్పండి... రైల్వేలో మాకు నైట్ షిఫ్ట్‌లు ఉండవు. పోయి పోయి మీ టెలిఫోన్ డిపార్టుమెంట్‌లో చేర్పించారు.

ఇక్కడ ఆడవాళ్ళక్కూడా నైట్ షిఫ్ట్‌లుంటాయి.

సుబ్రః (వేసుకున్న షర్టు విప్పుకుంటూ) ఏం చేస్తాం అంకితా ఉద్యోగం అంటే ఉద్యోగమే... పైగా నీది అంకితభావం కదా

అంకిత: అందుకే జాయిన్ అయినరోజు 'నో' అంటే బావుండదని నైట్ డ్యూటీ చేశా నాకు నిద్రొస్తోందండీ... మీరే అన్నం పెట్టుకు తినెయ్యరూ

సుబ్రః అన్నం నేనే పెట్టుకు తింటాగాని... ఇప్పుడు నిద్రంటే ఎలాగోయ్... ఇవాళ మన ఫస్ట్‌నైట్ కదా...

అంకిత: మీరు ఆ రెండు మెతుకులూ నమిలేలోగా జస్ట్ ఓ చిన్న కునుకు తీస్తానండీ ప్లీజ్...

సుబ్రః అంకితా... ఫస్ట్‌నైట్ భార్య కులుకుతూ ఉండాలోయ్... కునుకుతూ ఉండకూడదు... నేను గబగబా ఓ రెండు మెతుకులు నోట్లో పడేసుకు వస్తా ఈలోగా నిద్రపోకే ప్లీజ్... అదేంటి... ఇంత చెప్తున్నా నిద్రలోకి జారుకుంది... అంకితా... అంకితా...

అంకిత: (మత్తుగా, కళ్ళువిప్పకుండా) ఊఁ...

సుబ్రః లే అంకితా... ప్లీజ్ అంకితా

అంకిత: డైల్ కియా నంబర్ కృపయా జాంచ్‌లే

సుబ్రః ఆఁ

అంకిత: ఆఁ మీరు డైల్ చేసిన నంబరు మరియొకసారి సరిచూసుకోండి.

సుబ్రః అంకితా... అంకితా...

అంకిత: ఆల్ లైన్స్ ఆర్ బిజీ... ప్లీజ్ ట్రై ఆఫ్టర్ సమ్ టైమ్

సుబ్రః ఆఁ... అంకితా... అంకితా... లే అంకితా... నేను అంకితా...

అంకిత: యువార్ ఇన్ క్యూ ప్లీజ్... వెయిట్

సుబ్రః అంకితా... నేనోయ్... నీ మొగుణ్ణి... ఇవాళ మన ఫస్ట్‌నైట్ అంకితా...

అంకిత: మీరు క్యూలో ఉన్నారు. దయచేసి మీవంతు కొరకు వేచి ఉండండి...ఆప్ క్యూమే హై... కృపయా ప్రతీక్షా కీజియే... మీరు క్యూలో ఉన్నారు దయచేసి మీ వంతు కొరకు వేచివుండండి.

సుబ్రః ఓసి నీ అంకితభావం మండా! ఫస్ట్‌నైట్ అని నేనొస్తే క్యూలో ఉండమంటావేంటే... బాబోయ్ ఇందులో డబుల్ మీనింగ్ తల్చుకుంటే ఒళ్ళు కుతకుత ఉడికిపోతోంది నాయ్‌నోయ్ ఒద్దూ... ఉద్యోగం చేసే పెళ్ళాం ఒద్దురోయ్ దేవుడా త్వరగా ఫస్ట్‌నైట్ జరిపించు తండ్రోయ్

------------ది ఎండ్ -----------






# అబ
# పాప్ ప్రపంచంలో పాపులారిటీ సంపాదించుకున్న పేరు




1970 సంవత్సరంలో ప్రారంభమైన అబ గ్రూప్ ప్రాచుర్యం 1982 తర్వాత తగ్గి ఇటీవల మళ్లీ పుంజుకుంది. అరుదైన ఈ ఫీట్ అందరిచేతా 'అబ్బా' అనిపించుకుంటోంది. ఆరంభం నుంచి ఈ గ్రూప్ సాధించిన హిట్స్‌తో 1992లో విడుదలైన 'అబగోల్డ్' ఆల్బమ్ ప్రపంచ వ్యాప్తంగా రెండు కోట్ల కాపీలు అమ్ముడైంది. అప్పటి నుంచి ఇప్పటివరకు ఏ మాత్రం గొంతులో పదును తగ్గకుండా ఈ గ్రూప్ కేవలం యూరప్ దేశాలకే పరిమితం కాకుండా యావత్ ప్రపంచంలో పాప్ అభిమానులకి వీనులవిందు చేస్తోంది. వీరి గళాల్లోని స్వరాల గలగలలకు తెరమీది తళుకు తోడవ్వడంతో అబ ఆడియోతో పాటు వీడియో ఆల్బమ్స్ కూడా అత్యధిక ప్రజాదరణ పొందుతున్నాయి.

అబ ఇతివృత్తంగా ఇంగ్లీషు చిత్రాలు కూడా వచ్చాయి. ఇటీవల హైదరాబాద్‌లోని గండిపేటలో గల ట్రెజర్ ఐలండ్‌లో జరిగిన 'అబ మ్యూజికల్ నైట్' జరిగింది. అబ ప్రాముఖ్యతను మరొక్కసారి గుర్తు చేసింది.

స్వీడన్ దేశానికి చెందిన ఈ గ్రూప్‌లో జార్న్ ఉల్వాయిస్, అగ్నెత, బెన్ని అండర్సన్, ఫ్రైడ్‌లు సభ్యులు. జార్న్ ఉల్వాయిస్ ఇటీవల ఇచ్చిన ఒక ఇంటర్వ్యూ లోని విశేషాలు:

హిట్స్‌కొట్టే మీ గ్రూప్ హిస్టరీ వివరిస్తారా?

ఈ గ్రూప్ ఏర్పాటుకు ముందు నేను పాపులర్ ఫోక్ మ్యూజిక్ గ్రూప్ 'హూటనని సింగర్స్'లో సభ్యుడ్ని. బెన్నీ స్వీడన్ నెంబర్ వన్ పాప్ బ్యాండ్ 'హెప్ స్టార్స్'లో మెంబర్. మా ఇద్దరికి 1966లో పరిచయం ఏర్పడింది. 1969లో హూటనని సింగర్స్‌కి అవకాశాలు తగ్గాయి. మరో వైపు బెన్ని హెప్ స్టార్స్ నుంచి బయటకి వచ్చేయాలనుకుంటు న్నాడు. అప్పుడే మా ఇద్దరికీ ఓ ఆలోచన వచ్చింది. మనమే సాంగ్స్ రాసి రికార్డ్ చేస్తే ఎలా ఉంటుంది అని, రికార్డ్ కంపెనీ ఓనర్

స్టిగ్ ఆండర్సన్ మమ్మల్ని బాగా ఎంకరేజ్ చేశాడు. ప్రస్తుతం మా గ్రూప్ మేనేజర్ అతనే.

మీ గ్రూప్‌లో ఫిమేల్ సింగర్స్ వివరాలు....

అగ్నెతకి సోలో సింగర్‌గా మంచి పేరుంది. మేమిద్దరం మొదటిసారిగా కలుసుకున్నది 1968లో. లవ్ ఎట్ ఫస్ట్ సైట్. మేం ప్రేమించుకున్నాం. 1971లో పెళ్లి చేసుకున్నాం. ఫ్రైడ్ మొదటిసారిగా బెన్నిని కలిసింది 1967లో అనుకుంటాను. తొమ్మిది ఏళ్ల ఫ్రెండ్‌గా ఉంది! ఆ తర్వాత వారిద్దరూ పెళ్లి చేసుకున్నారు. ఫ్రైడ్ రికార్డింగ్ ఆర్టిస్ట్.

మీ గ్రూప్‌కి అబ అని పేరెలా వచ్చింది. దీని వెనకాల ఏదైనా కథ ఉందా?

కథంటూ పెద్దగా ఏమి లేదు. అయితే మా పేర్లన్నింటి నుంచి ఒక్కో అక్షరం తీసుకుని గ్రూప్‌కి పేరు పెడితే బాగుండుననుకున్నాం. ఇందుకు కాంపిటీషన్ కూడా నిర్వహించాం. పేరు పలికేందుకు తేలికగా ఉండాలి. క్రిస్టియన్ నేమ్‌గా ఉండాలి. ఫ్రైడ్ పేరు ఆమె రికార్డ్స్ ప్రకారం - ఏనీఫ్రైడ్. నా పేరు స్పెల్లింగ్ - Bjorn, బి సైలంట్. ఈ విధంగా అందరి పేర్లలో మొదటి అక్షరం తీసుకుని 'అబ'కి నామకరణం జరిగింది.

మీకు బాగా గుర్తింపు తెచ్చిన ఆల్బమ్స్?

నిజంగా చెప్పాలంటే నేను 1974 'వాటర్ లూ'తో మొదలెడితే బాగుంటుంది. అప్పుడు జరిగిన "యూరో విజన్ సాంగ్ కాంటెస్ట్"లో వాటర్‌లూ ఆల్బమ్ ద్వారా మాకు ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు వచ్చింది. ఇంగ్లండ్, వెస్ట్ జర్మనీ, నార్వే, బెల్జియంలలో ఇది పెద్ద హిట్. మరికొన్ని దేశాలలో టాప్ 5లో ఉంది. ముఖ్యంగా 'మమ్మామియా' (1999) మా గ్రూప్‌కి వాటర్‌లూ తర్వాత గొప్ప హిట్ ఇచ్చింది. ఇది ఇంటర్నేషనల్ హిట్. అంతకుముందు 1972లో 'పీపుల్ నీడ్ లవ్' స్వీడన్ టాప్ ట్వంటీలో నమోదైంది. 1975లో

అబ బృందం







అబకు పునరుజ్జీవం ప్రసాదించిన మమ్మామియా

వచ్చిన "ఎస్.ఓ.ఎస్" యూకేలో బిగ్ హిట్. 1975-78 మధ్యకాలంలో బ్రిటన్‌లో మావి ఏడు ఆల్బమ్స్ విడుదలయ్యాయి. అన్నీ టాప్‌టెన్‌లో స్థానం సంపాదించాయి. ఆ దశాబ్దం చివర్లో బ్రిటన్‌లో మా ఆల్బమ్స్‌దే డామినేషన్. అదే కాలంలో యూకే ఛార్ట్‌లో 35 వారాలు వరుసగా మా ఆల్బమ్స్ (సింగిల్స్) నెంబర్ వన్‌కి ఎక్కాయి. 1976లో స్వీడన్ యువరాజు సిల్వియా సోమర్‌లత్ వెడ్డింగ్ రిసెప్షన్‌లో మేము ప్రదర్శించిన 'డ్యాన్సింగ్ క్వీన్'కి కూడా మంచి పేరొచ్చింది. 'నోయింగ్ మి నోయింగ్ యు' 'ది నేమ్ ఆఫ్ ది గేమ్', 'టేక్ ఎ ఛాన్స్ ఆన్ మి' పెద్దహిట్స్. 'నోయింగ్ మి నోయింగ్ యు' యూకేలో 15 నెలల పాటు నెంబర్ వన్‌గా కొనసాగింది. మరో విషయం -1982 డిసెంబర్‌లో బి.బి.సికి చేసిన 'లేట్ లేట్ బ్రేక్ ఫాస్ట్ షో'కి మా చివరిషో. మా గ్రూప్ ఇతివృత్తం మీద "ది అడ్వెంచర్ ఆఫ్ ప్రిస్సిల్లా", "క్వీన్ ఆఫ్ ది డిసర్ట్' 'మురిమల్స్ వెడ్డింగ్' చిత్రాలు నిర్మితమయ్యాయి.

మీ ఆల్బమ్స్ విజయాల వెనుక ఏదైనా రహస్యం ఉందా?

ఉంది. అది మా ఫిమేల్ సింగర్సే. వారి గొంతు అత్యద్భుతం. యునిక్ క్వాలిటీ. దానితోపాటు ప్రొడక్షన్ డిపార్ట్‌మెంట్ కూడా ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుంది. థీమ్స్ విషయంలో కూడా జాగ్రత్త తీసుకుంటుంటాం.

కెరీర్ ప్రారంభంలో స్వీడన్‌లో హిట్స్ సాధించిన మీ గ్రూప్ అమెరికాలో రాణించడానికి కొంత సమయం తీసుకుంది. ఎందుకని?

అమెరికా మార్కెట్ పెద్దదే. అయితే అక్కడ రాణించాలంటే అక్కడే ఉండాల్సి ఉంటుంది. టెలివిజన్ ప్రోగ్రామ్స్‌కి అందుబాటులో ఉండాలి.ఆ సయయంలో స్వీడన్‌లోను మేం బిజీ. అప్పుడే ఒకటే అనుకున్నాం. ఇంటర్నేషనల్ హిట్స్ కొడితే సహజంగా మార్కెట్ పెరిగిపోతుందీ అని. అదే మా విషయంలో నిజమైంది.

మీ గ్రూప్‌లోని ఇతర సభ్యుల గురించి చెప్పండి?

స్టిగ్ ఆండర్సన్ - మా మేనేజర్, మైకెల్ - ఇంజనీర్, గోరెల్ - పర్సనల్ మేనేజర్, పెర్, రోగర్, ఒలా -డ్రమ్మర్స్, రుట్జర్-బాస్సిస్ట్, లెస్సె, జాన్సే-గిటారిస్ట్స్, ఒవె-స్టేజ్ కాస్ట్యూమ్స్ డిజైనర్.

- ఉండవల్లి పవన్‌కుమార్

# న్యూస్ వ్యూస్

## ఉవాచ

ఓసారి రికార్డింగ్ థియేటర్‌లో ఇంజనీర్ పాటని బాలెన్స్ చేస్తుంటే అక్కడ



కొచ్చిన నిర్మాత కొన్ని మాటలు వినబడకుండా బాలెన్స్ చెయ్యమనడం చూశాను. అదేంటండీ అంటే అలా ఉంటేనే ఇవాళ జనాలు వింటున్నారన్నారాయన. దీని గురించి ఇంకొక్క మాట మాట్లాడినా దండగే కదూ. -ఎస్.పి.బాలసుబ్రమణ్యం.

రచయితగా నేను రాసుకున్న భావనలు నాకు గర్వమనిపిస్తాయి. ఈ గర్వం నాకు మరో కళలో ప్రవేశం ఉందనే సంతృప్తికి చెందిన సాహితీగర్వమే. అహంకారం కాదు. ఎందుకంటే ఈ విషయంలో సముద్రాల, కృష్ణశాస్త్రి ఆత్రేయ, శ్రీశ్రీ, వేటూరి, సీతారామశాస్త్రి వంటి వారు నాకెదురుగా కనిపిస్తారు కాబట్టి అహంకరించే అవకాశం లేదు.



-ఎం.ఎం.కీరవాణి

సంగీత దర్శకుడికి శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం ఉందా... లేదా... అనే సమస్య కంటే ప్రజాదరణ పొందగలిగే బాణీలను అందించగలడా లేదా ఇక్కడ ముఖ్యం.



- ఎస్.ఎ.రాజ్‌కుమార్



మాట వినిపించే పాటలనే చేస్తానని మాట ఇస్తున్నాను.

-ఆర్.పి.పట్నాయక్

## అమెరికన్ల కంటే భారతీయులే ఎక్కువ హాస్యప్రియులు - మీరా నాయర్

"అమెరికాలో ప్రజలు అతి బిజీగా ఉంటారు. తన మీద తనకు అదుపు తప్పిపోకూడదన్నట్లు అనుక్షణం ఎలర్ట్‌గా ఉంటారు. అందువల్ల ఓ పట్టాన నవ్వలేరు. భారతీయులకు ఆ బాధ లేదు. అందువల్లనే హాయిగా నవ్వుతారు." ఈ మాట అన్నది 'సలాం బాంబే' ఫేమ్ మీరా నాయర్. 'ది లాఫింగ్ క్లబ్ ఆఫ్ ఇండియా' అనే డాక్యుమెంటరీ తీసే క్రమంలో మీరా 'నవ్వులు - వాటిల్లో నాలుగు రకాలూ' అన్న సబ్జెక్ట్ పై విస్తృతంగా పరిశోధనలు చేసినట్టున్నారు. ఇప్పటికి 5 సినిమాలుతీసి, వాటిలో తాజా చిత్రం "మాన్‌సూన్ వెడ్డింగ్" కు వెనిస్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో బంగారు సింహం అవార్డు పొందినా మీరా ప్రధానంగా డాక్యుమెంటరీ చిత్రాల ద్వారా ప్రసిద్ధి కెక్కారు. హార్వర్డ్‌లో సోషియాలజీ చదువుతూ థీసిస్‌కోసం తీసిన 'జామా మసీద్ స్ట్రీట్ జర్నల్ '(జామా మసీదు పరిసర వాసుల గురించి)తో మొదలుపెట్టి 'నో ఫార్ ఫ్రం ఇండియా'(ప్రవాసభారతీయుల గురించి) 'ఇండియా క్యాబరే' (ముంబయ్ క్యాబరే డాన్సర్ల విషాదగాథలు -దీనికి 1985 అమెరికన్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో బెస్ట్ డాక్యుమెంటరీగా బహుమతి గెల్చుకుంది) వంటి చక్కని హ్రస్వ చిత్రాలు తీసిన మీరా ఇండియాలో ఉన్న 450 లాఫింగ్ క్లబ్బులపై తాజాగా ఈ డాక్యుమెంటరీ నిర్మించింది.



ఈ క్లబ్బుల్లోని సభ్యులు ప్రతీ ఉదయం పార్కుల్లో చేరి 20 ని॥ల పాటు గట్టిగా నవ్వుతుంటారు. జోకులు చెప్పవలసిన అవసరం కూడా లేదు. గట్టిగా నవ్వితే చాలంటారు. ఆచార్య రజనీష్ 'లాఫింగ్ మెడిటేషన్' అనే పేరుతో ఈ ప్రక్రియను ప్రోత్సహించేవారు. మన హైదరాబాదులో కూడా ఈ క్లబ్బు శాఖ ఉంది. మల్లాది రాసిన 'తేనెటీగ' నవలలో దాని ప్రస్తావన కనబడుతుంది కూడా. అయితే అందరూ ఈ నవ్వుల క్లబ్బు విషయాన్ని సరదాగా తీసుకోరు. ముంబయ్‌లోని బాంద్రాలో ఒక పార్శీ మహిళ ఓ క్లబ్బు మీద దావా పడేసింది -పొద్దున్నే గట్టిగట్టిగా నవ్వి తమ నిద్ర చెడగొడుతున్నారని. మీరా నాయర్ ఆ పార్శీ మహిళను కలిసి ఇంటర్వ్యూ చేద్దామని ప్రయత్నించినా ఆవిడ ఒప్పుకోలేదట. వివాదాస్పద చిత్రాలను తీసి ఎంతో మందిని ఎదుర్కొన్న మీరా నాయర్ కూడా ఆ పార్శీ మహిళ ముందు నెగ్గలేకపోయిందన్నమాట !

## పశువుల భాష తెలిసిన డా॥ డూలిటిల్ -2

ఎడ్డీమర్ఫీ నటించిన డా.డూలిటిల్ 2 విజయవంతంగా ప్రదర్శించ బడుతోంది. "డా. డూలిటిల్ (1998)" ప్రపంచ వ్యాప్తంగా 29కోట్ల డాలర్లు సంపాదించడంతో దానికి ఈ సీక్వెల్ తయారయింది.



ఈ పశువుల డాక్టరుగారికి పశువుల భాష తెలియడంతో అది వచ్చి మొరపెట్టుకుంటాయి. మనుష్యులు వచ్చి అడవులు కొట్టేసి మాకు నీడలేకుండా చేస్తున్నారని. డాక్టరుకి ఐడియా వస్తుంది. ప్రత్యేక వన్య ప్రాణులను (ఎన్‌డేంజర్డ్ స్పీసీస్) పట్టుకొచ్చి ఆ అడవిలో పెట్టిస్తే ప్రభుత్వమే ఆ ఆక్రమణ దారులను ఆపుతుంది కదాని అనుకుంటాడు. పసిఫిక్ వెస్టర్న్ ఎలుగుబంటి ఆవా సిటీలో దొరుకుతుంది కానీ దానికి మగసాయం కావాలి. అందుకని సర్కస్‌లో పనిచేసే మగ ఎలుగుబంటిని లాక్కొస్తే దానికి ఈ అడవిపిల్ల నచ్చుదు. ఇద్దరికీ ప్రేమ పుట్టించి డాక్టరు ఎలా నెగ్గు కొచ్చాడన్నదే కథాంశం!

## మడోనా బయోగ్రఫీ

ఆండ్రూ మార్టిన్ తన జీవితంపై రాసిన పుస్తకం మడోనాకు రుచించలేదు. బిబిసికి ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆ పుస్తకం ఏమీ బాగా లేదు. రాయనక్కరలేదని నేను సలహా ఇచ్చినా 'అతను వినలేదు' అంది మడోనా.



## అద్నన్‌కి మరో తురాయి

యమ్. టీవీ. వారు అద్నన్ శామీకి 'బ్రేక్ త్రూ ఆర్టిస్ట్ ఆఫ్ ది ఇయర్' అవార్డు ప్రకటించారు. యమ్.టీవీ. చార్టలలో 54 వారాలపాటు నెంబరువన్ పొజిషన్లో ఉన్నందుకుగాను ఈ గౌరవం! అంతేకాదు, అద్నన్ తొలి ఆల్బమ్ 'కభీతో నజర్ మిలావో' 2 కోట్ల కాపీలు అమ్ముడు పోయినందుకు కూడా!

# టైటానిక్ తార జీవితనౌక

టైటానిక్ సినిమా హీరోయిన్ కేట్ విన్స్‌లెట్‌కి గత పక్షంలో విడాకులు మంజూరయ్యాయి. భగ్నమైన



తన వైవాహిక జీవితాన్ని వర్ణిస్తూ ఆమె ఓ పాట పాడింది. కేట్ 1997లో 'హీగియస్ కింకీ' సినిమా సెట్స్ మీద పని చేస్తుండగా ఆ సినిమా అసిస్టెంటు డైరెక్టరు జిమ్ త్రీయాప్లెటన్ పరిచయమయ్యాడు. ఆ పరిచయం ప్రణయానికి, పరిణయానికి దారితీసింది. మూడేళ్లు తిరక్కుండా ప్రళయంగా మారింది కూడా. "మా అమ్మాయి పుట్టిన తర్వాత మా బంధం మరింత గట్టిపడింది" వంటి స్టేటుమెంట్సు ఇస్తూండగానే ఈ సెప్టెంబరులో ఇద్దరూ విడాకులకి అప్లయి చేశారు. శ్రీశ్రీలా తన బాధను ప్రపంచంతో పంచుకుందామనుకుందేమో 'క్రిస్మస్ కరోల్' అనే తన సినిమాలో ఓ విషాదగీతం పాడింది. వెస్ట్‌లైఫ్, బోయ్‌జోన్‌లకు పాటలకు రాసిన స్టీవ్ మాక్ రాసిన 'వాట్ ఇఫ్' (అయితే ఏం) అనే ఆ పాట ఇలా సాగుతుంది "హియర్ ఐ స్టాండ్ ఎలోన్ విత్ దిస్ వెయిట్ అపాన్ మై హార్ట్ అండ్ ఇట్ విల్‌నాట్ గో ఎవే'.

# కైఫీ ఆజ్మీ పాటలు

కైఫీ ఆజ్మీ సినిమాలకు రాసిన పాటలు 'మేరీ ఆవాజ్ సునో' పేరుతో ఒక పుస్తకంగా విడుదల అయ్యాయి. సినిమాలకు కాకుండా విడిగా కైఫీ రాసిన గీతాలతో "షగుఫ్తగీ" అనే క్యాసెట్ రిలీజయ్యింది. వీటికి సంగీతం సమకూర్చగల సామర్థ్యం ఖయ్యామ్‌కి మాత్రమే ఉందని కైఫీ అభిప్రాయపడ్డారు. కైఫీ-ఖయ్యాంల కాంబినేషన్‌లో వెలువడ్డ ఈ క్యాసెట్ మ్యూజిక్ టుడేవారు విడుదల చేశారు.

# రాజ్‌కపూర్ స్టాంపు విడుదల







రాజ్‌కపూర్ స్టాంపు విడుదల సభలో సునీల్ దత్ కాశ్మీర్ ప్రభుత్వానికి ఒక విలువైన సలహా ఇచ్చారు. తన సినిమాల ద్వారా కాశ్మీర్ అందాలను ప్రపంచానికి పరిచయం చేసినది రాజ్‌కపూర్ కాబట్టి శ్రీనగర్ ఎయిర్ పోర్టుకు రాజ్‌కపూర్ పేరు పెట్టాలని సూచించారాయన.

# ఇళయరాజా కూతురు కూడా....

ఇళయరాజా కుమారులు కార్తీక్ రాజా, యువన్ శంకర్ రాజా, సినీ సంగీత ప్రపంచంలో తమస్థానాన్ని పదిలం చేసుకుంటూండగానే, ఆయన కూతురు భవతారిణి ఇటీవల 'మిత్రూ మై ఫ్రెండ్' అనే ఇంగ్లీషు చిత్రానికి సంగీతాన్ని అందించింది. పెద్దల ప్రశంసలు పొందింది.

# 'వి' ఫర్ విక్టరీ

ఛానెల్ 'వి' కు ఈ సంవత్సరం 6 ప్రొమాక్స్ అవార్డులు 3 బిడిఎ (బ్రాడ్‌కాస్ట్ డిజైన్ అవార్డులు) వచ్చాయి. ఒక ప్రోగ్రాంను ప్రమోట్ చేసే తీరుతెన్నులను విలువ కట్టే అవార్డులు - ప్రొమాక్స్ అవార్డులు. ఛానెల్ 'వి'లో 'ప్రమో 'లు తయారుచేసే టీములో 14 మంది ప్రొఫెషనల్స్ ఉన్నారంటే 'ప్రమో'లకు ఆ ఛానెల్ ఇచ్చే ప్రాముఖ్యత తెలుస్తుంది. 1994 లో 'వి' ఛానెల్ ప్రారంభించినప్పటినుంచి ప్రతీ ఏటా ఈ అవార్డులు గెలుస్తున్నారంటే ఆశ్చర్యమేముంది?

# ష్రెక్



'ష్రెక్' ఏనిమేషన్ సినిమా దేశంలో ఆడుతోంది. ష్రెక్ అనే ఒక గ్రీన్ జయంట్, ఒక గాడిద దీనిలో ప్రధాన పాత్రలు. ష్రెక్‌కి మైక్ మేయర్స్ (ఆస్టిన్ పవర్స్‌ఫేమ్) గొంతు ఎరువిస్తే గాడిదకు ఎడ్డీమర్ఫీ ఎరువిచ్చాడు. సినిమాకు సంగీతం చక్కగా జతపడింది. టెక్నాలజీ సినిమా విలువను మరింత పెంచింది.

# న్యూస్ వ్యూస్

## ఉవాచ



పాట ఏ మాత్రం బావున్నా నా ఇమేజి పాటని లాక్కెళ్ళిపోతుంది కదాని నేను అనుకుంటుండగా ఆ భావాన్ని కనిపెట్టిన సురేష్‌కృష్ణ, అల్లు అరవింద్ నాకు ధైర్యం చెప్పడం మొదలు పెట్టారు. వాళ్ళతో బ్రతిమాలించుకున్నట్టు నటించి చివరికి 'సరే తమ్ముడూ' అనేశాను. ఈ రిలేషనేదో వర్క్‌వుట్ అయ్యేట్టు ఉందని 'తమ్ముడూ' అనే పదంతోనే 'మాస్టర్'లో పాట పెట్టేశారు. -చిరంజీవి



"సెప్టెంబరు 11 బాధితులకై మైకేల్ జాక్సన్, రిక్కీ మార్టిన్, మారియా క్యారీ వంటి ప్రముఖులతో పాటు "వాట్ మోర్ కెన్ ఐ గివ్" లో నా పాట ఎలా చోటు చేసుకుందని చాలా మంది అడుగుతున్నారు. నేను హిందీలో పాడి అక్టోబరులో ఆ ఆల్బమ్ నిర్మాతలకు పంపాను. ఆ తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు. ఇక్కడే ఎవరో చెపితే ఈ మెయిల్ ద్వారా నాకు తెలియబరచారని తెలిసింది."

-అనైదా

"త్యాగరాజు కృతులను తమిళంలోకి అనువదించడం అనవసరమని నా అభిప్రాయం. భాష అందం పోవడం ఒక్కటే కాదు, కృతికర్త ఏ భాషలో తన కృతి శ్రోతలకు చేరాలని ఆశించాడో ఆ విధంగా అందించటమే సబబు."

(-హైదరాబాదులో కచ్చేరీ యిచ్చిన కర్ణాటక సంగీత విద్వాంసురాలు సుధా రఘునాథన్.)

అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

# ఆధా హై చంద్రమా...



| | |
|---|---|
| చిత్రం | : నవ్‌రంగ్ |
| బ్యానర్ | : రాజ్‌కమల్ |
| గీతం | : భరత్ వ్యాస్ |
| సంగీతం | : సి.రామచంద్ర |
| పాడినది | : మహేంద్రకపూర్, ఆశాభోంస్లే |
| అభినయం | :మహీపాల్, సంధ్య |

శాంతారాం చిత్రాలు కళాఖండాలుగా, కళా కారులు జీవితాల గురించిన కావ్యాలుగా ప్రసిద్ధికెక్కినా ఆయన మొదట్లో తీసిన సినిమాలన్నీ సామాజిక సమస్యలకు సంబంధించినవే! వరకట్నం, వితంతు పునర్వివాహం, బాల్య వివాహం, హిందూ ముస్లిమ్ సఖ్యత, జాతీయ సమగ్రత ఇలా ఆయన స్పృశించని అంశంలేదు. చైనాకు వెళ్ళి రోగుల సేవలో ప్రాణాలు అర్పించిన డా॥కొట్నీస్ గాథను తెరకెక్కించిన సాహసి ఆయన.

'ఝనక్ ఝనక్ పాయల్ బాజే (1955)' నుండి శాంతారాం కళకు అంకితమైన సినిమాలకు పేరుబడ్డారు. 'ఝనక్ ఝనక్ పాయల్‌బాజే' కి ముందు శాంతారాం తీసిన 'సురంగ్', 'సుబహ్ కా తారా' సినిమాలు ఫెయిలయ్యాయి. అయినా ధైర్యంగా తన దగ్గరున్న డబ్బంతా పెట్టుబడిపెట్టి టెక్నికలర్లో ఆ సినిమా తీశాడు. ఆ సినిమాకు ఎంతో రిస్కు తీసుకుని అంకితభావంతో పనిచేసిన సంధ్య ఆయనకు చేరువయ్యారు.

'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' సూపర్ హిట్ అయినా శాంతారాం తన తదుపరి చిత్రాలను రంగుల్లో ముంచెత్తలేదు. 'తుఫాన్ ఔర్ దియా' (1956) 'దో అంఖే బారా హాత్' (1957) నలుపు తెలుపుల్లోనే తీసారు. 'నవరంగ్' (1959) కథకు రంగులుపయోగించవలసిన అవసరం పడింది కాబట్టే మళ్ళీ కలర్లో తీశారు. అవీ ఆయన ఎంచుకున్న కొన్ని రంగుల్లో! వాటి ఎంపిక కూడా చిత్రంగా జరిగింది.

## పాట

అ: ఆధాహై చంద్రమా రాత్ ఆధీ  
రహ్ న జాయే తేరీ మేరీ బాత్ ఆధీ  
ములాకాత్ ఆధీ ॥ఆధా॥

ఆ: పియా ఆధీ హై ప్యార్ కీ భాషా  
ఆధీ రహ్‌నేదో మన్‌కీ అభిలాషా  
ఆధీ ఛల్‌కే నయన్  
ఆధీ ఢల్‌కే నయన్  
అభీ పల్‌కోం మేం భీ హై బర్‌సాత్ ఆధీ ॥ఆధా॥

అ: ఆస్ కబ్‌తక్ రహేగీ అధూరీ  
ప్యాస్ హోగీ నహీ క్యా యే పూరీ  
ప్యాసా ప్యాసా పవన్  
ప్యాసా ప్యాసా గగన్  
ప్యాసే తారోంకే భీ బారాత్ ఆధీ ॥ఆధా॥  
సుర్ ఆధా హీ శ్యామ్ నే సాధా  
రహా రాధా కా ప్యార్ భీ ఆధా  
నైన్ ఆధీ ఖిలే  
హోంఠ్ ఆధీ ఖిలే  
రహీ మన్ మేం మిలన్ కీ వో బాత్ ఆధీ ॥ఆధా॥

'నవరంగ్' చిత్రం మొదలు పెట్టడానికి ముందు 'దో ఆంఖే బారా హాత్' చిత్రం క్లయిమాక్స్‌లో ఎద్దుతో పోరాడుతున్న సమయంలో శాంతారాం చావు తప్పి కన్ను లొట్టబోయింది. కంటికి ఆపరేషన్ చేసి కట్లు విప్పేముందు ఆయన కళ్ళముందు అనేక రంగులు కనబడ్డాయి. వాటిలో కొన్నింటికి ఆయన చేసిన రూపకల్పనే 'నవ్‌రంగ్'.

కథాంశం చిన్నదే. ఒక కవి అతిసాదాగా కనబడే భార్యను (పేరు జమునా) చూసి ప్రేరణపొంది, మోహిని అనే ఒక కాల్పనిక సుందరిని ఊహించుకుని, కవిత్వం రాస్తూవుంటాడు. భార్య అపార్థం చేసుకుని జగడం వేసుకుని, కొన్నాళ్ళకు పుట్టింటికి వెళ్లిపోతుంది. అతను కవిత్వం రాయడానికి ముడిసరుకు దొరక్క వ్యర్థుడవుతాడు. 'తూ ఛుపీహై కహా' అనే పాటలో 'జమునా తూ హీహై తూహీ మేరీ మోహినీ' (జమునా నువ్వే నా మోహినివి!) అన్నదే సినిమాకు కీలకం. అది క్లయిమాక్స్‌లో వచ్చేపాట. భార్య అర్థం చేసుకుని చేరువవుతుంది. ఈ కథకు చారిత్రక నేపథ్యం ఏర్పరిచారు. ఓ చిన్న సంస్థానం. దానిలో రాజోద్యోగిగా హీరో తండ్రి. హీరో ఉద్యోగంలో ఇమడలేక పోవడం, ఇంగ్లీషు వాళ్ళు వచ్చి యువరాజుని వ్యసనాలపాలు చేసి రాజ్యాన్ని కబళించడం, రాజు కవిని బంధించి, పాడమని నిర్బంధించి భంగపడడం- ఈ కథంతటినీ ఫ్లాష్‌బ్యాక్‌లో చూపించారు శాంతారాం.

కవిగా మహీపాల్, అతని భార్యగా, ఊహా సుందరిగా సంధ్య నటించారు. సంవత్సరాలపాటు డిజైన్ చేసి, రిహార్సిల్సువేసి నృత్యాలను నిర్దుష్టంగా రూపొందించడంతో అవి మరపురాని దృశ్యకావ్యాలుగా మిగిలిపోయాయి. సంగీతం అందించినది అప్పుడు 'టాప్'లో ఉన్న సి.రామచంద్ర. అతి ధైర్యంగా

కొత్తగాయకుడు మహేంద్రకపూర్ (గత సంచికలలో మహేంద్రకపూర్ ఇంటర్వ్యూ చూడండి) చేత హీరోకి ప్లేబ్యాక్ పాడించి ఈ పాటను హిట్ చేశారు. 'నవరంగ్' పాటలన్నీ ఆణిముత్యాలే. 'ఆధాహై చంద్రమా' పాట మన తెలుగునాట కూడా మారుమ్రోగిపోయింది.

యుగళగీతాలలో సాధారణంగా ఉండే థీమే ఈ పాటలోనూ కనబడు తుంది. పురుషుడు కలయికకు ఆరాటపడతాడు. స్త్రీ ఆగమంటూంటుంది. చుట్టూ చూస్తే మగాడికి అన్నీ సగం, సగమే కనబడు తున్నాయి. రాత్రి సగమే గడిచింది. చందమామ కూడా సగమే ఉన్నాడు. తను చెప్దామనుకున్న మనసులోని మాట కూడా సగంలోనే ఆగిపోతుందేమో, కలయిక కూడా అసంపూర్ణంగా నిలిచి పోతుం దేమోనని భయపడ్డాడు. స్త్రీ గడుసుది. ప్రేమభాష కూడా సగంగానే మిగలాలి. నీ మనసులోని కోరిక కూడా సగంలోనే నిలుపుకో అంది. తన ప్రేమదాహం తీరకుండానే రాత్రి గడిచిపోతుందని అతని భయం. రాధ ప్రేమ కూడా అసంపూర్ణంగానే మిగిలింది కదాని ఆమె వాదం.

పక్షంలో చంద్రుడు సగమే కనిపిస్తాడు. అలాగే రోజులో రాత్రి కూడి సగమే ఉంటుంది. అలా మన మనసుల్లోని భాషని కూడా నగంగానే ఉండనీయకు అంటాడతను.

'గుండె గొంతులోన కొట్లాడుతాది' అన్నారు. అలా ప్రేమ భాష ఎప్పుడూ సగమే. చెప్పేదానికన్నా చెప్పాలనుకున్నదే ఎక్కువగా ఉంటుంది (ప్రియా ఆధీహై ప్యార్ కీ భాషా) కన్నదాని 'కన్నా కల్పించు కున్నదే తీయగా వుంటుంది' అని ఆత్రేయ చెప్పారు. అలా మనసులోని కోరిక కూడా సగంగా మిగిలితే అదొక అందం. (ఆధీ రహ్‌నేదో మన్‌కీ అభిలాషా ) కళ్ళు సగం తెరిస్తే ఓ అందం సగం మూసుకుంటే ఇంకొక అందం. - అర్ధనిమీలనేత్రాలన్నట్టు (ఆధీ ఛల్‌కే నయన్ ఆధీ ఢల్‌కే నయన్)! చివరకి కనులలోని నీరు కూడా సగమే వర్షిస్తోంది. (అభీ పల్‌కోం మేఁ భీ హై బర్‌సాత్ ఆధీ) కనుక మన కోరిక కూడా సగంగా ఉంటేనే బావుంటుంది - అని ముందే హెచ్చరించిందామె.

అయినా అతగాడికివేవీ రుచించలేదు.





కళాకారుడిలోని దాహార్తి అటువంటిది. అందుకే - ఈ ఆశ ఎంతవరకు ఇలా సగంగా ఉండాలి (ఆస్ కబ్‌తక్ రహేగీ అధూరీ) ఈ దాహం పూర్తికాదా? (ప్యాస్ హోగీ నహీ క్యా యే పూరీ) చూస్తుంటే నాకీ ఆకాశం, గాలి, తారల సందోహం అన్నీ దాహార్తితో అలమటించి పోతున్నట్టుగా ఉంది (ప్యాసా ప్యాసా పవన్ / ప్యాసా ప్యాసా గగన్ / ప్యాసే తారోంకే భీ బారాత్ ఆధీ), అని తన గోడును వెళ్ళబోసుకుం టాడతను.

దానికామె కొన్ని సత్యాలు తెలియ జేసిందతనికి - ప్రేమైకమూర్తి అయిన కృష్ణుని మురళీరవం సగమే.... (సుర్ ఆధా హీ శ్యామ్ నే సాధా) అలాగే అతడిని పెళ్లి చేసుకోలేకపోయిన రాధ ప్రేమకూడా సగమే. (రహా రాధా కా ప్యార్ భీ ఆధా) కళ్ళు పెద్దవి చేస్తూ చూసే చూపులుకన్నా సగం తెరుచుకున్న కళ్ళలోనే కనిపించే తన్మయత్వం అందంగా ఉంటుంది. సగం విచ్చుకొని అల్లల్లాడే పెదవుల పొందిక అందంగా ఉంటుంది. అలా మన కలయిక కూడా మనసులో సగంగానే మిగలనీ అని అంటుంది. (నైన్ ఆధీ ఖిలే / హోంఠ్ ఆధీ ఖిలే / రహీ మన్ మేఁ మిలన్ కీ వో బాత్ ఆధీ)

ఈ పాట లిరిక్‌లో ఒక విశేషముంది. సాధారణంగా హిందీ సినిమాలు అని పేరుబడ్డా వాటి మాటలలో, పాటలలో ఉర్దూ సమ్మిశ్రితమైన హిందూస్తానీని ఉపయో గిస్తారు. అందుకే అనేక ఉర్దూ పదాలు పాటల్లో దొర్లుతాయి. కేవలం హిందీ మాటలతో కవిత్వం రాసి 'మాన్'ను మెప్పించడం కష్టం అనుకునేవాళ్ళను తప్పని నిరూపించడానికి కంకణం కట్టుకున్న భరత్ వ్యాస్ ఈ పాటలో అన్నీ హిందీ శబ్దాలే ఉపయోగించారు. గమనించండి.

ఛలక్‌నా అంటే తొణకుట, ఢల్‌నా అంటే వాలిపోవడం, కంటి రెప్పను పలక్ అంటారు, అధూరీ అంటే అస్పష్టము, అసంపూర్ణము, సాధా అంటే నెరవేర్చాడు, సమకూర్చాడు అని. హోంఠ్ - పెదాలు, హిల్‌నా - కదలడం, స్వర్ వికృతి సుర్, ఆశ కు వికృతి ఆస్.

అందమైన ఈ పాట చిత్రీకరణ కూడా అత్యంత సుందరంగా జరిగింది. పాటలో ప్రత్యేక ఆకర్షణ - నెత్తి మీద కుండలు పెట్టుకుని సంధ్య నాట్యం చేయడం.

ఈ పాటకు మాల్‌కౌస్ రాగం ఆధారం. ఈ రాగం మన కర్ణాటక సంప్రదాయంలోని హిందోళకు దగ్గరగా ఉంటుంది. మాల్ కౌస్ రాగంలోని ఈ 'ఆధాహై చంద్రమా' పాట సంగీత ప్రపంచంలో ఎంతో ప్రభావాన్ని చూపింది. కావాలంటే మన తెలుగు సినీ సంగీతంలో - యస్.రాజేశ్వరరావు 'పూజాఫలం' సినిమాలో స్వరపరచిన 'పగలే వెన్నెల జగమే ఊయల' పాటని గుర్తుచేసుకోండి. చరణాల చివర్లో వచ్చే ట్యూన్ ( ఎదలో తేనె జల్లు కలిసిపోదా / ఇలపై నందనాలు నిలిచిపోదా / బ్రతుకే పున్నమిగా వెలిగిపోదా) వింటుంటే ఆధాహై చంద్రమాలో చరణాల చివర వచ్చే ట్యూన్ (అభీ పల్‌కోం మేఁ భీ బర్‌సాత్ ఆధీ / ప్యాసే తారోంకే భీ బారాత్ ఆధీ / రహీమన్‌మే మిలన్‌కీ వో బాత్ ఆధీ) గుర్తొస్తుంది. అలాగే పెండ్యాల 'వాగ్దానం' సినిమాలో స్వరపరచిన 'నా కంటి పాపలో నిలిచిపోరా' పాటలో 'అందుకుందామంటే అందని ఆకాశమే' అనే లైన్లకు జతపరిచిన ట్యూన్ కూడా గుర్తొస్తుంది. ఆ హిందీ పాట ఎంత ప్రభావితం చేసిందో చెప్పడానికి ఈ రెండు ఉదాహరణలు చాలు.




సినిమాలో పాటంటే - కొన్ని సంభాషణలు వ్యక్తపరచలేని భావాన్ని ప్రేక్షకుడి మనసు అట్టడుగు పొరలకు అందించేటట్టు ఉండాలి. పాడే పాత్ర వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించేట్టు ఉండాలి. ఇటువంటి లక్షణాలను పుణికిపుచ్చుకున్న పాటలతో తులతూగిన స్వర్ణయుగంలోనే విడుదలయింది.

## భరణీ వారి చక్రపాణి



భానుమతి భర్త శ్రీ పి.రామకృష్ణ - నిర్మాత, దర్శకుడిగా, కూర్పరిగా వ్యవహరించిన ఈ చిత్రానికి భానుమతీ రామకృష్ణ సంగీత దర్శకత్వాన్ని వహించారు. మాటలు పాటలు రావూరి సత్యనారాయణరావు రాశారు. అక్కినేని నాగేశ్వరరావు, భానుమతి హీరో హీరోయిన్‌లు కాగా టైటిల్ రోల్ 'చక్రపాణి' పాత్రను సి.యస్.ఆర్. పోషించారు. ఈ చిత్రంలో నాలుగు పాటలు, 'పక్కాల నిలబడి' అనే త్యాగరాజ కీర్తన వున్నాయి. ఆ నాలుగు పాటలలో ఓ మూడు పాటలివి:

రాగముతో అనురాగముతో
మెల్ల మెల్లగా నిదురా రావే
మెల్ల మెల్లగా చల్ల చల్లగా రావే నిదురా హాయిగా ॥మెల్ల॥
వెన్నెల దోలికలా పున్నమి జాబిలి పాపవై
కన్నులనూగవే చల్లగా రావే నిదురా హాయిగా ॥కన్నుల॥
మెల్ల మెల్లగా చల్ల చల్లగా రావే నిదురా హాయిగా
పిల్ల తెమ్మెరలా ఊదిన పిల్లన గ్రోవివై
జోల పాడవే తీయగా

రావే నిదురా హాయిగా ॥జోల॥
మెల్ల మెల్లగా చల్ల చల్లగా రావే నిదురా హాయిగా
కలువ కన్నియలా వలచిన తుమ్మెద రేడువై
కన్నుల వ్రాలవే మెల్లగా రావే నిదురా హాయిగా
మెల్లమెల్లగా చలచల్లగా
రావే నిదురా హాయిగా
రాగముతో అనురాగముతో
మెల్లమెల్లగా నిదురా రావే

ఈ పాటకు గానం, అభినయం కూడా భానుమతే....! నిద్రకు ఉపక్రమించే ముందు ఈ పాటను కనుక పెట్టుకుంటే మనసు ప్రశాంతమై అతి త్వరగా నిదుర మబ్బులోకి జారుకోవటం నూటికి నూరుపాళ్ళు గ్యారంటీ అని చెప్పే స్థాయిలో ఉంటుందీ పాట. అలాగే పాట సాహిత్యం కూడా నిద్రకు సంబంధించినదే కావటం వల్ల మనకున్న మంచిజోల పాటల లిస్టులో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకోగల సత్తా వున్న పాట యిది అని పాటను విన్నవాళ్ళెవరైనా ఒప్పుకుంటారు. భానుమతి సినిమాల్లో... కళ్యాణిరాగంలో.... ముఖ్యంగా యమన్ కళ్యాణిరాగంలో ఖచ్చితంగా ఒక్క పాటైనా ఉంటుంది. ఆ సంప్రదాయాన్ని తెలియజేస్తుందీ పాట. చరణాల మధ్య వచ్చే ఇంటరూడ్‌లను గమనిస్తే యస్.రాజేశ్వరరావు యమన్ కళ్యాణిని ఉపయోగించే పద్ధతి గుర్తొస్తుంది. ఈ పాట గనుక దొరికితే వినిచూడండి. మొదట చరణం తరువాత వచ్చే ఇంటర్లూడ్ రాజేశ్వరరావు స్వరపరచిన పాలకడలిపై శేషతల్పమున పవళించేవా దేవా (చెంచులక్ష్మి) పాట నడకను జ్ఞాపకం చేస్తూ వుంటుంది. అందుకు కారణం 'మల్లీశ్వరి 'రోజుల నుండి ఎన్నో మ్యూజిక్ సిట్టింగ్‌లతో రాజేశ్వరరావు గారితో భానుమతి కూర్చోవటం కావచ్చు. ఆమె అభిరుచి మేరకు రాజేశ్వరరావు యమన్‌లో చేసిన కొన్ని పాటల రిపిటేషన్ కావచ్చు. యమన్‌రాగం పట్ల వారివురికీ గల వేవ్‌లెంగ్త్ కావొచ్చు. ఏది ఏమైనా ఇంతమంచి పాటను తిరిగి ఈతరం వారికి అందించే ప్రయత్నం జరిగితే బావుంటుంది. ఇవన్నీ ఇలా వుండగా ఈ పాటలో హవాయిన్ గిటార్‌ను ఉపయోగించిన తీరు ఒక ఎత్తు అయితే స్పష్టత పరంగా 'వ్రాలవే' అంటూ పలికిన భానుమతి వాచకం మరొక ఎత్తు.

ఓ ప్రియురాలా
ఓ ప్రియురాలా
పలుక వేలనే... నాతో...
ఓ ప్రియురాలా. ఓ జవరాలా
ప్రియురాలా... ఓ జవరాలా
పలుక వేలనే... నాతో... ఓ ప్రియురాలా...
ఆ... ఆ... ఆ... ఆ... ఆ...
వెన్నెల సెలయేరున విరబూసిన ॥2॥
కలువవు నీవేనే జవరాలా ॥2॥
నా మదిలో డోలలూగరావే...
ఓ ప్రియురాలా

మిన్నుల పువుతోటల విహరించే ॥2॥
కిన్నెర వీవేనే జవరాలా ॥2॥
నా మదిలో...
నా మదిలో వీణ మీటరావే ॥2॥
ఓ ప్రియురాలా
పొన్నల నీడలలో నడయాడెడి ॥2॥
నెమలివి నీవేనే జవరాలా ॥2॥
నా మదిలో...
నా మదిలో నాట్యమాడరావే ॥2॥
ఓ ప్రియురాలా... ఓ జవరాలా
అలుక లేలనే నాపై... ఓ ప్రియురాలా



ఈ పాటను ఏ.ఎం.రాజా పాడగా అక్కినేని నాగేశ్వరరావు అభినయించారు. పాట చివర్న భానుమతి కూడా వచ్చి సన్నివేశంలో పాల్గొనడం జరుగుతుంది. ఏ.ఎం.రాజాకు ఎన్నో మంచి పాటలున్నాయి. ఆ ఎన్నో మంచి పాటలలో అతి అరుదుగా లభించే పాట ఇది. ఈ పాటకు హిందుస్థానీ సంప్రదాయానికి చెందిన శుద్ధసారంగ్ రాగాన్ని ఉపయోగించారు. హేమంత్‌కుమార్ సంగీత దర్శకత్వంలో వచ్చిన నాగిన్ (1954) సినిమాలోని 'జాదుగర్ సయ్యా ఛోడో మొరెబయ్యా' పాట, రవి సంగీతాన్నిచ్చిన 'ధూల్‌కాఫూల్' లో 'తేరేప్యార్ కా ఆస్‌రా' అనే పాట ఈ రాగానికి మంచి ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. ఆ రోజుల్లో ఈ రాగాన్ని హేండిల్ చెయ్యటంలో సంగీత దర్శకుడు నౌషద్‌కి ఓ ఒరవడి ఉండేది. ఈ 'ఓ జవరాల' పాటతో 'పొన్నల నీడలలో నడయాడెడి' చరణం ముందు వచ్చే ఇంటర్లూడ్‌ని కనుక వింటే భానుమతి మీద కూడా నౌషద్ ప్రభావం ఉందనిపిస్తుంది. ఒకసారి వింటే మళ్ళీ మళ్ళీ వినాలనిపించే పాట ఇది.

ఉయ్యాల జంపాల లూగ రావయా
తులలేని భోగాల తూగీ ॥ఉయ్యాల॥
తాతయ్య సిరులన్ని వేగ రప్పింప
జాబులో పుట్టినా బాబూ నీవయ్యా
జాబులో పుట్టినా బాబూ నీవయ్యా ॥ఉయ్యాల॥
మా మనోరమక్కాయి మదిలోన నిలిచి
ఎదురింటి ఇల్లాలి ఒడిలోన వెలిసి
ఎత్తుకొని ముత్తాత ఎంతెంతో మురిసి
ఎత్తుకొని ముత్తాత ఎంతెంతో మురిసి
నా వారసుడా అంటూ నవ్వురా కలసి ॥ఉయ్యాల॥
మా మదిలో కోర్కెలను మన్నింప దయతో
అవతరించినావయ్యా అందాల రాశి
చిన్ని నా తండ్రికి శ్రీరామరక్ష
తప్పకా ఇత్తురా తాతయ్య లక్ష ॥ఉయ్యాల॥



కథా గమనాన్ని తేట తెల్లం చేసే ఈ పాట సాహిత్యాన్ని గమనించగానే సిట్యుయేషన్ సాంగ్‌కి ఉండవలసిన లక్షణం అంటే ఇదికదా అనిపిస్తుంది. మనవడు తనతో పోట్లాడి ఇల్లు వదలి పోవటం వల్ల - పెళ్ళయి అత్తవారిళ్ళలో ఉన్న మనవరాళ్ళలో ఎవరు తనకు ముందుగా మునిమనవణ్ణి ఇస్తారో వారికి లక్ష రూపాయలిస్తానని ప్రకటిస్తాడు సి.యస్.ఆర్! దాన్తో మనవరాళ్ళ మధ్య పోటీ పెరుగుతుంది. అందులో ఒక మనవరాలైన భానుమతి తను మనోరమక్కాయ్ అంటూ  ఆప్యాయంగా పిలుచుకునే సూర్యకాంతం ఇచ్చిన సలహాపై ఎదురింట్లో కొత్తగా దిగిన ఇల్లాలి ఒడిలోని పిల్లాడిని తీసుకువచ్చి తన కొడుకేనని తాతయ్యకి చూపించాలని నిశ్చయించుకుంటుంది. సదరు నాటకంలోని భాగంగా పిల్లాడిని ఉయ్యాల్లో వేసి జోలపాడి నిద్రపుచ్చే తతంగాన్ని ఓ రిహార్సిల్‌లా భానుమతి చేత చేయిస్తుంది సూర్యకాంతం. ఆ సందర్భంగా వచ్చే పాట ఇది.

భీంప్లాస్ రాగంలో స్వరపరచిన ఈ పాట ఈ నాటికీ వినసొంపుగా ఉంటుంది. 1950 దశకంలో వచ్చిన పాటలలో లాగానే ఈ పాటలలోనూ హవాయిన్ గిటార్ వాద్యం వేరుచేసి పాడుకోలేనంతటి ప్రాధాన్యతతో పరవశింప చేస్తూ ఉంటుంది.

1954లో 'చక్రపాణి' విడుదలయిన సుమారు ఇరవై ఏళ్ళకి 'తల్లిదండ్రులు' అనే చిత్రం వచ్చింది. ఆ చిత్రంలో 'ఈనాడు అమ్మాయి పుట్టిన రోజు' అనే పాటను ఘంటసాల స్వరపరిచి సుశీలతో పాడేరు. ఆ పాట వినగానే 'ఇది ఉయ్యాల జంపాల లూగరావయ్యా పాటని తీసుకు చేసేశారు'' అనేశారు కొంతమంది. నిజానికి ఆ పాటకి, ఈ పాటకి పల్లవిలోని మొదటి ఆరు అక్షరాల వరకే స్వరపరంగా కాస్త పోలిక కనపడుతుంది. అది యాదృచ్ఛిక సామ్యమే తప్ప కాపీగాని, ప్రేరణ గాని కానే కాదు. అయినా సరే కొంతమంది అటువంటి అభిప్రాయానికి లోనయ్యారంటే అది ఆ 'ఉయ్యాల జంపాల లూగరావయ్యా' పాట వేసిన చెరగని ముద్ర ప్రభావమే తప్ప వేరొకటికాదు.

సంగీత పరంగా చూసుకున్నా, హాస్య ప్రధానంగా చూసుకున్నా 'చక్రపాణి' తెలుగువాళ్ళందరూ గర్వంగా చెప్పుకోదగ్గ సినిమా. తెలుగుతనం ఆ సొంతం పుట్టిపుడుతూ వుంటుంది. చిన్న సమస్యని అతి సున్నితంగా చిత్రీకరించడం ఎలా అనే విషయాన్ని ఈ సినిమా చూసి తెలుసుకోవచ్చు.






'ఏనిమల్' స్టోరీ బోర్డ్ నుండి

# సగం జంతువుగా రాబ్ స్నైడర్

ప్రస్తుతం ప్రదర్శితమవుతున్న "ది ఏనిమల్" ఒక వింత రకం కామెడీ చిత్రం. ఉదాత్తమైన హాస్యం కోసం ఎదురు చూసేవారు ఈ సినిమా జోలికి పోనక్కరలేదు. ఒక పాత జోక్ వినే వుంటారు. ఒక మనిషికి ఆపరేషన్ చేసి వేరే ఏదీ దొరక్క కుక్క గుండెను అమర్చారట. కొన్నాళ్లకు డాక్టరు కనబడి అడిగితే, "అంతా బాగానే ఉంది కానీ, అదేమిటో కరంటు స్తంభం చూసినప్పుడల్లా కాలెత్త బుద్దేస్తోంది' అన్నాట్ట ఆ పేషంటు.

ఆ జోక్‌కి ఎక్స్‌టెన్షన్‌లాటి సినిమా ఇది. హీరో ఓ ఆఫీసులో గుమస్తా. తండ్రిలా పోలీసు అవుదామని కోరిక. కానీ మెడికల్ టెస్టులో ఫెయిలవుతూండడం వల్ల పోలీసుగా సెలక్టు కాడు. ఓ సారి ఆఫీసు డ్యూటీ మీద వెళుతూ పెద్ద ఏక్సిడెంటుకు లోనవుతాడు. అతడిని కాపాడిన ఓ తిక్క ప్రొఫెసరు ఆపరేషన్ చేయడంలో కొన్ని జంతువుల భాగాలు మార్చుతాడు.

ఇక్కణ్నుంచి సినిమా ఎటువంటి మార్గాలు పట్టిందో ఊహించుకోవచ్చు. హీరోకి వాసనపట్టే శక్తి ఎక్కువై పోతుంది. గుఱ్ఱం కంటె వేగంగా పరిగెట్టగలడు. కుక్క కంటె పైకి హై జంపు చేయగలడు. స్మగ్లర్ మోసుకెళ్లే సంచులలో మత్తుమందులను వాసనచూసి పట్టేయగలడు. కానీ ఇవన్నీ బాగానే ఉన్నాయి. కానీ మేకల్ని చూస్తే తనను తాను కంట్రోలు చేసుకోలేడు!

హీరోయిన్ చూడబోతే ఏనిమల్ రైట్స్ ఏక్టివిస్ట ('భారతీయుడు'లో మనీషా కొయిరాలావంటిది) ఇతనిలో జంతు లక్షణాలు చూసో ఏమో, ఇతనంటే ఇష్టపడుతుంది. కానీ ఆ లక్షణాలు ఇబ్బంది పెట్టేవి కదా! లోబ్రో సినిమాయే ఐనా జోకులు మరీ అంత చికాకుగా లేవు.

ల్యూక్ గ్రీన్ ఫీల్డ్ దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో హీరోయిన్ కొలీన్ హాస్కెల్ అయితే హీరో రాబ్ స్కెనైడర్ టీవీ దారా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన రాబ్ 'డ్యూస్ బిగాలో; మేల్ జిగోలో' సినిమా ద్వారా ప్రేక్షకులకు పరిచితుడు. 'ఏనిమల్' చిత్రానికి 10 లక్షల డాలర్ల పారితోషికం తీసుకున్న రాబ్ ఆ సినిమాకు సహ నిర్మాత కూడా.

1963 అక్టోబరు 31న శాన్‌ఫ్రాన్సిస్కోలో జన్మించిన రాబ్ తల్లి ఫిలిప్పీన్స్‌కి చెందినదైతే తండ్రి యూదు మతస్తుడు. అయిదుగురి సంతానంలో రాబ్ చివరి వాడు. తల్లి పిలార్ టీచర్. తండ్రి రియల్ ఎస్టేట్ బ్రోకర్. టెర్రనోవా హైస్కూలులో చదివిన తర్వాత 1987లో 'లేట్ నైట్ విత్ డేవిడ్ లెట్‌మెన్'షోలో తొలిసారి కనబడడంతో అతని కెరియర్ ఆరంభమయింది.

'సాటర్ డే నైట్ లైవ్' ప్రోగ్రాములు ఎన్నో ఇచ్చి ప్రేక్షకులకు చేరువయ్యాడు. శాన్‌ఫ్రాన్సిస్కో కామెడీ క్లబ్బులలో పని చేస్తూ తన ప్రతిభకు మెరుగులు దిద్దుకున్నాడు. సుమారు 50 మంది ప్రఖ్యాత నటులను అతను అనుకరించగలడు. మాంటీపైథాన్, రిచర్డ్ ప్రయర్, పీటర్ సెల్లర్స్ వంటి వారి నటన చూసి ప్రేరణ పొందాడు.

సాటర్ డే నైట్ లైవ్ చేస్తుండగానే సెట్సులో తనతో పని చేసిన హాస్యనటీమణి, బొలియా స్వీనియాతో తిరిగేవాడు. చివరకి ఓ మాజీ మోడల్‌ను పెళ్లాడి కొద్దికాలానికి డైవోర్సు యిచ్చేసాడు. పునర్వివాహం చేసుకున్నాడు. అతనికో కూతురు.

సాటర్ డే నైట్ లైవ్ ప్రొడ్యూసర్ లార్న్ మైకేల్ రాబ్‌ను కలవడం విచిత్రంగానే కలిసాడు. హెచ్‌బిఓ వారి 13వ ఏన్యువల్ యంగ్ కమెడియన్స్ స్పెషల్‌లో చూసి అతన్ని ఆ ప్రోగ్రాంకు రచయితగా తీసుకున్నాడు. అప్పుడతని వయస్సు 27 సం॥లు. 1992 వరకు టీవీ సీరియల్స్ రాసేవాడు. తరువాత 'డ్యూస్ బిగాలో: మేల్ జిగోలో' చిత్రానికి కథ రాసాడు.






ఆ కథ తమాషాగా ఉంటుంది. దానిలో హీరో (రాబ్) ఒక ఫిష్‌ట్యాంక్ క్లీనర్. ఒక జిగోలో (మగవేశ్య) అతని కస్టమర్. అతనికి ఊరు వెళ్లే పనిబడితే రాబ్‌ను తన ఇంట్లో ఉండి జబ్బుపడ్డ చేపలను జాగ్రత్తగా చూసుకోమంటాడు. కానీ ఖర్మ కాలి రాబ్ చేతిలో ఆ ఇంట్లో వస్తువులు నాశనమవుతాయి. ఆ ఫ్రెండుకి డబ్బిచ్చుకోవాలి ఎలాగా అని వర్రీ అవుతూంటే ఆ జిగోలో దళారి రాబ్‌కి సలహా ఇస్తాడు. 'నువ్వూ జిగోలో అయిపోయి డబ్బు సంపాదించు' అని. రాబ్ ఆ సలహా పాటించడంలో అనేక ఫన్నీ సంఘటనలు ఎదురవుతాయి. చివరికి ఆడవాళ్ళని అర్థం చేసుకుంటే ఈ తిప్పలుండవన్న నీతిబోధ కూడా ఉంది. రాబ్ 'ది ఏనిమల్'కు స్క్రీన్ ప్లే రాశాడు. 2002లో రిలీజు కాబోయే 'హాట్ చిక్'కు కూడా రచయితగానే ఉన్నాడు.

'డ్యూస్ బిగాలో'లో రాబ్ తల్లి కూడా చిన్న వేషం వేసింది. అమ్మాయిని హోటల్‌కి తీసుకెళ్ళినప్పుడు అక్కడ తారసిల్లే ఓ స్త్రీయే రాబ్ తల్లి. 5'5" ఎత్తున్న రాబ్‌కి పాతమోడల్ దుస్తులు వేసుకోవడం, సిగార్‌లు కాల్చడం ఇష్టం. 2001లో టీవీలో వచ్చిన ది మమ్మీ పెరేడ్‌లో మమ్మీగా నటించిన రాబ్, 2002 సంవత్సరంలో రాబోయే '8 క్రేజీనైట్స్'లో గొంతు అరువివ్వబోతున్నాడు!




కీర్తిశేషులైన డా॥ తోలేటి చంద్రశేఖరరావు వృత్తిరీత్యా వైద్యుడు. ప్రవృత్తిరీత్యా రచయిత, నటుడు. ఆయన కార్యకలాపాలకు కేంద్రస్థానం విశాఖపట్నం. 'తంబు' (దాన్నుంచే ముందుమాటలో వెలువోలు బసవ పున్నయ్య పన్ చేశారు - 'ఆయన కాయం వట్టి వేలిముద్ర, ఆయన భావం సజీవముద్ర, ఆయన పలుకు ముత్యాలముద్ర' అని.) పేరుతో నాటికలు నాటకాలు, కథలు, వ్యాసాలు, శీర్షికలు ఎన్నోరాయడమే కాక విశాఖపట్నంలో సినిమా తీసినవారికి సహాయ, సహకారాలు అందించారు. తంబు హాస్యం ఆలోచనలు రేకెత్తించే హాస్యం.

సమాజంపై వ్యంగ్యధోరణిలో వ్యాఖ్యానించడానికి ఆయన అనేక శీర్షికలు నడిపారు.

1974-75 సంవత్సరాల మధ్య "ఈనాడు" విశాఖపట్నం నుండి వెలువడే రోజుల్లో 'తంబింప్రెషన్' పేర డా॥ తంబు నడిపిన ఓ వీక్లీ ఫీచర్‌లోని 70 వ్యాసాలను భరాగో (శ్రీ భమిడిపాటి రామగోపాలం) ప్రేరణతో 'తంబింప్రెషన్' అనే పుస్తకం తంబు భార్య డా॥ పద్మావతి వెలువరించారు. ఆ వ్యాసాలతో బాటు తంబును కథకుడిగా నిలబెట్టిన మొదటికథ 'గుండు కథ' ను చేర్చారు.



విశాఖపట్నం నుండి వెలుపడే దిన పత్రికకు రాశారు కాబట్టి ఆ ఊరికి సంబంధించిన విషయాలు, ఆ కాలంలో హాట్ టాపిక్ అయిన 'స్టీలు ఫ్యాక్టరీ' గురించిన వ్యాఖ్యలు ఎక్కువగా కనబడినా సార్వజనీనమైన కామెంట్సు కూడా ఎన్నో కనబడతాయి. మచ్చుకు వాటిలో కొన్ని -




## లోకపు తీరు

నున్నటి గుండు చూస్తే ఎవరికైనా సరే ఒక్కసారి చెయ్యి వెయ్యాలనిపిస్తుంది.

కవిత్వంలాగానే కొంతమందికి గుండు కూడా సహజంగానే వస్తుంది.

కాని వాళ్ళు 'బ్రాకెట్'ని జూదమని, అయినవాళ్ళు అదొక సంఖ్యాశాస్త్రమని అనుకుంటారు.

## సామెతల హాస్యం

అందితే జుట్టు, లేకపోతే కాళ్ళు పట్టుకునే వాళ్ళు కూడా గుండువాళ్లని ఏమీ చెయ్యలేరు. ఎందుకంటే వాళ్లకి గుండుగా!




"శివ శివా! నీకు తెలియకుండా నా దగ్గర డబ్బేముంటుంది పార్వతీ!" అని పరమశివుడు వళ్లు దులుపుకునేసరికి బోల్డెంత బూడిద రాలింది. దాంతో పాముకి తుమ్ము వచ్చింది.

నారు పోసినవాడే నీరు పొయ్యాలి - అంటే అగ్గిపెట్టి ఇచ్చినవాడే సిగరెట్టు కూడా ఇవ్వాలి.

"మనం మాట్లాడుతూ భోంచేస్తే పొలమారుతుంది. ఉక్కిరి బిక్కిరి అవుతాం. అవునా.. అలాగే కుక్క మొరుగుతూ కరిస్తే దానికే ప్రమాదం. అందుకే మొరిగే కుక్క కరవదు.

పరిపాలనలో నెలకి మూడు వర్షాలు పడడం వల్ల, ధర్మం నాలుగుపాదాలా జాగ్రత్తగా బురదలో జారిపోకుండా నడిచేది.

చేపని ఎండపెట్టారు చేప ఎండలేదు. "చేపా చేపా ఎందుకు ఎండలేదు?" అని అడిగితే కథ బోరుకొడుతుందని అడగడం మానేసి, మర్నాడు మళ్ళీ వేటకి వెళ్ళి ఏడుగురు రాజకుమార్తెల్ని తీసుకువచ్చారు. వాళ్ళని ఎండలో పెడితే బావుండదని నీడలోనే వుంచారు. కొన్నాళ్ళకి ఒక్కొక్కరికి ఏడుగురు కొడుకులు పుట్టారు.

"నా బంగారు కన్నంలో వేలుపెడితే కుట్టనా" అంది చీమ. వెంటనే బంగారం కోసం రాజకుమారులు పరుగుపరుగున చీమ కన్నం వెదుక్కుంటూ వెళ్ళారు. కానీ, ఇదే కథ రహస్యంగా వింటూన్న నిఘా విభాగంవారు వీళ్ళకంటే ముందేవెళ్ళి చీమని నిర్బంధించి బంగారం స్వాధీనం చేసుకున్నారు.

## పన్‌లు, చమత్కారాలు

మురికిపాలిటి

గంధకిత కితకామ్లము,

గాధ గంధ కుతకుత కామ్లము

ఆ ఊళ్లో కలరాకి క్షయకి కలిపి 'కక్ష' ఆస్పత్రిని వూరిబయట కట్టించారు.

అబ్బాయికి కొంచెం దురలవాట్లు అబ్బాయని కొందరు ఆడిపోసుకున్నా అవన్నీ దొరలవాట్లని సర్దుకోవాల్సి వచ్చింది.

ఓట్ల కాన్‌వాషింగ్

ఒక్కోసారి ఆట పట్టింపులు మాట పట్టింపులుగా మారి కొంచెం హద్దు మీరడం జరిగేది, ఆఖరికి సరిహద్దు తగాదాల వరకూ వచ్చేది.

తీసుకున్న అప్పు పువ్వుల్లోపెట్టి ఇచ్చేస్తాననీ, పువ్వులు ఇప్పుడే రెడీగా వున్నాయని డబ్బులే కాస్త ఆలస్యం అవుతుందని అన్నాడు.

సురేష్‌కి తిరపతి వెళ్ళకుండానే గుండయిపోయింది.

### మధ్యతరగతి జీవులు

"మాస్టారూ స్కోరెంత?"

"కిలో బియ్యం రెండ్రూపాయిల ఎనభై పైసలు. మన రూపాయి విలువ

ఇరవై ఏడు పైసలు" అన్నాడు స్కూలుమాష్టారు ఒళ్లుమండి.

"అంటు రోగుల్ని ఇంటికి రానిచ్చినా వూరుకుంటాను కాని వూరికినే స్కూలు మాష్టార్ని రానిస్తే మాత్రం నేనూరుకోను, 'డాక్టర్‌గారూ డాక్టర్‌గారూ' అంటూ వచ్చి నెలాఖరులో అప్పు అడుగుతారు." అంది డాక్టరు గారి భార్య.

## వర్ణనలు, పోలికలు

శంఖు చక్రాల్లా గొట్టం, డబ్బా అతని రెండు చేతుల్లోనూ వుంటాయి కాబట్టి కొందరతన్ని 'గొడ' అప్పారావు అంటారు. అతను గవర్నమెంటు జీపుల్లోనూ, ప్రభుత్వ రంగపు బస్సుల్లోనూ అడపాదడపా ఆదమరుపుగా వదలిన కారు టేంకుల్లోవున్న పెట్రోల్ని, డీజిల్ ఆయిల్ని -పువ్వుల్లోంచి మకరందాన్ని భ్రమరం ఎంత తేలిగ్గా లాగేస్తుందో అంత సులువుగా గొట్టంవేసి డబ్బాలోకి లాగేస్తాడు.

ఆకాశవాణిలో ప్రసంగం విన్న ప్రజల్లాగ గ్రామస్తులు మొహాలు అదోలా పెట్టుకొన్నా

"రోడ్డులు - భోర్డులు" శాఖ తీవ్రంగా 'ఆట్లమ్మలా' అభివృద్ధి చెందసాగింది.

వెంకట రాజేష్‌ఖన్నా పిట్టగోడల్లాంటి సదరు స్పీడ్ బ్రేకర్లు దాటుతూ కారుతో సహా ఒక స్పీడ్ బ్రేకర్ మీద గోడమీద పిల్లిలా వుండిపోయాడు.

సస్యశ్యామలంగా పచ్చగా, కన్నులపండుగగా వుండే రాజ్యం క్షవరం చేసినట్లు తయారైంది. చల్లదనంలేక మేఘాలన్నీ పొరుగుదేశాలకి తరలిపోసాగాయి. బీడులన్నీ కొన్నాళ్ళకి ఎడారులై రాజుగారి బట్టతలలా క్రమంగా వ్యాపించసాగాయి. పండ్లకోసం బెంగపెట్టుకుని రాజుగారి పళ్ళన్నీ వూడిపోయి మంచంపట్టారు.

కథ అలాగ స్టీల్‌ప్లాంట్‌లాగ ఆగిపోయే సరికి...

ఆకాశవాణి వారి సూక్తిముక్తావళి కార్యక్రమము వోలె శ్రోతలు నిద్దురపోయిననూ నిర్దాక్షిణ్యముగా కొనసాగించసాగినారు.

భర్త రామారావుకంటే భార్య సీతమ్మ ముందుగా నిద్రలేచి మంగళసూత్రం కళ్ళకద్దుకుని భర్త పాదాలమీద ధూళి దొరుకుతుందేమోనని ప్రయత్నించి, దొరక్కపోయినా నెత్తిమీద జల్లుకున్నట్టు అభినయించింది.

పొద్దెక్కిపోతున్నా రామారావు నిద్రలేకుండా పడుకుంటే - లేటుగా వచ్చేక్లర్కుని చూసి తోటి క్లర్కులు అసూయపడ్డట్లు కాకులు కొన్ని కిటికీ దగ్గరచేరి కాకిగోల చేశాయి.

చంటాడు "అమ్మకావాలి" అనే పాటని రకరకాల రాగాల్లో, సాధ్యమైనన్ని స్థాయిల్లోనూ పాడుతూ వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

రోజురోజుకి స్వామివారి భక్తులు కలరాలాగ వ్యాపించసాగారు.

"ఓ నటరాజా, సినిమాల్ని విమర్శించగల మగతనం పత్రికలకి లేకపోయినా, అందరూ నాటకాల్ని బూతులు తిడుతున్నా నువ్వు అర్ధనారీశ్వరుడివి కాబట్టి నిశ్చలంగా చూస్తూ వూరుకుంటున్నావు."

గాలికి దీపం రెపరెపలాడింది. పేషంట్ ఆరోగ్యంగా వున్నా డాక్టర్ గారికి భయం వేసింది. చిన్నప్పటినుండీ చూసిన తెలుగు సినిమాల్లో చావు సీనులన్నీ గుర్తుకొచ్చాయి. 'లైఫ్ ఇన్సూరెన్సు' వాళ్ళ చిహ్నంలా రాత్రంతా దీపాన్ని కాపాడ్డం కోసం అలాగే వుండి పోయారు. దీపం ఆరిపోలేదు. పేషంట్ బతికాడు. మర్నాడు మాత్రం డాక్టర్‌గారికి సుస్తీ చేసింది.

## రవాణా సౌకర్యాలు

బస్ ఎప్పుడొస్తుందోనని పదిపైసలిచ్చి చిలక జోస్యం అడిగాను. చిలక చిర్నవ్వు నవ్వి వెళ్ళిపోయింది.

ఆర్టీసి బస్‌లు లేటుగా రావడమంత రివాజై పోయింది.

"ఓడలు బళ్ళవుతాయా?" అనడిగాడు మల్లిఖార్జునరావు బస్ కోసం మరి నిలబడలేక. "బళ్ళు మాత్రం ఓడలవుతున్నాయి. రెండు రోజుల వర్షానికి" అని చెప్పాను.

రైల్వేగేటువాడికి శిక్ష విధించడానికి అతన్ని అదే గేటు వద్ద పట్టాలకు కట్టేశారు. దాంతో వాడు మరణించాడు. రైలుకింద పడికాదు, రైళ్ళు లేటయి. ఆకలి బాధకి తట్టుకోలేక చచ్చిపోయాడు.

"ఆత్మద్వారానే పరమాత్ముని చేరుకోవాలని, ఆత్మ ఆటమ్‌లాంటిదని గతంలో తమరు సెలవిచ్చారు. కానీ స్వామీ ఆత్మ అనేది ఆర్టీసీ బస్సు లాంటిదని నాకు అనుమానం బస్సెక్కితే , పక్క వూరు ఎప్పుడు చేరుకుంటామో గాని ప్రమాదం జరిగితే తిన్నగా పరమాత్ముని చేరుకుంటాం"

## లోకంపై విసుర్లు

ఉన్నతాధికారులు సముద్రగుప్తున్ని ఉద్యోగంలోంచి తీసేస్తే ఉన్నట్టుండి ఏ రాజకీయ నాయకుడిగానో మారిపోతాడేమోనని భయపడ్డారు.

వసుదేవుడనే నిరుద్యోగి ఎవరినైనా ఆపి "మేష్టారూ నా కాళ్ళకి సాష్టాంగ నమస్కారం చేస్తారా? ఐదు రూపాయిలిస్తాను" అనేవాడు, దాన్తో సదరు పెద్ద మనిషికి వళ్ళుమండి "ఏడిశావు నువ్వే నా కాళ్ళకి సాష్టాంగ నమస్కారం చెయ్యి పదిరూపాయలిస్తాను" అనేవాడు, వసుదేవుడు ఆ పని చేసి పదిరూపాయిలు సంపాదించేవాడు.

'కావాలంటే మేం ప్రాణం ఇస్తాం, రక్తం మాత్రం అడక్కండి' అని చుట్టాలు నసగసాగారు.

పారిపోతున్న దొంగని పట్టుకోవాల్సి వస్తుందేమో. 'తీరా పట్టుకుంటే వాడేం చేస్తాడే' అని కొందరు ముందు చూపుతో అక్కడ ఆగకుండా వేగంగా వెళ్ళిపోసాగారు.

కుక్కలకి విశ్వాసం ఎక్కువ. మనుషుల్లా ప్రతీ అడ్డమైన వాడికి జైకొట్టవు. తిండి పెట్టిన వాడికే తోక ఆడిస్తాయి.

ధర్మరాజులాంటివాడు జూదం ఆడాడు. ఆలిని, అనుంగు సోదరుల్ని, అన్నిటినీ పోగొట్టుకున్నాడు. అవన్నీ గెల్చిన కౌరవులు పెద్ద బాగుపడిందేమీ లేదు. సమూలంగా నాశనమయ్యారు.

గొప్ప భక్తుల్ని బాజాభజంత్రీలతో తీసుకెళ్తున్నారు. "అంతకంటే గొప్పభక్తులొస్తే అధికారులు దేవుడ్నే వాళ్ళ కాళ్ళ దగ్గరికి తీసుకొచ్చి చూపిస్తారు" అన్నాడు అప్పారావు.

క్యూని ఆపుచేసి మమ్మల్ని లోపలికి పంపిస్తుండగా - "అన్యాయం అన్యాయం" అని వెనక నుండి విన్పించింది."దేవుడి సమక్షంలో అన్యాయం జరగదు. అయితే కొందరు పుణ్యాత్ములు పూర్వ జన్మ సుకృతం కొద్దీ క్యూలో నిలబడకుండా వెళ్ళే వరాన్ని దేవుడే ప్రసాదిస్తాడు".

స్వామీజీ 'సందేహానంద'ని పిలిచి పండురసం తీసుకురమ్మన్నాడు. "స్వామీజీ! తమరు గాలిలో చెయ్యి తిప్పి అన్నీ తెప్పించగల సమర్థులు సండురసం మాత్రం తెప్పించుకోలేరా" అని సవినయంగా, అమాయకంగా అడిగాడు శిష్యుడు సందేహానంద.

## గవర్నమెంటాలజీ

'తారు రోడ్డు తివాసీ'ని కనిపెట్టాను. తివాసీలా ఈ రోడ్డుని రెండు నిముషాల్లో పరచి సిద్ధం చెయ్యగలను.

దొంగని పట్టేసుకున్నారు కాబట్టిన్నూ పారిపోవడానికి వీల్లేకుండా



బోల్డంతమంది చుట్టూ జనం పోగయ్యారు కాబట్టిన్నూ, దొంగను పట్టుకోవడానికి పోలీసులు కూడా వచ్చారు.

దేశంలో పగలు కూడా చీకటి వ్యాపారాలు సాగుతున్నాయి. కాబట్టి రాజుగారు పట్టపగలు కూడా అప్పుడప్పుడు వీధి దీపాలు వెలిగించి వదిలేస్తూ ఉండేవారు. పగలు వీధి దీపాలు సరిగ్గా వెలుగుతున్నాయా లేదా అని పర్యవేక్షణ చెయ్యడానికి ప్రత్యేక అధికారుల్ని నియమిద్దామని రాజుగారు సంకల్పించారు.

"ముగ్గురు సభ్యులున్న ఇటువంటి సలహాసంఘాల్లో - ఎదుటివాని దృక్పథంచూడలేని గుడ్డివాడొకడు, పక్కవాడిమాట వినిపించుకోని చెవిటివాడొకడు, మొహమాటానికి కూడా మాట్లాడలేని మూగవాడొకడు వుండడం శ్రేయస్కరం.

## ప్రేమికులు, భార్యాభర్తలు

రాంబాబు ఎందుకీ ఘోర తపస్సు ప్రారంభించాడో తెలియక దేవేంద్రుడు ఖంగారుపడి రంభ, ఊర్వశి, మేనక మరియు తిలోత్తమలను రాంబాబు తపోభంగం చెయ్యమని పురమాయించి పంపాడు. రాంబాబు మూసుకున్న తన కళ్ళలో ఒకటి సగం తెరచి, నలుగురు అప్సరసల్నీ చూసి తపస్సు మానెయ్యడానికి తనకు అభ్యంతరం లేదు కానీ తన భార్య నళినికి ఈ విషయం తెలిస్తే వాళ్ళు నలుగురూ క్షేమంగా తిరిగి వెళ్ళలేరని మాత్రం తెలియచేశాడు.

"అవునుమరి! ఒరే చిన్నప్పుడు హార్మణీ వాయిస్తూ ఉండేది మా చిన్న చెల్లెలు. నువ్వు చూసే ఉంటావు. అచ్చు వాణిశ్రీలాగ ఉంటుందని మా అమ్మ అంటుంది. అది మాత్రం హేమమాలినిలా వుంటాననుకుంటుంది!

అర్జునుడు చీకట్లో భోజనం చేసి శబ్దభేరి విద్య నేర్చుకున్నట్లు ఆ లవర్స్ ఇద్దరూ "పవర్‌కట్"నే నమ్ముకుని ఎన్నో నేర్చుకోవాలనుకున్నారు.

## కళాకారులు

'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?' అని నువ్వు పుస్తకం రాసి అచ్చువేసినా ఆ పుస్తకం అట్టమీద పెద్ద అక్షరాలతో నీ పేరే వేసుకుంటావు. ఆ పుస్తకాన్ని అచ్చు వేసిన కంపోజిటర్ల పేర్లు రాయవు.

ఒక విప్లవ కవిత్వం సాగిందిలా - 'విప్లవం అనే కలంతో పేదల రక్తపు సిరాలో - రేపు అనే తెల్లకాగితం మీద భవిష్యత్ అనే భాషలో - నీ కోసం రాస్తున్నానిది. ఎల్లుండి రాస్తా మిగిలింది.'

చివరికి నాటక సమాజం వారు కుట్రపన్ని అతనితో రాజీకొచ్చినట్లు సన్మానం ఏర్పాటు చేసి ఇంత గొప్ప రచయిత వెంటనే సినిమాల్లోకి వెళ్ళిపోవాలని ఆకాంక్షించారు. ఇదంతా నిజం అనుకుని మర్నాడే పాపం కళాకండుడు మద్రాస్ వెళ్ళిపోయి మళ్ళీ కన్పించలేదు.

## రాజకీయాలు

"డబ్బు లేనివాడికి ఈ స్వయంవరంలో స్థానం లేదు వున్న వాళ్ళలోనే ఒకర్ని వరించాల్సి వచ్చే ఈ ఎన్నిక ఎన్నిక కానేకాదు. అందుకే - ఆయన వచ్చే వరకూ ఎదురుచూస్తాను" అని చిరంజీవి సౌభాగ్యవతి ఓటేశ్వరి దండతో సహా గుమ్మందగ్గరే ఎదురు చూస్తూ ఉండిపోయింది. అతనెప్పుడొస్తాడో!?

చిన్నప్పుడే రాజు గారు దేశాన్ని భాగ్యవంతం చెయ్యాలని కంకణం కట్టుకున్నారు. రాజుగారు పెరిగి పెద్దయ్యే సరికి కంకణం బిగుతుగా అయిపోయి ఆయన చేతికే వుండిపోయింది.

ఇలా స్థాలీపులాక న్యాయంగా చెబితే న్యాయం జరగని కథలు కొన్ని ఉన్నాయి. వాటిలో ఒకటి - 'కందుకూరి సారంగధరుని కథ'!

"రాజమండ్రిలో తవ్వకాలలో దొరికిన ఒక విగ్రహం గురించి వివాదం మొదలవుతుంది. విగ్రహానికి తలపాగా ఉంది. కుర్చీకూడా ఉంది. కాళ్లు మాత్రం లేవు. అది కందుకూరి వీరేశలింగందా, లేక సారంగధరుడిదా తేల్చడానికి పాతవస్తువులు పరిశోధనల శాఖవారు రంగంలోకి దిగుతారు.

ఒకవాదం ఇలా సాగింది - కందుకూరి వీరేశలింగం జాతకచక్రంగా భావించబడ్డ ఒకానొక ఫలకం బట్టి ఆయన రెండు కాళ్లూ లారీ ఏక్సిడెంటులో పోతాయని సూచించబడింది కాబట్టి బతికుండగా కాకపోయినా ఆయన విగ్రహానికైనా కాళ్లు విరిగి ఉంటాయి. "పంతులు గారి ధర్మమా" అని పునర్వివాహం చేసుకున్న విధవల మొదటి మొగుళ్ళు దెయ్యాలై ఆయన ఆత్మని పట్టుకుని కాళ్లు విరగగొట్టుగాక అని సనాతన చాదస్తులంతా మనస్ఫూర్తిగా ప్రార్థించారు. పర్యవసానంగా విగ్రహానికి కాళ్లు విరిగిపోయాయి.

వేరే వాదం ప్రకారం - చిత్రాంగివల్ల కాళ్లు పోగొట్టుకున్న



సారంగధరుడు బతికుంటే బలుసాకు తినొచ్చునని తలచి తెలుగు సినిమా హీరోలాగ తలపాగ, కోటు వగైరాలతో మారువేషం ధరించి కుర్చీలో కూర్చుని బలుసాకు తింటూ కాలం వెళ్ళబుచ్చాడని - కాబట్టి సదరు విగ్రహం మారువేషధారుడైన సారంగధరుడిదేనని మరొక వాదం బయల్దేరింది.

చివరికి నిపుణుల సంఘం వారు ఉభయతారకంగా శాంతియుతమైన పరిష్కారం సాధించి సదరు విగ్రహం "కీ॥శే॥ కందుకూరి సారంగధరుడు" అనే చారిత్రాత్మక వ్యక్తిదని నిర్ణయించారు.

నీతి - విగ్రహం ఎవరిదైనా - కాంతల జోలికిపోతే కాళ్ళు విరుగుతాయి. ఎప్పుడు బాగుపడతాయో ఎవరూ చెప్పలేరు."

అలాగే గ్రాంథిక భాష, వ్యావహారిక భాషల వివాదం చెలరేగి ఫైనల్‌గా తేల్చిన విషయం ఏమిటంటే - "ఇకపై తెలుగు పరీక్షాపత్రం ఇంగ్లీషు భాషలో అచ్చువేయాలి. ఇక దానిలో గ్రాంథిక వ్యవహారిక వాదాలకు తావులేకుండా తెలుగు సమాధానాలన్నీ హిందీ భాషలో రాయాలి."

'దిగుడు బావి' అనే కథ కాగితాల మీదే పనులన్నీ నడిపించే ప్రభుత్వ పనుల కథ. బావి కావాలని ఒక మహజరు రాగానే, నుయ్యి తవ్వుతారు. దాంట్లో పశువులు పడిపోతున్నాయని ఇంకో మహజరు వస్తే గట్టు కట్టిస్తారు. గట్టు కట్టినా మనుషులు గట్టుదూకి చచ్చిపోతున్నారని ఫిర్యాదు రావడంతో నుయ్యి పూడ్చేస్తారు. ఇవన్నీ కాగితాల మీద. నిజానికి బావి తవ్విందీ లేదు, పూడ్చిందీ లేదు.

లంచగొండి తనం గురించి మరో చక్కని కథ - ఒక లంచగొండిని ఉద్యోగం పీకేయలేక లంచం ఇవ్వవలసిన అవసరం లేని ఉద్యోగాన్ని కనిపెడతారు. ఓ సముద్రతీర గ్రామంలో కెరటాలు లెక్కించే ఉద్యోగం అది. అక్కడ కూడా లంచం పట్టేందుకు అతనో ఉపాయం కనిపెడతాడు. కెరటాలకు అడ్డంగా పడవలు అవీ వెళితే కెరటాలు తిరిగిపోయి తన లెక్కలలో తేడా వస్తుంది కాబట్టి పడవలు వెళ్లడానికి వీల్లేదని అభ్యంతర పెట్టి పడవకి మూడు రూపాయల మామూలు చొప్పున ఒప్పందం కుదుర్చుకుంటాడు!

ఈ విధంగా ఒక పక్కన నవ్విస్తూనే, ఆలోచింపజేసే పుస్తకం ఇది. తప్పకుండా చదవండి. వెల 125 రూ.లు. మరి!

-ఎమ్బీయస్ ప్రసాద్



# రాంపండు లీలలు

## రాంపండూ - పెసరట్ల సుబ్బీ

"సుబ్బి - ఈ పేరు ఎలా ఉంది?"

"గొబ్బెమ్మలా ఉంది"

"జోక్స్ కాదు, నిజంగా ఒకసారి మనస్సులో అనుకుని చూడు. సు..బ్బి... మెత్తగా, హాయిగా, ఆనందంగా, ఆహ్లాదంగా, ఆస్వాదమో మరోటో లేకపోతే 'ఆ'తో వచ్చే ఇంకోదానిలాగానో లేదూ"

"నా కేమీగా లేదు"

"తొందరపడి నీ అజ్ఞానాన్ని ఒప్పేసుకోవద్దు. నిదానించు. నాలుగుసార్లు అనుకుని చూడు. సు...బ్.... బి.... అహ్॰"

"ఇంతకీ అదేదో నీ కొత్త లవర్ పేరయివుంటుంది. అంతేనా? అంత పాతపేరుకింత కవిత్వం ఎందుకు?"

"పాతపేరేమిట్రా? అది మన తెలుగు పేరు. నేటివ్‌నేమ్. అనూష్కా రబైష్కా అని రష్యన్ పేర్లు పెట్టుకోవాలా? నీకు అయిదు నిమిషాలు టైమిస్తున్నాను. ఆ పేరు తలుచుకుని నిన్ను నువ్వు జాగ్రత్తగా అబ్జర్వ్ చేసుకొని చూడు. మనసులో చిలక ఎగిరిపోతున్నట్టు, చుట్టూ కారువసంతం కమ్మేసినట్టు, కాళ్ళు తేలిపోతున్నట్టు..."

"ఒరే, నువ్వు కవిత్వం చెప్పే ప్రయత్నాలు ఆపేయ్. తెలుగుభాష ఖూనీ అయిపోతోంది. నువ్వన్న ఫీలింగులేవీ నా మనుస్సులో మెదలటం లేదు. నువ్వేదైనా చెప్పేదేచిదేదైనా ఉంటే చెప్పేడు. లేదా ఏడ్చేసి చెప్పు".

"నీకు బుర్రలేదన్న సంగతి నాకు చిన్నప్పుడే తెలుసు. హైస్కూలు రోజులనుంచి చూస్తున్నాను. ఎప్పటికైనా బుర్ర ఎదగకపోతుందా, వీడికి అబ్జర్వేషన్ పెరక్కపోతుందా అని.... అబ్బే..."

ఈ బాల్యమిత్రులలో సుబ్బి ప్రేమలో పడికొట్టుకుపోతున్న యువకుడే రాంపండు. ముందూ వెనకా ఎవరూ లేని అతనికి డబ్బు వచ్చే ఏకైక సాధనం వాళ్ల బాబాయ్ నెలనెలా ఇచ్చే పాకెట్‌మనీయే. ప్రేమలో పడుతూండడం అనే పెద్దపనిలో తలమునకలుగా ఉంటూంటాడు. కాబట్టి ఉద్యోగం లాటి చిన్నచిన్న వ్యాపకాలేమీ పెట్టుకోలేదు. అయినా అతని ఫ్రెండ్సెవరూ కూడా ఉద్యోగాలు చేసే బాపతు కాదు.

ప్రస్తుతం సుబ్బి పేరులో గొప్పతనాన్ని గుర్తించలేక పోతున్న(ఆ రకం ఫ్రెండ్సులో)ఆ అనంతం కూడా ఒకడు. పూర్తిపేరు అనంతశయనం. తల్లీదండ్రీ కాలుమీద కాలు వేసుకుని తిన్నా తరగనంత ఆస్తి ఇచ్చిపోయారు. కానీ కాలు మీద కాలు వేసి పెట్టేవాణ్ని అమర్చి పెట్టకపోవడంతో తనే వెతుక్కున్నాడు. - అచలపతి అనే సహచరుణ్ని. అనంతం పనులన్నీ - ఆలోచించడంతో సహ - అచలపతే చూసుకోవడంతో అనంతం బుర్ర తుప్పుపట్టిపోయిందని రాంపండులాంటి వాళ్ల అనుమానం. ప్రజలలా అనుకుని పోతున్నారని అనంతానికి తెలుసు. అందుకే ఉక్రోషంతో.

"ఒరేయ్, నీ సర్టిఫికెట్లు నువ్వే ఉంచుకో, ప్రేమా, దోమా వ్యవహారాలన్నీ నీకే! నేను హాయిగా లక్కీ బ్యాచిలర్‌గా గడిపేస్తున్న వాణ్ని. నా వల్ల కావలసిన సాయం ఏదైనా ఉంటే చెప్పు. చేతనైతే చేస్తా. లేకపోతే హాయిగా క్లబ్బుకి పోతా" అన్నాడు.

## సినేమా హాంగులు



ప్రతిఘటన, రాక్షసుడు, స్వాతి కిరణం, సూత్రధారులు, భారతనారి, రేపటి పౌరులు, అన్న, మా ఆయన బంగారం, ధర్మచక్రం, సగటుమనిషి, దేవాలయం, అమ్మాయికాపురం వంటి చిత్రాలతో పదునైన కలం ఉన్న రచయితగా ముద్రపడిన శ్రీ ఎం.వి.యస్.హరనాధరావు 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా రాసిన చిలిపి బిట్‌లలో ఈ సారి కొన్ని!

వచ్చే సంచికలో మరిన్ని...

మిస్‌కాకుండా చూడండి



రాంపండు దిగొచ్చాడు. "మైడియర్ అనంతం! నువ్వు సాయంత్రం నేను చెప్పిన చోటుకు రావాలి. సుబ్బిని చూడాలి. నా సెలక్షన్‌ని మెచ్చుకోవాలి. ఆ తర్వాతే ఏమైనా సాయం కావాలంటే అడుగుతా" అన్నాడు.

"సరే ఎక్కడ చూడాలి? నీ సంగతి నాకు తెలియదా? ఏదో హోటల్లో డిన్నర్ ఏర్పాటు చేసి ఉంటావు. ఎక్కడ?.... కాకతీయ గ్రాండా?"

"కాకతీయా కాదులే. ఆ దగ్గర్లోనే...."

ఆ ప్రకారం రాంపండు చెప్పిన చోటుకి వెళ్ళి చూడగా 'భూగోళం రీత్యా చూస్తే రాంపండు చెప్పినది కరెక్టే ననిపించింది. అది కాకతీయాకు దగ్గర్లోనే గుడిసెల మధ్య ఉంది. 'కానీ ఇంత నాసిరకం హోటల్లో గర్ల్ ఫ్రెండుకి డిన్నర్ ఇచ్చేస్థాయికి దిగజారాడా మనవాడు? వచ్చీ రాగానే అడగాలి' అని అనుకున్నాడు అనంతం విరిగిన కుర్చీల్లో కూచోడానికి అవస్థపడుతూ.



అంతలోనే రాంపండు రావడం, అక్కడ సర్వర్‌ని పిలిచి 'సుబ్బిని పిలు' అని చెప్పడం జరిగిపోయాయి. హోటల్ గురించి అడగదలచుకున్న ప్రశ్న వాయిదా వేసి, "ఒరే రాంపండూ, మరీ పాతకాలం పేరెందుకు పెట్టిందిరా వాళ్లమ్మ?" అని ఉత్సుకతతో అడిగేడు అనంతం.

"ఎందుకంటె తన పేరు సావాలమ్మ కాబట్టి" అని రాంపండు జవాబు చెప్పేడు. "సావాలమ్మ అమ్మ మాత్రం...."అని అనంతం అనుబంధ ప్రశ్న వేసేటంతలో ఓ అందమైన అమ్మాయి చకచక వచ్చి "అల్లం పెసరట్టాండి? ఉల్లిపాయా? నాపోతే రెండూ కలేసి ఏసేయమంటారా?" అనడిగింది హుషారుగా.

అనంతానికి బుర్ర తిరగ నారంభించింది. ఆ తిరుగుతున్న బుర్రలోకే ఆ అమ్మాయిని సుబ్బిగా రాంపండు పరిచయం చేయడం, అలా వెళ్లగా చూసి తన సెలక్షన్ బాగుందాని అడగడం, పెసరట్లు పోయడంలో సుబ్బి నైపుణ్యాన్ని వర్ణించడం, పెళ్లి ఎక్కడ చేసుకుందామనుకుంటున్నాడో చెప్పడం - ఇవన్నీ దూరాయి.

గబగబా బయటకు లాక్కొచ్చి అడిగేశాడు. "ఒరేయ్, మీ బాబాయ్ అసలే పరమ ఛాందసుడు. ఇలా పెసరట్ల సుబ్బిని చేసుకుంటానంటే ఒప్పుకుంటాడ్రా? నీకు ఇచ్చే పాకెట్‌మనీ కూడా ఇవ్వడం మానేస్తే నువ్వేం తింటావ్? మీ సుబ్బికేం పెడతావ్?" అని.

"అందుకే కదరా నిన్ను పిలుచుకుని వచ్చింది. నువ్వేదైనా చేసి మా ఇద్దరికి పెళ్లి జరిగేట్లా చూడాలి".

"నేనా!?"

"నువ్వంటే... అచలవతి.... నీకెక్కడ బుర్రేడిచిందిలే! అచలపతికి నా కేసు పూర్వాపరాలు చెప్పి సలహా అడుగు".

అచలపతికి పూర్వాపరాలు చెప్పనవసరం లేక పోయింది. రాంపండు కథ ముందే తెలుసున్నట్టు మాట్లాడేడు. రాంపండు బాబయ్య గురించి కూడా చాలా చెప్పాడు.

ఆయన రాంవరం సింహాద్రిరావు గారని చాలా డబ్బు సంపాదించాడు. కష్టార్జితమే. భార్యపోయింది. పిల్లలు అమెరికాలో సెటిలయ్యారు. చాలా ఖరాఖండీ మనిషి కావడంతో పిల్లలతో పడలేదు. ఎవరితోనూ కలవడు. విడిగా హాయిగా ఉంటున్నాడు. వంట చేసి పెట్టడానికి వెంకమ్మగారనే విధవావిడ ఉంది. సింహాద్రిగారు జిహ్వా చాపల్యం మనిషి కావడంతో వెంకమ్మ గారిని మాటిమాటికి టిఫిన్లు చేసిపెట్టమని అడుగుటాడు. వేరే చోట తిండీ, బట్టా పెట్టి తాం ఉంటే రాక పోకలు కష్టమని ఇంట్లోనే ఉండ మన్నాడు. సుష్టుగా తినడం, పేపరు చదువుకోవడం, డబ్బు వడ్డీలకు తిప్పుకోవడం తప్ప వేరే పనులేమీ లేవు. తన వంశం వాడే కదాన్న జాలితో రాంపండుని నెలకోసారి పిలిచి కాస్త డబ్బు, ఇంకాస్త చివాట్లు పెట్టి పంపుతాడు.

ఇదంతా వినగానే అనంతానికి ఐడియా వచ్చేసింది. "ఆయనకి

---

రచన: ఎం.వి.యస్.హరనాథరావు

## సినిమా హంగులు

బొమ్మలు: బాలి

### సోఫాలు



ఎప్పుడూ ఎవరూ కూర్చోకుండా చుట్టూతిరుగుతూ, ఎప్పుడయినా కళ్ళలోకి నీళ్ళటాంకులు వొచ్చేసినప్పుడు ఆర్టిస్టులు పడిపోయి - తడిపేయడానికి అవసరపడే నటరాజ పాదాలు



కోపాలకు - తాపాలకు నేలపాలయ్యే కళారూపాలు

చిరుతిళ్ల ఇష్టం కాబట్టి రాంపండు గాడు ఓ నాలుగు కిలోలు పుల్లారెడ్డి స్వీట్స్ పట్టుకెళ్ళి... కాదు, కాదు సుబ్బి చేసిన పెసరట్లు పట్టుకెళ్లి ఇచ్చి మీ క్యాబోయే కోడలు చేసినవని చెప్పి...."

"సర్, ప్రస్తుతానికి అవేమీ తినే స్థితిలో లేడండాయన. బాగా తిని, తిని అజీర్తి చేసింది. రెండు నెలలపాటు లైటుగా తినమన్నాడు డాక్టరు. హఠాత్తుగా ప్రాణభయం పట్టుకుంది. రోజూ శాస్త్రుర్లు గారిని పిలిపించి పురాణం చదివించుకుంటున్నాడు"అన్నాడు అచలపతి.

"ఇన్ని వివరాలు నీకెలా తెలుస్తాయి, అచలవతీ? ఏం తింటావ్?"అనడిగాడు అనంతం.

"మీకు పెట్టేదే సర్". అన్నాడు అచలపతి అతి క్లుప్తంగా.

అనంతానికి నమ్మకం చిక్కలేదు. అయినా దాని గురించి ఆలోచన ప్రస్తుతానికి వాయిదా వేసి, అహాన్ని పక్కకు పెట్టి జనాభిప్రాయంతో ఏకీభవిస్తూ, "అచలపతీ, మన రాంపండుగాడి ప్రాబ్లం ఎలా సాల్వ్ చేయాలో కాస్త ఆలోచించి చూడు. నాక్కాస్త తలనొప్పిగా ఉంది. ప్రస్తుతం ఆలోచించడానికీ కష్టంగా ఉంది" అన్నాడు లౌక్యంగా.

"దీనిలో ఆలోచించడానికి ఏమీ లేదు సర్. రాంపండు గారు సుబ్బిని వదులుకోనంటున్నాడు. ఆయన మనసు మారదంటున్నారు. అంటే అటునుంచి నరుక్కురావాలంటే పెద్దాయన మనసు, అంటే ఆలోచనా విధానం మార్చుకురావాలి" అన్నాడు అచలపతి అతి కూల్‌గా.

"అది నిజమే. కానీ పాతకాలం మనిషి ఆయన ఏం మారతాడు? ప్రేమంటే ఆయనకేం తెలుస్తుంది? ఏ పన్నెండో ఏటో పెద్దవాళ్ల చెప్పిన పిల్ల మెళ్లో తాళికట్టి సంసారం చేసే ఉంటాడు. వీడెళ్లి అడిగితే ప్రేమా, దోమా ఏమిటి పోరా అంటాడు" అంటూ పాయింటు లాగేడు అనంతం.

"మీరు చాలా కరక్టుగా చెప్పారు సర్. అందుకే ఆయన చేత కల్పనారాణి నవలలు చదివించమంటాను. ఆయన దృక్పథంలో తప్పకుండా మార్పు వస్తుంది".

"కల్పనారాణా? అంటే ఆరడుగుల ధనవంతుడు మధ్యతరగతి అమ్మాయిని వరించి, వెంటపడే కథలా? నేను ఒకటి రెండు చదివాను కానీ నాకేం నచ్చలేదు."

"దానికి కారణం మీరు మధ్యతరగతి అమ్మాయి కాదు కాబట్టి! ఆవిడ చాలా నవలలు రాసింది. ఏ వయస్సు వారైనా, ఏ లెవెల్ వారైనా సరే ప్రేమకు అతీతులు కారని చాటి చెబుతాయవి. అవి చదివి వినిపిస్తే సింహాద్రిగారు తప్పకుండా మారతారని నా నమ్మకం సర్".

"అలాటివి చదివి వినిపిస్తానంటే కర్ర పుచ్చుకుంటాడు. ఆ ప్రాబ్లం ఎలా సాల్వ్ చేస్తావ్?"

"పురాణం శాస్తుర్లు గారికి లంచం పెట్టడం ద్వారా...." అన్నాడు అచలపతి తేలిగ్గా.

సింహాద్రిగారు పడకకుర్చీలో పులిలా కూచుని ఉన్నాడు. ఎదురుగా శాస్తుర్లు గారు మహాభారతం శ్రావ్యంగా పాడి వినిపిస్తున్నాడు. శంతనుడు పెళ్లి చేసుకోమని సత్యవతిని ఎలా బతిమాలుతున్నాడో మరీ మరీ చదువుతున్నాడు. సింహాద్రి గారికి విసుగు పుట్టింది.

"మరీ అంత సాగదీయడం ఎందుకండీ శాస్తుర్లు గారూ! ఏవిటో పిట్ట కథలు. చేపలు పట్టేదాన్ని చూసి ఒక రాజుగారు అంత అంగలార్చడం దేనికి? రాజే ఏమిటి, అంతకుముందు ఓ ఋషి గారు కూడా మహా మోహపడిపోయాడన్నారు. లోకంలో జరిగే విషయాలా ఇవి?"

"ఎంతమాట సెలవిచ్చారు? అప్పటికాలమే అనేముంది.... ఇప్పుడు కూడా చూస్తున్నాం. రాజాధిరాజులాటి పారిశ్రామికవేత్త కొడుకు ఒక సినిమా నటినీ, అదీ ఇంకో ఏక్టరుతో కొంతకాలం కాపురం చేసినదాన్ని... వరించి పెళ్లాడలేదూ? ప్రేమ బాబూ, ప్రేమ.... దాని మహత్తు అలాటిది. ఆ మధ్య మా మనవడు ఓ పుస్తకం తెస్తే చదివా. కల్పనారాణి అనే ఆవిడ రాసింది. నిజంగా జరిగిన కథని పేర్లు మార్చి రాసానని ముందుమాటలో రాసుకుంది. ప్రేమ గురించి ఏం రాసిందని...?" చెబుతూంటే శాస్తుర్లు గారు కళ్లు అర్ధనిమీలితాలయిపోయాయి.

సింహాద్రి గారికి పంతం వచ్చింది. "ఏమిటండీ గాడిదగుడ్డు ప్రేమ? రేపా పుస్తకం పట్టుకురండి. దాన్నిండా ఎన్ని అవకతవకలున్నాయో చెబుతాను" అంటూ ఛాలెంజ్ చేశాడు.

నెల తిరక్కుండానే రాంపండు అనంతానికి ఫోన్ చేశాడు. "మా బాబయ్య నిన్ను చూద్దామనుకుంటున్నాడ్రా" అని.

అనంతానికి ఆశ్చర్యం.

"నన్ను చూద్దామని తహతహలాడే వాళ్లెవరినీ నేనిప్పటిదాకా చూళ్లేదు. నా గురించి ఏం చెప్పావేమిటి?" అని అడిగేశాడు సూటిగా.

"అబ్బే, చెప్పేందుకేముంది, మాటల్లో నీ గురించి చెపితే రేపాదివారం లంచ్‌కి పిలు అన్నాడు. పెద్దాయన పిలిచాక వెళ్లకపోతే నొచ్చుకుంటాడు. నీకు పనీ, పాటా ఏముంది కనక. వెళ్లు".

"నా పనీ పాట గురించి నువ్వు వర్రీ కానక్కరలేదు కానీ. నువ్వూ నాతో రా"

"నాకు సుబ్బితో పాటలు పాడే పని ఉంది. నువ్వు వెళ్లరా. మా బాబయ్య ఏమీ తినేయడులే".

ఇందులో ఏదో తిరకాసు ఉందని అంతరాత్మ ఘోషిస్తున్నా అనంతానికి అదేమిటో అంతు పట్టలేదు. సుబ్బి వ్యవహారంలో ఒక స్నేహితుడిగా మా వాడికి బుద్ధి చెప్పద్దా అని ఇంటికి పిల్చి తిట్టడానికి ముసలాయన వేసిన

రచన: ఎం.వి.యస్.హరనాథరావు

## సినేమా హంగులు

బొమ్మలు: బాలి



క్యారెక్టర్ల రాకకై ఎదురుచూసే వారికి - బాధను డెవలప్ చేసుకోండి దయచేసి - అంటూ గంటలు కొట్టే యాక్షన్ డెవలప్‌మెంట్ ప్రాజెక్ట్

హోల్లో గడియారం

దిండు




(1) పాటకు శృతిలాగా, హీరోయిన్ ఫీలింగ్స్ శృతిమించేందుకు వాడే 'డెవలప్ పిల్లో'

(2) చంపటానికి విలన్లకు పనికొచ్చే దూదికత్తి

ఎత్తేమో ఇది అన్న శంక ఒకటి ఎలాగూ ఉంది. సంప్రదిద్దామంటే సమయానికి అచలపతి ఊళ్లో లేడు. ఏమైతే అయిందని ఆదివారం సింహాద్రిగారింటికి వెళ్లాడు. ఆయన రిసీవ్ చేసుకున్న తీరు చూడగానే అనుమానాల మాట దేవుడెరుగు... ఉబ్బితబ్బిబ్బవడానికి వీల్లేనంత లెవెల్లో ఆశ్చర్య పోవలసిన అగత్యం ఏర్పడిపోయింది అనంతానికి.

"రండి, రండి.... మిమ్మల్ని చూడాలని ఎన్నాళ్ల నుండో అనుకుంటున్నాను. మా వాడితో మీ ప్రస్తావన వస్తే 'అయ్యో నాకు తెలియకపోవడమేమిటి? మా బెస్టు ఫ్రెండు' అనేశాడు. ఇక అక్కణ్నుంచి మిమ్మల్ని చూడాలనీ, మీ సలహా కోరాలని ఒకటే ఇది. నా ఆహ్వానాన్ని మన్నించి మీరు రావడం నా అదృష్టం". అంటూ ముసలాయన కౌగలించుకున్న తీరు చూస్తే అనంతానికి ఆశ్చర్యంతోబాటు, అపనమ్మకం కూడా వేసింది ఇది కలా? నిజమా?' అని. తనగురించి ఇంత ఇదిగా ఎదురు చూసేవాళ్లుంటారని ఎప్పుడూ అనుకోకపోవడం తప్పని తనని తాను తిట్టేసుకున్నాడు అర్జంటుగా.

ఇంతలోనే పనిమనిషి వచ్చి "చిన్నయ్య రాంపండు గారు మీకు ఫోన్ చేసారండి" అనడంతో జరుగుతున్నది వాస్తవమే అని తెలిసింది.

మెట్లు దిగి ఫోన్ అందుకునే సరికి రాంపండు కంఠం ఆదుర్దాగా వినిపించింది. "ఎంత సేపయిందిరా నువ్వు వచ్చి ? కొంపదీసి కల్పనారాణి నువ్వు కాదని చెప్పేశావా?"

"ఇప్పుడే వచ్చాను. మీ బాబయ్య నన్ను చూసి ఆహా, ఓహో అంటున్నాడు. నువ్వు ఫోన్ చేసి మంచి సీన్ చెడగొట్టేశావ్. అవునూ, మధ్యలో కల్పనారాణి గొడవేమిటి?" అన్నాడు అనంతం విసుగ్గా.

"అది చెప్దామనే ఫోన్ చేశా. మా బాబయ్య నిన్ను చూసి అంత ఇదవడానికి కారణం ఏమిటనుకుంటున్నావ్? ఆయన అభిమాన రచయిత కల్పనా రాణి నువ్వేనని అనుకుంటున్నాడు... అలా నోరెళ్లబెట్టావేమిటి?... ఫోన్‌లో ఆవులించినా పేగల్లెక్కపెట్టగలనులే! క్లియర్‌గా చెప్తాను. సరిగ్గా అర్థం చేసుకో. నీ సలహా... నీదేమిటిలే.. మీ అచలపతి సలహా బాగా పని చేసింది. మా బాబాయి ఛాలెంజ్ చేసి కల్పనారాణి నవలలు చదివించుకున్నాడుగా. క్రమంగా నచ్చడం మొదలు పెట్టాయి. పోను, పోను వీరాభిమాని అయిపోయాడు. రోజంతా అవే చదివించుకుని, చదివించుకుని మొత్తం నవలలు అన్నీ చదివి పారేశాడు. ఇక అప్పణ్నుంచి ఆ రచయిత్రిని కలవాలని ఒకటే కలవరింతలు".

"మంచిదే. ఆ పబ్లిషరు నడిగితే ఆవిడ ఎడ్రసు చెబుతాడుగా. మధ్యలో నాపేరెందుకు చెప్పావ్?" అడిగాడు అనంతం అతి చికాగ్గా.

రాంపండు కూడా విసుక్కున్నాడు అనంతం తెలివితక్కువతనానికి- "ఆవిడని పిలిస్తే నాకేం లాభంరా? అవిడ నా తరపున వాదిస్తుందన్న నమ్మకం ఏముంది? అందువల్ల నా స్వంత బుర్ర... నీలా అచలపతి బుర్ర ఉపయోగించి కాదోరేయ్.... నా సొంత బుర్ర.... అది ఉపయోగించి ఒక ప్లాను వేశా. 'కల్పనారాణి కల్పితమైన పేరు. ఆ కలం పేరు పెట్టుకుని ఫలానా మా క్లాసుమేటు అనంతశయనమే ఈ కథలు రాస్తాడ'ని చెప్పా. అందుకే నీకీ ఆహ్వానం. ఆయన నీ భక్తుడిప్పుడు. ఆస్తులు, అంతరాలు పట్టించుకోవద్దని, నన్నూ సుబ్బిని ఆశీర్వదించమనీ నువ్వు చెప్పు. అంతేకాదు... ఇది ముఖ్యంగా గుర్తుంచుకో, నువ్వసలే మతిమరుపు గాడివి. నాకిచ్చే పాకెట్‌మనీ చాలదని చెప్పు. ఓ లక్ష ఇలా పడేయమను. ఆయన ఎప్పుడు పోతాడో, ఆస్తి ఎప్పుడు కలిసి వస్తుందో తెలియదు. ఈ లోపున మేం హోటల్ పెడదామనుకుంటున్నాం. సుబ్బి పెసరట్లు పోస్తుంది. నేను గల్లా పెట్టె దగ్గర కూచుంటా. అందుచేత వట్టి అక్షింతలతో సరిపెట్టక పెట్టుబడికి ఓ లక్ష... పోనీ రెండు లక్షలు..."



"నువ్వు చెప్పేదంతా బాగానే ఉంది గానీ నాకీ విషయం ముందే ఎందుకు చెప్పలేదు?" అనంతం అడిగేడు పళ్లునూరుకుంటూ.

రాంపండు ఫెళ్లున నవ్వాడు. "ఏడిచినట్లే ఉన్నాయి నీ తెలివితేటలు. ఇది ముందు చెబితే ఏ పూలైనా ఒప్పుకుంటాడురా? అందుకే చెప్పలేదు. సర్లే వెళ్లి పని చూడు. రెండు లక్షలకు తక్కువయితే పుచ్చుకోనని చెప్పు" అని అనంతం చెప్పేది వినకుండా ఫోన్ కట్ చేసేశాడు.

ఆ తర్వాత అనంతం పడ్డపాట్లు పగవాడికి కూడా వద్దు. ముసలాయన కథలెలా రాస్తారని, మూడ్ ఎలా వస్తుందనీ, అసలిలాటి ఐడియాలు ఎలా

## సినేమా హంగులు

రచన: ఎం.వి.యస్.హరనాథరావు

బొమ్మలు: బాలి

### దుప్పటి



(1) హీరో, హీరోయిన్‌లను దగ్గర చేసే 'ప్రేమపూరిల్లు'
(2) విశ్రాంతి తర్వాత.... నిద్రపోతున్న వాళ్ళకు గొంతువరకు కప్పి.... ఫీలింగులు ఇవ్వడానికి, చచ్చిపోయిన వాళ్ళకు పూర్తిగా కప్పి... గొల్లుమనడానికి వాడే... సెంటిమెంట్ల సెంటు బాటిలు....

### మెట్లు

హీరో లేక హీరోయిన్‌ల తండ్రి లేక తల్లి అహంకారంతో దిగుతూ మాట్లాడేందుకు, బీద పేరెంట్సు ఎక్కలేక యాక్షన్లు చేయడానికి, అనవసరం అనిపించే కారక్టర్లు జారిపడి చావడానికో, వీల్ ఛెయిర్ ఎక్కడానికో ఉపయోగించే... మెలోడ్రామా సోపానాలు.



వస్తాయని వంద రకాల ప్రశ్నలు ఉత్సాహంతోనే అడిగినా వాటికి జవాబు చెప్పడం అతనికి ప్రాణ సంకటం అయిపోయింది. అన్నిటికంటె గొప్ప కష్టం కల్పనా రాణి రాసిన పుస్తకాల ప్రస్తావన వచ్చినప్పుడు!

"అతకని మనుసులు'లో సౌజన్య పాత్ర అలా ఎందుకు మలిచేరు? మధ్యలోనే రైలెక్కేస్తే పోయేదిగా?" అని అడిగాడు సింహాద్రిగారు.

ఆ పుస్తకం ఏదో అనంతం చదివితేగా! అందుకుని 'రైలు సమయానికి వచ్చి ఉండదు' లాటి జవాబేదో ఇచ్చాడు. ముసలాయన తెల్లబోయాడు. అలాగే "మాలోకమే మా లోకం", "అంతరాల సంగతి అంతే!", "బంధాలన్నీ బంద్" నవలల విషయంలోనూ ఇంచుమించు అలాటి సమాధానాలే ఎదురయ్యాయి. రచయితలు మూడీ మనుషులని వినివుండడం చేత సర్దుకుని "భోజనాలు చేద్దాం రండి" అని పిలిచాడు.

భోజన సమయానికి రాంపండు అందుకున్నాడు. హమ్మయ్య అనుకున్నాడు అనంతం. ఈ టాపిక్ తప్పినందుకు సంతోషించినా రాంపండు సైగల భాష అర్థం కాక అవస్థ పడవలసి వచ్చింది. సింహాద్రిగారు వంటింట్లోకి వెళ్లగా చూసి "ఓకే అనేశాడా?" అని అడిగేడు రాంపండు ఆదుర్దాగా. "ఏదీ, ఇంకా మొదలు పెట్టలేదే! భోజనాల దగ్గర ఆ సంగతి ఎత్తుదాం" అని హామీ ఇచ్చాడు.

భోజనం చేస్తూ సింహాద్రిగారు అసలు విషయం చెప్పాడు. "మిమ్మల్ని ప్రత్యేకంగా పిలిపించిన కారణం ఒకటి వుంది. మీరు పుస్తకాలు రాస్తారు గానీ అవి ప్రజలను ఎలా ప్రభావితం చేస్తాయో బహుశా తెలుసుకోలేరు. మీ పుస్తకాలు చదివి మారిన వ్యక్తిని కాబట్టి ఆ విషయం మీకు చెప్పి మీ ఆశీస్సులు.. నా కంటె చిన్నవాళ్లు కదా... పోనీ అభినందనలు పొందుదామని పిలిచాను. నేనూ ఒకప్పుడు పెద్దకుటుంబాల వాళ్లు చిన్న కుటుంబాల జోలికి వెళ్లకూడదని అనుకునేవాణ్ని. కానీ ఈనాడు నేను మారిన మనిషిని. దానికి కారణం మీ పుస్తకాలు!" అని ఎఫెక్టుకోసం కాస్త ఆగాడు.

ప్రశంసలు స్వీకరించడానికి అనంతం తల పంకించి నోరు విప్పబోయేటంతలో సింహాద్రి మళ్లీ అందుకున్నాడు. "ఉదాహరణకి మనం దోసెలు, పెసరట్లు అవీ తింటాం. బాగున్నాయనుకుంటాం. కానీ దాని వెనుక ఉన్న మనిషి ఎవరు అని పట్టించుకోం... జిలుగువెలుగుల చీరశిల్పం ఎలా వచ్చెనో తెలుసుకోమని ఆత్రేయ చెప్పినట్లు ఇంత రుచైన పెసరట్లు చేసిన ఆ అమృత హస్తం ఎవరిదని ఒక్కసారి ఆలోచిస్తే మనకు వాళ్లమీద ప్రేమ పుట్టుకు వస్తుంది..."

ఇదే సమయమని రాంపండు డొక్కలో పొడవడంతో అనంతం నోరు విప్పబోయాడు, "అందుకే మీ రాంపండు పెసరట్ల సుబ్బిని..." అంటూ చెప్పడానికి నోట్లోని స్వీటు అటూ, ఇటూ, సర్దుకోబోతూండగానే ముసలాయన వాక్యం పూర్తి చేసేశాడు. "..... అందుకే మా వంటావిడ వెంకమ్మను నేను ప్రేమించడం మొదలు పెట్టాను. అసలు నాకు మొదటినుండీ ఆమె పట్ల ప్రేమ ఉందనుకుంటాను. కానీ పైజాతి అహంభావంతో కళ్లు మూసుకుని ఉన్నాను. మీ పుస్తకాల ధర్మమాని నా కళ్లు తెరుచుకున్నాయి. అందుకే మా వివాహ వార్త మీతోనే మొదటిగా చెప్పి... వెంకమ్మా... ఇలా రా!" అని పిలిచాడు.

అనంతం పక్క సీట్లో ఉన్న రాంపండు తూలినట్టయ్యాడు. అనంతం ఖంగారుపడి "రాంపండు" అని అనబోయాడు.

సింహాద్రిగారు తన ధోరణిలోనే ఉన్నారు. "రాంపండు సంగతి చెప్పేదేముంది? ఇన్నాళ్లూ ఏదో నాకు తోచినది నెలనెలా ఇచ్చేవాణ్ని. నాకు సంసారం ఏర్పడుతోంది. కాబట్టి ఇకపై అలా ఇవ్వడం కుదరదు. వెంకమ్మ ఏముంటుందో మరి! తనకు కూడా పిల్లల్ని కని, గొప్పగా పెంచాలని ఆశ. వారసులకోసం ఆస్తి దాచకపోతే ఎలా? రాంపండు కేముంది? హాయిగా ఉద్యోగం చేసుకోవచ్చు. మీ "లోకానికి సవాల్"లో హీరో డబ్బున్న తండ్రిని కాదని బయటకు వచ్చి ఆటో నడిపి.... ఏరా రాంపండూ, నువ్వది చదివావా?.... అరె, వీడేడీ..." అంటూ ఖంగారుపడ్డాడు సింహాద్రిగారు.

అప్పటికే రాంపండు కింద మూర్ఛపడి వున్నాడు!

ఊరు నుండి వచ్చాక అచలపతిని మందలించేడు అనంతం - "నీ సలహా బెడిసి కొట్టింది. పాపం రాంపండు సంగతి ఏమయిందో తెలుసా?"

"విన్నాను సర్. సుబ్బి చెప్పింది. ఇంకా ఏమైనా కావాలంటే సాయంత్రం పార్కులో కలిసినప్పుడు అడుగుతాను" అన్నాడు అచలపతి కూల్‌గా.

"ఇది రెండో మలుపా? సుబ్బి ఎప్పణ్నుంచి తెలుసు నీకు?"

"ముందునుండీ నా ఫ్రెండే! రాంపండు గారు వచ్చి తన చేత హోటల్ పెట్టిస్తాననడంతో కాస్త ఊగింది. ఇప్పుడాయన పెసరట్లకే అరువు పెట్టే స్థితికి రావడంతో రాంపండు గారికి రాంరాం చెప్పేసింది."

"పాపం, ఆ భగ్న హృదయుడి హృదయం ఎప్పటికి రిపేరవుతుందో కదా!" అంటూ వాపోయాడు అనంతం.

"మీకాయన సంగతి తెలియనిదేముంది? అతి త్వరలోనే అయిపోతుంది" అన్నాడు అచలపతి.

నిజమే! పదిహేను రోజులు తిరక్కుండా రాంపండు కంటబడింది షాలిని !!!

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(వచ్చేసారి షాలిని కథ)**

**(పి.జి.ఉడ్‌హవుస్ రాసిన "జీవ్స్ ఎగ్జర్‌ట్స్ ది ఓల్డ్ సెరిబెల్లమ్", "నో వెడ్డింగ్ బెల్స్ ఫర్ బింగో" కథల ఆధారంగా)**

రచన:ఎం.వి.యస్.హరనాథరావు

## సినేమా హంగులు

బొమ్మలు: బాలి



డబ్బున్న ఫాదరు కోటుకు
అతిబీద అయ్య తుండు
గుడ్డకు
తుడుచుకుని....
యాక్షను చేసే అద్దాల
పాత్ర

**కళ్ళజోడు**

రిజిస్ట్రారు
ఆఫీసుదాకా
వెళ్ళకుండా, స్టాంపు
డ్యూటీ లేకుండా...
కోడలుకు
సంక్రమించే
అధికారం



**తాళం చేతుల గుత్తి**


యావత్సంగీత ప్రపంచాన్ని
అతికొద్ది కాలంలోనే
ప్రభావితం చేసిన
ఎ.ఆర్. రెహమాన్‌పై
ప్రత్యేక అనుబంధం...

# జనం మెచ్చిన ప్రభంజనం

# ఎ.ఆర్.రెహమాన్

**'చిన్ని చిన్ని ఆశ చిన్నదా(వా)ని ఆశ.....'అంటూ చిత్రసీమలో ప్రవేశించి, చేసిన తొలి చిత్రానికే జాతీయ స్థాయి అవార్డు సాధించటమే కాక, అప్పటి వరకూ సినీ సంగీతాన్ని ఏలుతున్న వారందనీ పక్కకునెట్టి తన బీట్ తో యువత నుండి ముసలి వారు సైతం ఆకర్షితులయ్యేలా మంత్ర ముగ్దుల్ని చేసిన సంగీత దర్శకుడు అల్లారఖా రెహ్మాన్, అతనే మనకు పరిచయమైన ఎ.ఆర్.రెహమాన్.**

ప్రముఖ మలయాళ సంగీత దర్శకుడు ఆర్.సి.శేఖర్ కుమారుడైన రెహమాన్‌కు సినీ సంగీతం కన్నా ఎలక్ట్రానిక్ గాడ్జెట్స్ పైనే మక్కువ ఎక్కువ. పరిస్థితుల ప్రభావం వల్ల చిన్నతనంలోనే సంగీతాన్ని ఆశ్రయించిన రెహమాన్ తన వృత్తిని మాత్రం అమితంగా ప్రేమించాడు. ఎందరో ప్రముఖ సంగీత దర్శకుల వద్ద పనిచేసి వివిధ రకాల వాయిద్యాల పనితీరును నిశితంగా గమనించి , వాటితో కొత్త ప్రయోగాలు చేసేవాడు. అతి చిన్న వయసులోనే టి.వి. కమర్షియల్స్ కు సంగీతాన్ని అందించిన రెహ్మాన్ తన 19 వ ఏట ' రోజా' చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయ మయ్యారు. ఉదాహరణకి 'రోజా' చిత్రంలోని 'నా చెలి రోజావే...' పాటకు ముందు 'ఆఆ....'అంటూ వచ్చే ఆలాపన 'గార్డెన్ వరెల్లీ' చీరల యాడ్‌లో విన్నట్లుగా చాలా మందికి గుర్తుండే ఉంటుంది. 'రోజా' చిత్రం కన్నా ముందే తయారైన ఆ జింగిల్‌ను చేసింది రెహమాన్ కావటం విశేషం. అప్పుడతని పేరు దిలీప్. తొలి చిత్రంతోనే జాతీయ స్థాయిలో ఉత్తమ సంగీత దర్శకునిగా అవార్డు సాధించిన తర్వాత ఆయనకు తన కెరీర్‌లో వెనక్కి తిరిగి చూసుకునే అవకాశమే లేకపోయింది. రోజా, బొంబాయి, ప్రేమికుడు, ప్రేమదేశం, ఒకేఒక్కడు, లగాన్...ఇలా అప్రతిహతంగా సాగుతూనే ఉంది-ఆయన స్వరఝురి.



సినీ సంగీతం అంటే కేవలం పాటలు మాత్రమే అన్న అపోహ ఉన్న ఎంతో మందికి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ అంటే ఏమిటో దానికి ఉన్న ప్రాముఖ్యత ఏమిటో రుచి చూపించిన వ్యక్తి రెహమాన్. 'దొంగదొంగ' చిత్రంలో విలన్స్ కన్పించినప్పుడు విన్పించే గమ్మత్తైన ఫ్రెంచి పదాల ప్రయోగం ఎవరు మర్చిపోగలరు!? అలాగే ' ముత్తు' సినిమాలో 'ఒకడే ఒక్కడు మొనగాడు ఊరేమెచ్చిన పనివాడు' అనే పాటకు ముందు వచ్చే ఓ మ్యూజిక్‌బిట్‌ని ఇవాళ ఎన్ని టీవీ ఛానెల్స్ తమ ఎపిసోడ్‌లకు వాడుకుంటున్నాయో అందరికీ తెలుసు. ఇక ' నరసింహ' చిత్రంలో రజనీకాంత్ కనిపించినప్పుడు మాత్రమే కాక - తనకు సీటు లేకుండా చేసి కూర్చున్న రమ్యకృష్ణ ముందు పైనున్న ఉయ్యాల బల్లను తన కండువాతో కిందికి లాగి దానిమీద రజనీకాంత్ కూర్చుని కాలు మీద కాలు వేసుకున్న సీనుకి ప్రేక్షకులు ఊగి పోయారంటే అందుకు కారణం రెహ్మాన్ ఇచ్చిన థీమ్ మ్యూజిక్కే!!

బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌కు అంతగా ప్రాధాన్యత లేని కాలంలో దానిపట్ల మీ ఆసక్తికి కారణమేమిటని ఆయనను అడిగితే "కొన్ని ఇంగ్లీషు క్లాసిక్ చిత్రాలు చూసినప్పుడు నేపథ్య సంగీతానికున్న ప్రాధాన్యత ఏమిటో తెలిసింది. ఓ పర్టిక్యులర్ సీన్ బాగా రావటానికి ,ప్రేక్షకుని మదిలో కలకాలం నిలిచిపోవటానికి అది ఎంతో దోహదం చేస్తుంది. ఓ చిత్రం బాగా రావాలని నేను కోరుకుంటాను. అందుకోసం నా నుండి ఎటువంటి సహకారం అవసరమో అది పూర్తిగా అందించటానికి కృషి చేస్తాను. అయితే దురదృష్టవశాత్తు ఇండియాలో బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ కు అంత ప్రాధాన్యత లేదు, ముఖ్యంగా దక్షిణాదిలో. ఇక్కడ రీ-రికార్డింగ్‌కు కేవలం 3 లేదా 4 రోజులు మాత్రమే ఇస్తారు. అంత తక్కువ సమయంలో అత్యద్భుతమైన సంగీతం ఎక్కడ నుండి వస్తుంది?" అని ప్రశ్నిస్తారాయన.

రెహమాన్ పేరుంటే చాలు, ఆ క్యాసెట్‌ను ఎంత రేటయినా సరే కొని తెచ్చుకుంటున్న శ్రోతలు లక్షల సంఖ్యలో ఉన్నారు. తమిళం ఒక్క ముక్కకూడారాని ఉత్తరాది వారి ఇళ్ళలో కూడా తమిళ సినీ గీతాలు విన్పిస్తున్నాయంటే అందుకు రెహమాన్ సంగీతమే కారణం. చిరకాలంగా ఉన్న భాషా ద్వేషాలను , ప్రాంతీయపరమైన అడ్డుగోడలను ఛేదించి , యావద్భారతాన్ని తన సంగీతంతో ఆకట్టుకున్న సంగీత

దర్శకుడు రెహమాన్. ప్రముఖ సంగీత దర్శకుల జంట నదీం శ్రావణ్‌లలో ఒకరైన శ్రావణ్ దీనినే తెలుపుతూ "ఉత్తరాది వారిని మెప్పించటంతో పాటు, దక్షిణాది ప్రభావమూ బాగా కన్పించే జాతీయ ధ్వని అతని సంగీతంలో విన్పిస్తుంది. అదే అతని విజయానికి కారణం " అంటారు.

రెహమాన్ సంగీతం పామరులనే కాక పండితులను కూడా అలరిస్తుంది. దేశవిదేశాలలో ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ఉస్తాద్ జాకీర్ హుస్సేన్, రెహమాన్ సంగీతం సంచలనం సృష్టించటానికి మూడు విషయాలు దోహద పడ్డాయని తెలుపుతూ -ఒకటి అతి చిన్న వయసులో సంగీత దర్శకత్వం వహించి సంచలనం సృష్టించటమే కాక, కాలానుగుణంగా వివిధ సంగీత రూపాలను కనిపెట్టడం, రెండు ఇళయరాజాతో అతనికున్న సాన్నిహిత్యం, మూడు మణిరత్నం వంటి సంచలన దర్శకుడు అతన్ని తీసుకురావటం. వీటన్నింటికన్నా అతనికున్న ఏకాగ్రత, పరిశీలనాదృష్టి, చిత్తశుద్ధి - ఇవే అతన్ని మాస్టర్‌ను చేసాయంటారాయన.

నాణానికి రెండు వైపులా ఉన్నట్లే, పొగడ్తలున్నచోట్ల విమర్శలుండటం కూడా సహజం. రెహమాన్ సంగీతంలో ఎలక్ట్రానిక్ వాయిద్యాల హోరు ఎక్కువగా ఉండటమే కాక మాటలు కూడా సరిగా అర్థం కావనే వారు కూడా ఉన్నారు. గీత రచయిత సమీర్ అయితే రెహమాన్‌ను సంగీత దర్శకుడనటం కన్నా నిర్వాహకుడనటం బాగుంటుందంటారాయన, ఎందుకంటే ఆయన పాటలో సాహిత్యం కన్నా, సంగీతం ఎక్కువగా విన్పిస్తుంది. ఆయన పాటలో కొన్ని మాటలుండవు, ఉన్నా అర్థం కావని అంటారాయన. పండిట్ శివకుమార్ శర్మ అయితే - సంగీతం కూర్చే వారికి భాషపై పట్టు ఉండాలి, అప్పుడే మ్యూజిక్ పండుతుంది. దురదృష్టవశాత్తు రెహమాన్‌కు భాష పై పట్టు లేకపోవటం విచారించవలసిన విషయం - అని అన్నారు. మొదట్లో ఒకే రకమైన సంగీతాన్ని ఇస్తున్నాడనే విమర్శలు వెల్లువెత్తినా 1947 ఎర్త్, తక్షక్, తాల్, నాయక్, లగాన్ తదితర చిత్రాలతో ఆ అపవాదు కొంత వరకూ పోయిందనే చెప్పాలి.

తనపై వస్తున్న విమర్శలకు ప్రతిస్పందిస్తూ - "అసలు నా నుండి ఎటువంటి సంగీతం కావాలన్న విషయంపైనే వారికి స్పష్టమైన అవగాహన లేదు. ప్రతిసారి



మంచి సంగీతం ఇవ్వటానికే కృషి చేస్తాను. నేను చేసే పని ముందుగా నాకు నచ్చాలి. చేసిన ట్యూన్ మరలామరలా చేస్తే నేను ఈ స్థాయికి రాలేను, లేకపోతే ఆండ్రూ లాయిడ్ వెబర్ వంటి జీనియస్ నాకు ' బాంబే డ్రీమ్స్ ' హాలీవుడ్ చిత్రానికి అవకాశం ఇవ్వరు కదా" -అని అంటారు రెహమాన్.

ఎ.సి.రూమ్‌లు, విదేశాలలో మ్యూజిక్ సిట్టింగ్స్ జరిపి ట్యూన్స్ సిద్ధం చేయాలనే సిద్ధాంతానికి రెహమాన్ వ్యతిరేకం. "మంచి సంగీతం అనేది ఎక్కడైనా పుట్టవచ్చు. అది మట్టి కుండ కావచ్చు లేదా పగిలిన అద్దం, టేప్ రికార్డర్ ఏదైనా కావచ్చు. హైటెక్ స్టూడియోలో మాత్రమే మంచి సంగీతం పుడుతుందంటే నేను నమ్మను. ఒకవేళ పుట్టినా అది కలకాలం నిలవదు. అందుకే అశేష జనవాహిని ముందు ఓ శాస్త్రీయ వాయిద్యకారుడు ఇచ్చే కచేరికి లభించే ప్రశంసలు సాటిలేనివి" అని అంటారాయన. ఈ అభిప్రాయం ఉండబట్టే రెహమాన్ పాటలలో ఎన్నో ప్రయోగాలు చూడగల్గుతున్నాం.

ఈ విషయమే గాయకుడు ఎస్పీ బాలసుబ్రమణ్యం తెలుపుతూ " రెహమాన్ పాట కంపోజ్ చేసే విధానం చాలా టిపికల్‌గా ఉంటుంది. ఓ పాట ఉందంటే మొత్తం ట్యూన్‌ని ఆడ, మగ సింగర్స్ చేత పూర్తిగా పాడించటమే కాక వాయిద్యకారులచేత కూడా పూర్తి పాటకు పనిచేయిస్తాడు. అలా రికార్డయిన పాటలో పర్మిటేషన్లు, కాంబినేషన్లు వేసుకుంటూ కట్ అండ్ పేస్ట్ పద్ధతిలో అలా పాట పై ప్రయోగాలు చేస్తూనే ఉంటాడు. సంతృప్తిగా మార్పులు, చేర్పులు చేసిన తర్వాత మాత్రమే అసలు పాట సిద్ధమవుతుంది. ఇదే రెహమాన్ విజయానికి కారణం. అసలు ఇలా చేయాలనే ఆలోచన, ఓ పాటకు ఇంత సమయం వెచ్చించే తీరిక ఇప్పటి సంగీత దర్శకులకు ఉందా?" అని ప్రశ్నిస్తారాయన.

పాటను బట్టే గాయకుడనే కొత్త సిద్ధాంతాన్ని రెహ్మాన్ బాగా పాపులర్ చేసారు. అందుకే తనతో పాటు 'నెమిసిస్ అవెన్యూ బ్రాండ్'లో డ్రమ్మర్‌గా పనిచేస్తున్న సురేష్ పీటర్‌తో ' చికుబుకు చికుబుకు రైలే ' పాట పాడించారు. అలాగే వసుంధరా దాస్, మిన్మిని....ఇలా చాలా మంది గాయనీ గాయకుల్ని పరిచయం చేసింది రెహమాన్ కావటం విశేషం.

" సంగీతమే నాకు మిత్రుడు, ప్రాణం. దానికోసం నేను ఏమైనా చేస్తాను. మనం ఓ మంచి అల్బమ్ చేయాలనుకున్నప్పుడు అప్పటికే నాణ్యతా ప్రమాణాలను సృష్టించిన అల్బమ్‌ను పరికించక తప్పదు. అప్పుడే దానికన్నా మేలైన సంగీతం ఇవ్వటానికి వీలుకుదురుతుంది. నేను వందేమాతరం అల్బమ్ సృష్టించినప్పుడు ఇండియన్స్ రూపొందించిన అల్బమ్స్‌తో పాటు, పాశ్చాత్య సంగీతాన్ని కూడా పరికించాను. అయితే ఎక్కడా కూడా వాటిని కాపీ చేయలేదు. అందరూ అంటున్నట్లుగా మైఖేల్ జాక్సన్ అల్బమ్ ఎర్త్ ను నేను కాపీ చేసాననటం సరికాదు" అని అంటారాయన.

అతి చిన్న వయసులో ఓ భారతీయ సంగీత దర్శకుడు హాలీవుడ్ చిత్రానికి సంగీతాన్ని అందించటం రెహమాన్ తోనే ప్రారంభం. ఇకపై మీ దృష్టి అంతా హాలీవుడ్ మీదనేనా అని ఆయనను అడిగితే -" హాలీవుడ్ నా లక్ష్యం ఏమీ కాదు. నేను ఏమి చేస్తున్నానో దాని మీదనే నా దృష్టి కానీ, ఒక్కసారే ఏదో సాధించేయాలనే కోర్కె నాకు లేదు. అయితే ఒక్కటి మాత్రం చెప్పగలను, భవిష్యత్తులో నేను మరో హాలీవుడ్ చిత్రం చేస్తే మాత్రం భారతీయ సంగీతపు రుచి మాత్రం చూపించక ఉండను" అని అన్నారు. భారతీయ సంగీతాన్ని ప్రపంచ స్థాయికి చేర్చాలని కలలుకంటున్న రెహ్మాన్ ఈ ప్రయత్నంలో తప్పక విజయం సాధించాలని కోరుకుందాం.

- పి.గిరి

## ఒకే ఒక్కడు

రచన: ఎ.ఎం.రత్నం, శివగణేష్ — గానం: వసుంధర, ప్రవీణ్ మణి, దేవన్

ఆ: షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి
షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి
ఆ: షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి లుక్కులివ్వ తోచలేదా
షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి లవ్వుచెయ్య తోచలేదా
నొనొ నొనొ నొ నొ నొ నొనొ నొనొ నొ నొ నో ॥షకలక॥
ఆ: మాటలల్లో చెప్పేది రోజా ఒకటి విసిరిచూడు షయ్యో షయ్యో
షయ్యో నొనొ నొనొ నొ నొ నొ నొనొ నొనొ నొ నొ నో
భ భ భ భ భ భ భ భయమేల ద ద ద ద ద ద ద దడయేల
లోలోన దాగిందంత లెటర్‌రాసి పంపవేల నొనొనొ నొ నొనొ
షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి లుక్కులివ్వ తోచలేదా(2)
ఆ: సాగరతీరంలో కాలె మండుటెండల్లో
మిట్టమధ్యాహ్నం మీటవుదాం హో ... హో...
ఒక కోకా కోలలో రెండు స్ట్రాలువేసి
సాయంకాలం దాక తాగుతుందామా నొనొ నొనొ నొనొ
ఆ: నా డ్రస్సుమీద ఐస్‌క్రీం వేసిపో ఓ... హో... హో...
అది తుడిచేసొక్కూడ తాకిపో షయయయ యాయ్యయాయ్య
ఫ్రయిడే టెంపుల్లకు తీసుకుపో సాటర్‌డే డిస్కోథెక్‌కు తీసుకుపో
సండే టైటానిక్ తీసుకుపో తీ సు కు పో నన ననన న॥షక॥
ఆ: నే స్త్రీనైతే నువు మగవాడైతే వియ్యే ఎక్ దూజే కేలియే హత్తుకో
ఎక్ దూజె ఎక్ దూజె ఎక్ దూజె కేలియే
కెపాస్ అన్ ద క బేటా ఇకర్రామ్మా
హే హే హే ఏమయిందిరా మీకు
స్త్రీలంటే మీకు ద్వేషమా నువ్వు ఇరవైయ్యేళ్ళ ముసలాడివా
యంత్రానికి పుట్టినోడివా షయ్యోరే హోరే
ఆశ నీకు లేనె లేదా నువ్వు మీసమున్న చెట్టు చేమవా హహహ
క్రీస్తుపూర్వం పుట్టినోడివా షయ్యోరే హోరే
అ: లవ్వుల్లో మునిగి లైఫంత విసిగి
గడ్డాలే పెంచుకున్నాం చాలు చాలు
అమ్మాయిలు చదువుల్లో అధికులవగా
మేమూ ఓడిపోయాం ఓడీ పోయాం
లవ్వుల్లో పడితే లవ్వుల్లో పడితే జీవితం సాగునులే సాగేనులే
లైఫుల్లో గెలిస్తే లైఫుల్లో గెలిస్తే అమ్మాయిలే వచ్చునులే వలచేనూలే
ఇ: ॥షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి॥
అ: ఐ డోన్ట్ వాన్ట్ ఐ డోన్ట్ వాన్ట్ ఐ డోన్ట్ వాన్టూ లవ్
ఆ: ఎ పోయ్యా ఆడియోా సమ్ యిగో

## ప్రేమికుడు

రచన: రాజశ్రీ — గానం: సురేష్ పీటర్

చికు బుకు చికు బుకు రైలే
అదిరెను దీని స్టయిలే
చక్కనైన చిక్కనైన ఫిగరే
అది ఓకే అంటే గుబులే ॥చికు॥
దీని చూపుకు లేదు ఏ భాషా
కళ్ళలోనే ఉంది నిషా
దీని హొయలే చూస్తే జనఘోష
చెంగు తగిలితె కలుగును శోష ॥చికు॥
అహ... సైకిలెక్కి మేం వస్తుంటే
మీరు మోటర్ బైకులే చూస్తారు
అహ... మోటర్‌బైకుపై మేం వస్తుంటే
మీరు మారుతీలు వెతికేరు
అహ... జీన్స్ పాంటుపై మేం వస్తే
మీరు బ్యాగిప్యాంట్లుకై చూస్తారు
అహ... బ్యాగి ప్యాంట్లుతో మేం వస్తే
మీరు పంచలొంక చూస్తారు
మీకు ఏమి కావాలో మాకు అర్థం కాలేదే
పూలబాణాలేశామే పిచ్చివాళ్ళయి పోయామే ॥చికు॥
మాకు ఆటపాటలో అలుపొచ్చే
మీ వెనక తిరిగి ఇక విసుగొచ్చే
మా మతులు చెదిరి తల నెరుపొచ్చే
రాదులే వయసు మళ్ళీ
మీ పెళ్ళి కొరకు మీ పెద్దోళ్ళు
రేపిచ్చుకోవాలి కట్నాలు అవి లేక జరగవు పెళ్ళిళ్ళు
ఎందుకీ గోల మీకు
మీరు ఇపుడే లవ్‌చేస్తే మూడు ముళ్ళు పడనిస్తే
కన్నవాళ్ళకు అది మేలు చిన్నవాళ్ళకు హాపీలు ॥చికు॥

## ప్రేమికుడు

రచన: రాజశ్రీ. గానం: బాలు, ఉదిత్‌నారాయణ్, పల్లవి, బృందం

అ1: అందమైన ప్రేమరాణి చెయ్యితగిలితే
అ2: సత్తురేకు కూడ స్వర్ణమేలే
అ1: అందమైన ప్రేమరాణి లేత బుగ్గపై
అ2: చిన్న మొటిమ కూడ ముత్యమేలే
అ1: చెమట నీరె మంచిగంధం ఓర చూపె మోక్షమార్గం
వయసులా సంగీతమే
అ2: ఊహుఁ... భూమికే భూపాలమే ॥వయసులా॥
అ: అందమైన ప్రేమరాణి ఉత్తరాలలో
పిచ్చిరాతలైన కవితలౌనులే
ఆ: ప్రేమ ఎపుడు మనసులోన భేదముండదే
ఎంగిలైన అమృతమ్ములే
అ: బొండుమల్లి ఒక్కరూపాయ్
నీ కొప్పులోన చేరితే కోటి రూపాయిలు
ఆ: పీచు మిఠాయి అర్ధరూపాయ్
నువ్వు కొరికి యిస్తే దాని విలువ లక్షరూపాయ్‌లు॥అంద॥
ఆ: ప్రేమ ఎపుడు ముహూర్తాలు చూసుకోదులే
రాహుకాలం కూడా కలిసి వచ్చులే
అ: ప్రేమ కొరకు హంసరాయబారమేలనే
కాకి చేత కూడ కబురు చాలులే
ఆ: ప్రేమజ్యోతి ఆరిపోదే ప్రేమబంధం ఎన్నడూ వీడిపోదె
అ: ఇది నమ్మరానిది కాని కాదె
ఈ సత్యం ఊరికి తెలియ లేదె
ఆ: ఆకసం భూమి మారినా మారులే
కానీ ప్రేమ నిత్యమే
ఆదిజంటా పాడినా పాటలు
ఇంకా వినిపించులే
ప్రేమా తప్పు మాటని ఎవ్వరైన చెప్పినా
నువ్వు బదులు చెప్పు మనసుతో
ప్రేమా ముళ్ళ బాటకాదు వెళ్ళవచ్చు అందరూ
నువ్వు వెళ్ళు నిర్భయమ్ముగా

## ప్రేమికుడు

**రచన: రాజశ్రీ** **గానం: మనో, స్వర్ణలత**

అ: ముక్కాలా ముక్కాబులా లైలా ఓ లైలా
ముక్కాబులా చుక్కానిలా లైలా ఓ లైలా
ఆ: లవ్వుకి కాపలా పరువాల తుపాకులా
శృంగార వీరుల సింధూర పువ్వులా
మత్తుజల్లే మంచు వెన్నెలా ఓలేలో ॥ముక్కాలా॥
జురాసిక్ పార్కులోన సరదాగ జోడిలే
క్లాస్ మ్యూజిక్ నేడే పాడేను
పికాసో చిత్రం నన్ను వెంటాడే చిత్రంగ టెక్సాస్‌లో నాతో ఆడేను
ఆ: కౌబాయి కన్ను కొడితే ప్లే బాయి చెయ్యే పడితే
ఒళ్లంతా సెక్సయ్యింది గుండెల్లో ఫిక్సయ్యింది
అ: పాప్ మ్యూజిక్ థ్రిల్లయ్యేను స్టార్ బేబి కళ్లయ్యేను
లవ్‌స్టారై ఊరించేను పిచ్చెక్కి ఊగించేను
ఆ: మన ప్రేమ గీతమే ప్రతినోట పలకగా ॥ముక్కాలా॥
తుపాకి లోడుచేసి గురిపెట్టికాల్చిన హృదయాలు గాయపడునా
అ: దీనంగా ననుపట్టే వలతెచ్చివేసిన ఆ నింగి చుక్కలు చిక్కేనా
ఆ: భూకంపం వస్తే ఏంటి భూగోళం పోతే ఏంటి
ఆకాశం విడిపోతుందా ఏవైనా రెండవుతుందా
అ: రావే నా రాజహంస రతనాల మణిపూస
జింకల్లే చిందులెయ్యి సందేల విందుచెయ్యి
ఆ: సంతోష మెన్నడూ సాగరమై సాగదా ॥ముక్కాలా॥

## ప్రేమతో

**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి** **గానం: శుభ, సుఖ్వీందర్ సింగ్**

ప: ఛల్ ఛయ్య ఛయ్య ఛయ్యా ఛయ్యా
ఛల్ ఛయ్య ఛయ్యా ఛయ్యా ఛయ్యా (2)
చెలి కిలకిలలే చిటికెయ్య హొయ్య (2)
మది చెదిరి కథాకళి చెయ్య హొయ్య (2) ॥ఛల్॥
చ: ఓ కన్నియపై చూపున్నదయా
ఎదుటపడే చొరవుండదయా మనసాప లేక మాటాడ లేక
ఒక ఖయ్యామై తయ్యారయ్యా ॥ఛల్॥
గుమ్మంటు గుబాళిస్తున్నదయా
ప్రతిచోట తనే అంటున్నదయా ॥గుమ్మంటు॥
తనవెంటపడే నా మనవి విని ఏనాటికి కనిపించేనయ్యా ॥తన॥
తొలగేన మరీ ఈ మాయ తెర
తన చెలిమి సరి నా కలిమి అని
తన చెలిమి చెలిమి నా కలిమి కలిమి (3)
జాలి పడైనా ఆ అనదే
మరియాదకైన పరదా విడదే
అపరంజి చిలక శ్రమపడిన ఫలితమై
నావైపె వస్తూ వున్నదయా
చెలి కిలకిలలే చిటికెయ్య హొయ్య (2) ॥ఛల్॥
చ: మదినూయలలూపే సొగసయ్యా
తొలి తూర్పు కంటులే చెలిఛాయ
పరువాల తరంగమె తానయ్యా
మహరాణి రూపు హరివిల్లయ్యా (2)
ఎంతటి అలకే కిన్నెరసాని మావని చేరే అల్లరిమాని (2)
చెప్పరయ్యా నారాణి తోటి
తన వెంటపడే దారేదయ్యా ॥ఛల్॥

## ఒకే ఒక్కడు

**రచన: ఏ.ఎం.రత్నం, శివగణేశ్.**
**గానం: ఎస్.జానకి, శంకర్‌మహదేవన్, బృందం**

అ: మగధీర ధీర ధీర ధీర ధీర ధీర ధీరా (2) మగధీరా
ఆ: మగధీర నన్నే చేకొనరా నాపైట నెగరవేయ సమయమేదిరా
ఓ ప్రేమపిచ్చి పట్టి వగచేరా ముద్దుల వర్షం కురిపించరా
కత్తుల సవ్వడి విన్న వీరా గాజుల సవ్వడి వినుకోవేరా
మగధీరా మగధీరా ॥మగధీర॥
ఆ: ఆ.. ఆ.. శుభ ఘడియ చూసి కురులు తీసి
పద్దురాయరా జబ్బపైనా
అ: ఆ.. ఆ.. బంగారు కుంచె తేనెలో ముంచి
సంతకం చేస్తా నీ గుండెపైనా
ఆ: లోకం కోసం నిధి పంచు
ఈ దేహం కోసం ఒడిపంచు
అ: ప్రభువుల మనుగడ విధి ధర్మం
బలికావడమే చెలి ధర్మం
ఆ: ప్రియతమా... ప్రియతమా... నీకై వేచి ఉన్నా ॥మగధీరా॥
ఆ: గుడులెన్నో తెరచి బడులు తెరచి
పడక గది చేర తీరికలేదా
అ: ఓ.. కలహాలు తీర్చి చట్టాలు మార్చి
కౌగిలి చేరుట పాడి కాదా
ఆ: మోహంలో నను ముంచేసి మంత్రులతోనే మంతనమా
అ: నీ కంట నీరు తుడవంగా ఊళ్లో కుళాయి నీళ్లిచ్చునా
ఆ: ప్రణయమా ప్రణయమా నాపై దయచూపుమా ॥మగధీర॥
ఆ: మగధీర నన్నే చేకొనరా నాపైట నెగరవేయ సమయమేదిరా
ప్రేమపిచ్చి పట్టి అ: వగచేవా
ఆ: ముద్దుల వర్షం అ: కురిపిస్తా
ఆ: కత్తుల సవ్వడి అ: ఆగువేళ
ఆ: గాజుల సవ్వడి అ: నే వినుకుంటా ॥మగధీర॥

## బొంబాయి

**రచన: వేటూరి** **గానం: రేమో ఫెర్నాండెజ్**

అది అరబిక్ కడలందం దాని తళుకే కన్నాలే
చెలి ఆట తలుక్కు లేత వణుక్కు
కౌగిళ్లడిగానే హమ్మ హమ్మ హమ్మహమ్మహమ్మ
విప్పారే తామరవే రూపంతా కన్నాలే
నీ పట్టు రైకల విదియ తదియ వైనం చూశాలే ॥హమ్మ॥
చీర వచ్చే ముందు జారే మోజులకు ఆహో ఎంత సుఖమో
పైలా పచ్చ పసివేళ తగిలినపుడహో ఎంత ఇహమో
చిత్రాంగీ చిలక రాత్రీ పగలనక ముక్తాయించె నడుమో
అందం దాని మతమంతేలేని విధమయ్యో దివ్య పథమో
హమ్మ హమ్మ హమ్మహమ్మహమ్మ ॥అది॥
ఏదో సరసమిది ఎంతో విరహమిది మొత్తం మీద చిలకో
తాపం మంచమెక్కి దీపం కొండ ఎక్కి కంట్లో వెలిగే మనసు
వాన పడితె మీద భూమి ఒళ్లంత పొంగి తల్లో సెగలు పెరిగే
తాపం కరిగిపోయె కళ్లే నిదరపోయే
కానీ మనసు బెణికే
హమ్మ హమ్మ హమ్మహమ్మహమ్మ
హే హే హమ్మ హమ్మ హమ్మ హమ్మ... ॥అది॥

## మెరుపు కలలు

రచన: వేటూరి

గానం: చిత్ర, ఉన్నిమీనన్, శ్రీని

హూ లలల్లా ఓ హులలల్లా ఒ హులల ల్లల్లాలల్లా (2)
అ: మచిలీపట్నం మావిడి చిగురులో
పచ్చని చిలక అలిగి అడిగిందేవిటంట
నాకంటి కెంపు లలకా నా రెక్క నునుపు తళుకా
చిలకా దేవి కన్నుగీట సాగే నా పల్లవి ॥హూ॥
అ: మెట్టదారి యిదే బండికి వాలు యిదే
ఓ పోంకాల పోరీ ఒకతీ కోలికట్టుకున్న చీర పొగరుచూశా
వానవిల్లు వర్ణం వహ్
అ: మనసున మల్లెవాన చింది చింది సుధ చిలికే నయగానం
మది ఎద వాలి గిల్లి కొత్త తాళమడిగినదే చెలగాటం ॥హూ॥
అ: తందాన తందాన తాకి మరీ తందాన ఏతాళం వాయించాడే
తందాన తందాన పాట వరస తందాన ఏరాగం పాడిస్తాడే
సిరివలపో మతిమరుపో అది హాయిలే
సిరిపెదవో విరి మధువో ప్రియ మేనులే
తందాన తందాన కన్నె ప్రేమ తందాన వచ్చిపోయే వాసంతాలే
మనసిజ మల్లివేళ సిగ్గు సిగ్గు లయలొలికే వ్యవహారం
అది అలవాటు కొచ్చి గుచ్చి చూసే మనసడిగే చెలగాటం॥హూ॥
అ: తందానా తందానా ఊసు కనుల తందానా ఊరించే పెట్టుతేనె
తందానా తందానా పాటకొక్క తందానా చెవినిండా గుమ్మెత్తేనె
వయసులలో వరసలలో తెలియందిదే
మనసుపడే మౌన సుఖమె విరహానిదే
ఏ.. తందానా తందానా మేఘరాగం తందానా
వచ్చె వచ్చెవాన జల్లే
మధురస మాఘవేళ కన్నుగీటి కథనడిపే సాయంత్రం
తొలి చెలిగాలి సోలి కొత్త తోడు కలిసినదే చెలగాటం ॥హూ॥

## ముత్తు

రచన: భువనచంద్ర

గానం: మనో, సుజాత

తిల్లానా తిల్లానా నా కసి కళ్లకూనా
చిక్ చిక్ చిందెయ్ అన్నానా ॥తిల్లానా॥
ముద్దు చాలె మీనా అది ఎంత చిన్నదైనా
చక్ చక్ ఇచ్చెయ్ అన్నానా
కన్నుగీటితే సుల్తానా
పసికట్టు దాటెరా దీవానా
కొంటె ముద్దుల కప్పంకట్టి
కాటే వేసెయ్‌నా ॥తిల్లానా॥
పైట చెంగు పాడిందయ్యో
పరువాల పాట
కట్టి కట్టి ముద్దోటిస్తే
అదిరేను ఆట
కల్లా కపటమేదీ లేని
జవరాలి పాట
పట్టెమంచెమేస్తే ఇంక
చెలరేగి పోదా
వసంతాల వాకిట్లో
వయ్యారాల విందమ్మా
కులాసాల సందిట్లో విలాసాల వేటమ్మా
పదారేళ్ల వంపుల్లో మజా చేసుకుందామా
పదాలింక చాలించి పెదాలందుకుందామా
కడే లేని ముంగిట్లో సడే చేసుకుందామా ॥తిల్లానా॥
ఎర్రపాటి కుర్రోళ్లంత ఎనకాల ఉంటే
నల్ల పిల్లగాణ్ణే కోరి మనసివ్వనేల
నల్లనల్ల మేఘంలోనె నీరుంటదంటా
నల్లవాడి గుండెల్లోనె తల దాచుకుంటా
మారాల చేమంతి నీలి ఒళ్లె ఉయ్యాల
మందార పువ్వుల్లె ఎర్రబారి సందేళ
చక్కనమ్మ కౌగిట్లో చిక్కుకుంటి ఈ వేళ
వెన్ను పట్టి ఏకంగా వెన్నదోచుకోవాల
కట్టుదాటి గోదారల్లె నిన్నూ ముంచి వెయ్యాల
తిల్లానా తిల్లానా నీ పెదవుల్లో తేనా
టక్ టక్ ఇచ్చెయ్ అన్నానా
ముద్దు చాలె మీనా అది ఎంత చిన్నదైనా
చక్ చక్ పెట్టెయ్ అన్నానా

## దొంగ దొంగ

రచన: రాజశ్రీ

గానం: మనో

కనులు కనులను దోచాయంటే ప్రేమ అని దానర్థం
నింగి కడలిని దోచేనంటే మేఘమని దానర్థం
తుమ్మెద పువ్వుని దోచిందంటే ప్రాయమని దానర్థం
ప్రాయమే నను దోచిందంటే
పండగే నని అర్థం అర్థం ॥కనులు॥
వాగులై ఉరికితే వయసు కులుకే అని అర్థం
కడలియె పొంగితే నిండు పున్నమేనని అర్థం
ఈడు పకపక నవ్విందంటే ఊహు అని దానర్థం
అందగత్తెకు అమ్మైపుడితే ఉరికత్తని అర్థం అర్థం ॥కనులు॥
పడవలె నదులకు బంధుకోటి అని అర్థం
చినుకులె వానకు బోసినవ్వులే అని అర్థం
వెల్లవేస్తే చీకటికి అది వేకువౌనని అర్థం
ఎగిరితే నువుఎముక విరిస్తే
విజయమని దానర్థం అర్థం ॥కనులు॥

# రెహమాన్ మెలొడీస్

## రోజా

**రచన: రాజశ్రీ** **గానం: మిన్మిని**

చిన్ని చిన్ని ఆశ చిన్నదాని ఆశ
ముద్దు ముద్దు ఆశ ముత్యమంత ఆశ
జాబిలిని తాకీ ముద్దులిడ ఆశ
వెన్నెలకు తోడై ఆడుకోను ఆశ ॥చిన్ని॥
పువ్వులా నేను నవ్వుకోవాలి
గాలినే నేనై సాగిపోవాలి
చింతలే లేక చిందులెయ్యాలి
వేడుకలలోనా తేలిపోవాలి ॥చిన్ని॥
తూరుపు రేఖ వెలుగు కావాలి ॥చిన్ని॥
చేనులో నేనే పైరు కావాలి
కొలనులో నేనే అలను కావాలి
నింగి హరివిల్లు వంచి చూడాలి
మంచు తెరలోనే నిదురపోవాలి
చైత్ర మాసంలో చినుకు కావాలి ॥చిన్ని॥

## బొంబాయి

**రచన: వేటూరి** **గానం: హరిహరన్, చిత్ర**

అ: ఉరికే చిలకా వేచి ఉంటాను కడవరకూ
కురిసే చినుకా ఎల్లువైనావే ఎదవరకు
చెలివై సఖివై రెండు హృదయాల కథలు విను
బ్రతుకే బరువై నిండు విరహాల కబురు విను
కాటుక కళ్ళతో కాటువేశావు నన్నెపుడో
కాలం చెల్లితే ఇంత మన్నేసిపో ఇపుడు ॥ఉరికే॥
నీ రాక కోసం తొలిప్రాణమైన దాచింది నా వలపే
మనసంటి మగువ ఏ జాము రాక చితిమంటలే రేపే
నా కడ ప్రాణం పోనివ్వు కథ మాసి పోదు
అది కాదు నా వేదనా
విధి విపరీతం నీ మీద అపవాదు వేస్తే
ఎద కుంగి పోయేనులే
మొదలో తుదలో వదిలేశాను నీకే ప్రియా
ఆ: ఉరికే చిలకే వచ్చి వాలింది కలత విడి
చెలిగా సఖిలా తను చేరింది చెలుని ఒడి
నెలవే తెలిపే నిన్ను చేరింది గతము విడి
కలకి ఇలకి ఊయలూగింది కంటపడి
అ: కాటుకా కళ్ళతో కాటువేశావు నన్నెపుడో
కాలం చెల్లితే ఇంత మన్నేసి పో ఇపుడు ॥ఉరికే॥
ఆ: తొలి ప్రాణమైన ఒకనాటి ప్రేమ మాసేది కాదు సుమా
ఒక కంటి గీతం జలపాతమైతే మరు కన్ను నవ్వదమ్మా
నా పరువాల పరదాలు తొలగించి వస్తే కన్నీటి బుడగాయెనే
నే పురివిప్పి పరుగెత్తి గాలల్లే వచ్చా నీ వేణు గానానికి
అరెరే అరెరే నేడు కన్నీట తేనె కలిసే
అ: ఉరికే చిలకా వేచి ఉంటాను కడవరకూ
కురిసే చినుకా ఎల్లువైనావే ఎదవరకు
చెలివై సఖివై రెండు హృదయాల కథలు విను
బ్రతుకే బరువై నిండు విరహాల కబురు విను
ఆ: మోహమో మైకమో రెండు మనసుల్లో విరిసినది
పాశమో బంధమో ఉన్న దూరాలు చెరిపినది
ఉరికే చిలకే వచ్చి వాలింది కలతవిడి
నెలవె తెలిపే నిన్ను చేరింది గతమువిడి

## తెనాలి

**రచన: వెన్నెలకంటి** **గానం: యస్.పి.బాల సుబ్రహ్మణ్యం, చిత్ర**

ఆ: ఎదను దోచి ఏదో చేసి కళ్ళనిండ కలలే దాచి (2)
చెంతకి చేరకా ఊరింతు వేలా
ప్రాణమా ప్రాణమా...
అ: ఎదనే నిదురించవా ఎదురై మురిపించవా
పాటై పలికించవా తోడై పులకించవా ప్రాణమా ప్రాణమా... ॥ఎదను॥
అ: ప్రాయమా ప్రాయమా (2)
నన్ను చూసి నన్నే చూసి కళ్ళతోటి కలలే దోచి
తీయని మోహాల మరిగింతు వేలా ॥ఎదనే॥
ఆ: కలిసిన కళ్ళే కలలకు ఇళ్ళయి
వయసును గిల్లే మన్మధ విల్లయి (2)
అ: హాయిగ ఊగే ఊయలలూగే
అందం ఎరవేసె చందం ఏదో సాగే
ఆ: ఆశల గోదారి ఎగిసినదంటా
తారల పువ్వులన్ని కోసుకుందమంటా
అ: నిదురించు ప్రేమయే ఉదయించె నేడే
ఆ: నిదురించు ప్రేమయే ఉదయించె నేడే ప్రాణమా ప్రాణమా
అ: హృదయాన మ్రోగే ఈ రాగహేల
మధురం కదా ఇక మన రాసలీల
ఆ: రెక్కలు తొడిగే తలపులు చాలా
దిక్కులు దాటే ఎద ఈ వేళా
అ: ఎదవీణ దాచే మౌన గీతమేలే పున్నాగ విరుల సన్నాయి నీవే
ఆ: జత నీవని నిన్నే వలచి వచ్చానే ॥ప్రాణమా॥
ఆ: ఎదనుదోచి అ... ఎదనుదోచి ॥ఎదనే॥

## ప్రేమికుడు

**రచన: రాజశ్రీ** **గానం: ఉన్నికృష్ణన్, బృందం**

ఓ చెలియా నా ప్రియసఖియా చెయి జారెను నా మనసే
ఏ చోట అది జారినదో ఆ జాడే మరచితినే
నీ అందెలలో చిక్కుకుంది అనీ నీ పదముల చేరితినే
ప్రేమంటే ఎన్ని అగచాట్లో మన కలయిక తెలిపినదే
నా గుండెలలో ప్రేమ పరవశమై ఇరు కన్నులు సోలెనులే ॥ఓ చెలి॥
ఈ పూట చెలి నా మాట ఇక కరువై పోయెనులే
అధరము ఉదరము నడుమను ఏదో అలజడి రేగెనులే
వీక్షణలో నిరీక్షణలో మరుక్షణమొక యుగమేలే
చూపులన్ని వెంటాడినట్టు మది కలవర మాయెనులే
ఇది స్వర్గమా నరకమా ఏవిటో తెలియదులే
ఈ జీవికి జీవన మరణము నీ చేతిలో ఉన్నదిలే ॥ఓ చెలి॥
కోకిలమ్మా నువు సైయ్యంటే నే పాడెను సరిగమలే
గోపురమా నిను చేరుకొని సవరించేను నీ కురులే
వెన్నెలమ్మా నీకు జోలపాడి కాలి మెటికలు విరిచేనే
వీచేటి చలి గాలులకు తెరచాపై నిలిచేనే
నా ఆశల ఊసులే చెవిలోన చెబుతానే
నీ అడుగుల చెరగని గురుతులే
ప్రేమ చరితలు అంటానే ॥ఓ చెలి॥

## డ్యూయెట్

రచన: వెన్నెలకంటి — గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

అ: అంజలీ అంజలీ పుష్పాంజలీ(2)
పూవంటి పదములకు పుష్పాంజలి
ముద్దయిన పెదవులకు మోహాంజలి
కలహంస నడకలకు గీతాంజలి
కనరాని నగవులకు కవితాంజలి ॥అంజలి॥
అ: నిన్నదాక నువ్వూనేను యిరువురం ఎవరనీ
కమ్మని బంధం యిలా తెలిపెను ఒకటని
కడలిని పడు వానలా కలిసి మదియిదీ
కరిగిన సిరిమోజులా కథ ఇది నాచెలి
ఎదురుగ తొలి స్వప్నం తొణికినది ఎదలో మధుకావ్యం పలికినది
అంజలీ అంజలీ వలపు లతాంజలీ ॥పూవంటి॥
ఆ: కన్నుల సంకేతమె కలలకు తొలకరి
వెన్నెల జలపాతమె వలపుకు తదుపరి
గుండెలో సంగీతమె కురిసినదెందుకో
కోయిల పాటే యిలా పలికిన విందుకు
చిలువగ ఎదమారె మధువనిగా అమవస నిశిమారే వెన్నెలగా
అంజలీ అంజలీ యిది హృదయాంజలి
నీ ప్రేమ లాహిరికి పుష్పాంజలి నీ గాన మాధురికి గీతాంజలి
ఎద దోచు నవ్వులకు నటనాంజలి
కవియైన నీ మదికి కవితాంజలి అ:॥అంజలీ॥
అ: అంజలీ నీ చూపులో వెన్నెల వెల్లువే
అంజలి నా ఊపిరై పలికెను పల్లవే
కన్నుల నువు లేనిదె కలలే రావులే
నా మదిలో నువు లేనిదే కవితే లేదులే
తెలిసెను నువ్వే నా మనసువని మోజుకు నెలవైన వలపువనీ
అ: అంజలీ అంజలీ వలపు లతాంజలీ ॥పూవంటి॥

## ఇద్దరు

రచన: వేటూరి — గానం: ఉన్నికృష్ణన్, బొంబాయ్‌జయశ్రీ

అ: శశివదనే శశివదనే స్వర నీలాంబరి నీవా
అందెల వన్నెల వైఖరితో నీ మది తెలుపగ రావా
అచ్చొచ్చేటి వెన్నెలలో విచ్చందాలు నవ్వగనే
గుచ్చెత్తేటి కులుకు సిరి నీదా (2)
ఆ: నవ మదనా నవ మదనా కలపకు కన్నుల మాట
శ్వేతాశ్వమ్ముల వాహనుడా విడువకు మురిసిన బాట
అచ్చొచ్చేటి వెన్నెలలో విచ్చందాలు నవ్వగనే
గిచ్చే మోజు మోహనమే నీదా (2)
అ: మదన మోహినీ చూపులోన మాండురాగ మేలా (2)
ఆ: పడుచువాడినీ కన్ను వీక్షణ పంచదార కాదా
అ: అలా యిలా మేఘమాసం
క్షణానికో తోడిరాగం (2)
ఆ: చందనం కలిసిన ఊపిరిలో కరిగే నే కలకట్టినిల్లే
అ: ॥శశివదనే॥ ఆ: ॥అచ్చొచ్చేటి॥ ॥శశి॥
ఆ: నెయ్యం వియ్యం ఏదేదైనా అయినా తనువు నిలువదేలా (2)
అ: నేను నీవు ఎవ్వరికెవరం వలపు చిలికెనేలా (2)
ఆ: ఒకే ఒక చైత్రవేళ పురే విడి పూతలాయె (2)
అ: అమృతం కురిసిన రాతిరివో జాబిలి హృదయం జతచేరే
ఆ: ॥నవవదనా॥ అ: ॥అచ్చొచ్చేటి॥
ఆ: ఆ... ఆ... అ: నీదా...

## సఖి

రచన: వేటూరి — గానం: కళ్యాణి మీనన్, హరిణి, కల్పన

ప: అలై పొంగెరా కన్నా మానసమలై పొంగెరా
ఆనంద మోహన వేణుగానమున
ఆలాపనే కన్నా మానసమలై పొంగెరా
నీ నవరస మోహన వేణుగానమది అలై పొంగెరా కన్నా
చ: నిలబడి వింటూనే చిత్తరువైనాను (2)
కాలమాగినది రాదుర ప్రాయమున యమున మురళీధర
యవ్వనమలై పొంగెరా కన్నా... ఆ... ఆ...
చ: కనుల వెన్నెల పట్ట పగల్ పొల్చిలుకగా
కలువ రేకుల మంచు ముత్యాలు వెలిగే
కన్నె మోమున కనుబొమ్మలటు పొంగె
కాదిలి వేణుగానం కానడ పలికే (2)
కన్నె వయసు కళలొలికే వేళలో...కన్నె సొగసు ఒక విధమై ఒరిగెలే
చ: అనంత మనాది వసంత పదాల సరాగసరాల స్వరానివా
నిశాంత మహీజ శకుంతమరందమెడారి గళాన వర్షించవా
చ: ఒక సుగంధ వనాన సుఖాల క్షణాన
వరించి కౌగిళ్ళు బిగించవా (2)
చ: కడలికి అలలకు కథకళి కలలిడు శశికిరణము వలె చలించవా
చిగురు సొగసులను తలిరుటాకులకు రవికిరణాలే రచించవా
చ: కవిత మదిని రగిలె ఆవేదనో ఇతర భామలకు లేని వేదనో (2)
ఇది తగునో ఎద తగవో ఇది ధర్మం ఔనో (2)
కొసరి ఊదు వేణువున వలపులే చిలుకు
మధుర గాయమిది గేయము పలుకగా ॥అలై॥

## దొంగ దొంగ

రచన: రాజశ్రీ — గానం: మనో, చిత్ర

కొత్త బంగారులోకం మాకు కావాలి సొంతం
గాలి పాడాలి గీతం పుడమి కావాలి స్వర్గం ॥కొత్త॥3॥
జంతరల వంకలుండే నింగి కావాలి మాకు
వెండి వెన్నెల్లలోనె వెయ్యికలలు పండాలి మాకు
పువ్వులే నోరు తెరిచి
మధుర రాగాలు నేర్చి
పాటలే పాడుకోవాలి అది చూసి నే పొంగి పోవాలి
మనసనే ఒక సంపదా ప్రతి మనిషిలోనూ ఉండనీ
మమతలే ప్రతి మనసులో కొలువుండనీ
మనుగడే ఒక పండగై కొనసాగనీ ॥కొత్త॥
ఓడిపోవాలి స్వార్థం ఇల మరచిపోవాలి యుద్ధం
మరణమే లేని మానవులె ఈ మహిని నిలవాలి కలకాలం
ఆకలే సమసిపోనీ
అమృతం పొంగిపోనీ
శాంతి శాంతి అను సంగీతం ఇంటింట పాడనీ ప్రతి నిత్యం
భేదమే ఇక తొలగనీ
వేడుకే ఒక వెలగనీ
ఎల్లల పోరాటమే ఇక తీరనీ
ఎల్లరూ సుఖశాంతితో ఇక బతకనీ ॥కొత్త॥


జనవరి 6
ఎ.ఆర్.రెహమాన్
జన్మదిన సందర్భంగా
సంగీత ప్రియులందరి తరపున
శుభాకాంక్షలతో...
హాసం



సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్
WISH YOU HAPPY
2002
మనసంతా నువ్వే
Says my little heart...
యం.యస్.రాజు
వి.ఎన్. ఆదిత్య
పరుచూరి బ్రదర్స్
ఎస్. గోపాల్ రెడ్డి
ఆర్.పి.పట్నాయక్
బి.భాస్కర్ రాజు
సిరివెన్నెల
కె.వి.కృష్ణా రెడ్డి